డా॥ జి.వి. పూర్ణచంద్

# తెలుగే ప్రాచీనం

## కొనసాగవలసిన పరిశోధనలు



సింధు లిపిలో తెలుగు పదాలకు సాక్ష్యాలు

ప్రాటో తెలుగు ప్రజలతో ఆర్యుల సహజీవనం

తెలుగు, సంస్కృత భాషల మధ్య ఆదాన ప్రదానాలు

దెక్కన్ నుంచి సుమేరియా వరకూ విస్తరించిన తెలుగు సంస్కృతి



ఆంధ్రప్రదేశ్ అధికార భాషాసంఘం

# తెలుగే ప్రాచీనం

## కొనసాగవలసిన పరిశోధనలు

డా॥ జి.వి. పూర్ణచంద్
B.A.M.S.

ప్రచురణ
ఆంధ్రప్రదేశ్ అధికార భాషాసంఘం
సచివాలయం, హైదరాబాద్

# తెలుగే ప్రాచీనం

# TELUGE PRAACHEENAM

**Study by**

**Dr. G..V. Purnachand,** B.A.M.S.

Susruta Ayurvedic Speciality Hospital
1st Floor, Satnam Towers
Opp. Buckinghampet Post Office,
Governorpet, Vijayawada-520 002.
Phones: 0866- 2577373 (O), 2483677 (R), Cell: 94401 72642

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 2008
ప్రతులు : 1,000

ప్రచురణ
**ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం,**
దక్షిణ 'హెచ్' భవనం, సచివాలయం, హైదరాబాద్.
ఫోన్ : 23450153

ముద్రణ
**మహతి ప్రింట్ క్రియేషన్స్,**
చిక్కడపల్లి, హైదరాబాద్ - 20.
ఫోన్ : 66772225

2

డాక్టర్ జి.వి. పూర్ణచంద్ మనోగతం...

# తెలుగే ప్రాచీనం

కొనసాగవలసిన పరిశోధనలు

మానవ వికాస క్రమం అంతా సంఘర్షణలు సంలీనాల చక్రభ్రమణంగానే సాగింది.

మనుగడ కోసం మనిషి పడే పాట్లే పరిణామ వికాస క్రమంలో ఆటుపోట్లకు కారణాలు అయ్యాయి.

సంఘర్షణల అనంతరం గెలిచినవారికి ఓడినవారు బానిసలవుతారు. ఆ బానిసల ద్వారా గెలిచినవారు సంతానం కంటారు. ఆ సంతానం కొత్త తరంగాఎదుగుతుంది.

సంలీనం చెందగలిగిన ప్రజలే కొత్త రక్తంతో, కొత్త భావాలతో, కొత్త భాషలతో, కొత్త ఆచార వ్యవహారాలతో సరికొత్తగా జీవించడం ప్రారంభించగలుగుతారు. ఆ రెండు తెగల (లేదా) జాతుల మిశ్రమ సంస్కృతి, మిశ్రమ ఆచారాలు, మిశ్రమ భాష ఇవన్నీ వారికి ఆ కొత్తదనాన్ని సంతరింప చేస్తాయి.

నిజానికి, వివిధ జాతుల మధ్య ఎలాంటి సంఘర్షణలు లేకుండా జరిగిన సంలీనాలు చరిత్రలో బలీయమైన అధ్యాయాలను సృష్టించాయి. అలా కాకుండా, ఎలాంటి సంలీనాలు లేకుండా కేవలం సంఘర్షణలకే పరిమితమైన తెగలు చరిత్రలో నశించిపోయినవిగా కనిపిస్తాయి. ఎన్నో భాషలు, ఎన్నో సంస్కృతులు ఇలానే రూపుమాసిపోయాయి.

జాతుల మధ్య జరిగిన సంలీనాలే మానవ జాతి చరిత్రను నిర్మించాయనేది ముఖ్య విషయం.

ఒక జాతి ప్రజలు అభివృద్ధి చెందడానికి ఆ ప్రజలు

మాట్లాడిన భాష, వారి సంస్కృతి వికాసం పొందడానికి ఒక భాషలోంచి మరొక భాష విడివడి స్వతంత్ర భాషగా రూపొందడానికి, ఒక భాష కొన్ని శతాబ్దాలకే కనుమరుగు కావడానికి, ఈ పరిణామాలన్నీ నేపథ్యంగానే కనిపిస్తాయి.

ఒక జాతి ప్రజల చరిత్ర దాన్ని ఏలిన రాజులు, మంత్రుల చరిత్రకన్నా వాళ్ళు నిర్వహించిన యుద్ధాల చరిత్రకన్నా గొప్పది, విశాలమైంది, విస్తృతమైంది కూడా.

తెలుగు ప్రజల సాంఘిక చరిత్రని పరిశోధకులు ఎక్కువలో ఎక్కువగా శాతవాహనుల యుగం వరకూ తీసుకు వెళ్ళగలిగారు. నేలకన్నా ముందు, నీళ్ళకన్నా ముందు తెలుగు పుట్టిందని చెప్పే దుస్సాహసాన్ని ఏ తెలుగువాడూ ఏనాడూ చేయలేదు. ఆర్యులనూ, ఆర్యధర్మాలనూ వ్యతిరేకించిన భిన్న మతాలు తెలుగునేలమీదే ఆశ్రయం పొంది, అభివృద్ధి పొందిన వైనాన్ని విస్మరించలేము.

కృష్ణ ,గోదావరి, తుంగభద్ర నదీ తీర ప్రాంతాలలో వేదాలకు వ్యాఖ్యలు తొలిసారిగా వెలువడడం, ఆ సంప్రదాయానుగుణం గానే మల్లినాథుడు  సంస్కృత కావ్యాలను వ్యాఖ్యానించడం ఇవన్నీ యాదృచ్ఛికంకావు.

ఈనాటి హిందూ సంస్కృతి రూపుకట్టుకున్నది  తెలుగు నేలమీదేనని, భారతీయ సంస్కృతిలో కులవ్యవస్థతో సహా అనేక సామాజిక, సాంస్కృతికాంశాలకు తెలుగునేల వేదికగా నిలిచిందన్నది విశేషమైన వాస్తవం.

తెలుగు జాతి మూలాలను, తెలుగు భాష మూలాలను, తెలుగు నాగరకత మూలాలను శాతవాహనుల దగ్గర వెదికితే, అక్కడ చిగురుటాకులు మాత్రమే దొరుకుతాయి.

సింధు నాగరకతలోనూ, సుమేరియా నాగరకతలోనూ ఆ మహావృక్షం మాను కన్పిస్తుంది. ఆఫ్రికా సహారా నాగరకతలో వెదికితే కొన్ని పిల్లవేళ్ళు కనిపిస్తాయి. తల్లివేరుని వెతకడానికి ప్రయత్నంచేసినవారు అరుదు.

ప్రాచీనమైనవని భావిస్తున్న నాగరకతలన్నింటిలోనూ పూర్వద్రావిడ పదరూపాలు అనేకం కన్పిస్తుండడంతో ప్రపంచ వ్యాప్తంగా ఇప్పుడు పరిశోధకుల దృష్టి ద్రావిడ భాషలవైపు మళ్ళింది.

అంతరించిపోయిన అనేక ప్రాచీన భాషలు – ఆఫ్రికాలో మండింగ్, ఇరాన్‌లో ఇలమ్, సుమేరియా, బాబిలోనియా, ఈజిప్ట్‌లలో దొరికిన అనేక శిలాఫలకాలలోని ఆయా భాషా పదాలను అర్థం చేసుకొని చదువుతున్నకొద్దీ అవి ద్రావిడ భాషా రూపాలుగా బయటపడసాగాయి. విశేషంగా వాటిలో ఎక్కువ పదాలు తెలుగులో సజీవంగా ఉండడమే కాకుండా రూప సామీప్యతని, భావ సామీప్యతని కూడా కలిగి ఉండటాన్ని గమనించవచ్చు.

ప్రపంచస్థాయి పరిశీలకులకు తెలుగు భాషాపదాలను అధ్యయనం చేయడానికి సరిపడిన మహా నిఘంటువు (లెక్సికన్) ఏదీ అందుబాటులో లేని కారణాన ఇతర భాషా పరిశోధకులు తమిళ లెక్సికన్ ఆధారంగా పరిశోధనలు కొనసాగిస్తున్నారు. ఫలితంగా తమిళమే ప్రాచీనం అనే ఒక అభిప్రాయం బలపడింది.

ఉన్నంతలో పరిశోధకులకు ఒకే ఒక్క ఆధారం ఎం.బి. ఎమెనో, టి. బరో, మహనీయులు రూపొందించిన ద్రవిడియన్ ఎటిమలాజికల్ డిక్షనరీ మాత్రమే. దాని ఆధారంగా ప్రాచీన ప్రపంచ భాషా రూపాల్ని, పూర్వ ద్రావిడ భాషారూపాల్ని తెలుగు, తమిళ రూపాలతో సరిపోల్చి విశ్లేషించినప్పుడు తమిళం కన్నా తెలుగు పదాలే వాటికి దగ్గరగా ఉండటాన్ని ఎవరైనా గమనించవచ్చు.

దీని అర్థం తెలుగు భాషలోంచే ఆయా ప్రపంచ భాషలు ఏర్పడ్డాయని అనడం ఎంతమాత్రమూ కాదు.

ఆ యా అతి ప్రాచీన జాతులతో పూర్వ తెలుగు ప్రజలకు సమీపత్వమో, లేదా సమీపవర్తిత్వమో ఉండటం వల్లనే ఇంత

అతికినట్లుగా పదరూపాలు, పదబంధాలు ఉండేందుకు అవకాశం కలిగిందని స్పష్టంగా చెప్పవచ్చు.

ఈ దృష్టికోణంలోంచి పరిశీలించి, సింధునాగరకత కాలంలో ఈ ప్రొటో తెలుగు ప్రజలు నిర్వహించిన గణనీయ పాత్రని కొంతమేర అర్ధంచేసుకోవటానికి ప్రయత్నం చేశాను.

తెలుగువారు గర్వించదగిన భాషావేత్త ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారి పరిశోధనలతోపాటు మలయాండీ, కాశీ పాండ్యన్, ఇరావతం మహదేవన్, మైకేల్ విజ్జల్ ప్రభృతుల పరిశోధనాంశాల ఆధారంగా 'హరప్పా' ప్రొటో తెలుగు ప్రజల నాగరకతగా ఒక ఊహాత్మక భావనచేశాను. పరిశోధనలు ఇంకా కొనసాగితే ఈ ఊహలు ఒకనాటికి నిజం కావచ్చునని ఆశపడుతున్నాను.

'ప్రొటో ద్రావిడ' అనే పదం ఎక్కడ కనిపించినా దాన్ని 'ప్రొటో తమిళ'గా మార్చి రాస్తూ, తమిళ భాషలోంచే ఈ సృష్టి ఏర్పడిందనే ఒక భావనని బలంగా వ్యాపింప చేస్తున్న తరుణంలో 'తెలుగే ప్రాచీనం' అనే ఆలోచనని నా తెలుగు ప్రజలకు కలిగించి, భాషోద్యమదీప్తిని, స్ఫూర్తిని రేకెత్తించడం కోసం ఈ ప్రయత్నానికి పూనుకొన్నాను.

నా చేతికి మంత్రదండం ఇచ్చి, నాతో అనేక వ్యాసాలు రాయించి ఈ సాహసం చేయమని ప్రోత్సహించిన అద్భుత వ్యక్తులు ఇద్దరు. ఒకరు నా పెద్దన్నయ్య, నాతోపాటు వైద్య వృత్తి చేస్తూనే నడుస్తున్న చరిత్ర సంపాదక బాధ్యతలు నెరవేరుస్తున్న డాక్టర్ సామల రమేష్ బాబు. రెండవ వారు నా చిన్నన్నయ్య - వారితోపాటు నేనూ భాషోద్యమంలో కుడిభుజంలా పనిచేస్తున్నాను - గౌరవ మంత్రివర్యులు శ్రీ మండలి బుద్ధప్రసాద్. ఈ ఇద్దరికీ నేను ఎంత చెప్పుకున్నా కృతజ్ఞతలు చాలవు.

తెలుగు భాషకోసం నా ప్రయాసని కనిపెట్టి, నా భుజం

తట్టి నన్ను ముందుకు తోసినవారు మరో ఇద్దరు... ఒకరు నేటి తెలుగు పత్రికా రంగానికి దశని, దిశని నిర్దేశించిన ప్రముఖ పాత్రికేయులు, ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం అధ్యక్షులు డాక్టర్ ఎ.బి.కె. ప్రసాద్. ఈ గ్రంథాన్ని అధికార భాషా సంఘం ప్రచురణగా వెలువరించి నాకు ఎనలేని గౌరవాన్ని ఆయన అందించారు. రెండవవారు ప్రముఖ భాషావేత్త ద్రావిడ విశ్వ విద్యాలయం కులపతి ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణగారు. నా ఆలోచనల్లో కొంతైనా పరిణతి కలగడానికి కారకులైన ఈ ఇద్దరికీ నా నమోవాకాలు.

నా ఈ పరిశీలనలకు ప్రథమ శ్రోతగా ఉంటూ, నాకు కొత్త ఆలోచనలకు ఉప్పందించిన నా మిత్రులు డాక్టర్ గుమ్మా సాంబశివరావు, నన్ను ఎప్పుడూ ముందు నిలబెట్టి తాను వెనక నుంచుని నడిపించే మా కృష్ణా జిల్లా రచయితల సంఘం అధ్యక్షులు, మాన్య మిత్రులు శ్రీ గుత్తికొండ సుబ్బారావులకు హృదయపూర్వక అభివాదాలు తెలుపుకొంటున్నాను

ఇంటి భాషకూడా ఇంగ్లీషు మయమై అమ్మపట్ల, అమ్మ భాష పట్ల, అమ్మ పలుకుబడుల పట్ల మమతానురాగాలను మరచిపోతున్న నేటి తరుణంలో మనది అత్యంత ప్రాచీన జాతి అని, మనది అత్యంత ప్రాచీన నాగరకత అని నా తరానికి గుర్తుచేయడం కోసం ఈ రచనను చేస్తున్నాను.

అమ్మని అమ్మా అని నోరారా పిలిచే తెలుగు కలువ బాలలకు ఈ పుస్తకాన్ని అంకితం చేస్తున్నాను.

**మండలి బుద్ధప్రసాద్**
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పశు సంవర్ధక శాఖ,
పాడి పరిశ్రమాభివృద్ధి, పశు వైద్య విశ్వ విద్యాలయం,
మరియు మత్స్య శాఖా మాత్యులు




ఫోన్: 23450362 (ఆ)
హైదరాబాద్

# సరి అయిన సమయంలో వచ్చిన పరిశోధన

తమిళ భాషే ప్రాచీనం అని ఒక ప్రచారం ఇంతకాలంగా జరిగిపోతూ ఉంది. ఒక ప్రతిష్ఠాత్మక స్థాయిని తమిళ భాషీయులు కోరి సాధించుకొనేదాకా, తక్కిన ద్రవిడ భాషల వారు ఈ అంశాన్ని పట్టించుకోకుండా ఉన్నారు.

ఇండో యూరోపియన్ భాషల్లోంచి ఎదిగిన సంస్కృతంతోపాటు, ఆ మాటకొస్తే దానికంటే కూడా తమిళం ప్రాచీనం అని పదేపదే తమిళులు ప్రచారం చేసుకొంటున్నారు. ఇది పరాకాష్టకు చేరి, తమిళానికి మాత్రమే 'క్లాసికల్' (విశిష్ట ప్రాచీన) భాషగా కేంద్రం నుంచి గుర్తింపునూ, దానిని బట్టి వచ్చే గౌరవం, ధనం, ప్రతిష్ఠలను సాధించుకొన్నారు. ముందు తమిళానికి 'క్లాసికల్' హోదానిచ్చి, ఆ తర్వాత కొన్నాళ్లకు సంస్కృతానికి కూడా ఆ హోదానిచ్చారు.

తెలుగు ప్రాచీనత విషయంలో సాధికారిక పరిశోధనలపై మనం దృష్టిపెట్టలేదు. కొమర్రాజు లక్ష్మణరావు, మల్లంపల్లి సోమశేఖర శర్మ, వేటూరి ప్రభాకర శాస్త్రి వంటి పండిత పరిశోధకులు చేసిన కృషి తప్ప ఆ తరువాత పరిశోధనల కొనసాగింపు విషయంలో మనం దృష్టి పెట్టి పనిచేయలేదన్నది నిర్వివాదాంశం. తమిళులు మనలాగా కాకుండా ఎన్నో ఏళ్ళుగా అంతర్జాతీయ స్థాయిలోనే తమిళప్రాచీనతపై దృష్టిసారించి పనిచేశారు. మన విశ్వ విద్యాలయాలు తెలుగు ప్రాచీనత విషయంలో చేసిన పరిశోధనలు అంతంత మాత్రమే. తమిళీయులు స్వరాష్ట్రాన్ని, స్వదేశాన్నిదాటి ఇతర దేశాలలోని విశ్వవిద్యాలయాల్లో తమిళ పీఠాలు నెలకొల్పుకున్నారు. ఇప్పటికైనా మనం కళ్ళు తెరవాలి. పరిశోధనలకై నడుం కట్టాలి. ఈ దృష్టితో డాక్టర్ జి.వి. పూర్ణచంద్ లేవనెత్తిన అంశాలపై నేటి పరిశోధకులు దృష్టి సారించాలి. ఏ ప్రభుత్వ సహాయమూ, విశ్వవిద్యాలయాల సహకారమూ ఆశించకుండా తెలుగు జాతి వైభవాన్ని వెలికి తేవడానికి నాడు కొమర్రాజు, మల్లంపల్లి వంటి వారు నడుంకట్టారు. నేటి

పరిశోధకులు ఆ స్ఫూర్తిని అంది పుచ్చుకోవాలి. ఇవాల్టి వరకు వారు చేసిన కృషికి తెలుగు జాతికి వారు ప్రాతఃస్మరణీయులుగా మిగిలారు.

నిజానికి తమిళమెంత ప్రాచీనమో, తెలుగూ అంత ప్రాచీనమేనని మనం భావిస్తాం. అయినా ఇప్పుడు మన భాష విస్మరించబడేసరికి మనకు మనస్తాపం కలిగింది. తమిళం కంటే అన్నివిధాలుగా తెలుగే ప్రాచీనమనీ, విశిష్ఠమనీ చెప్పిన పెద్దలు మనకు గుర్తుకొచ్చారు. తమ భాష కోసం కన్నడ సోదరులూ ముందుకొచ్చారు. తెలుగుకూ, కన్నడానికీ కూడా ప్రాచీన భాషా ప్రతిపత్తినివ్వాలని గట్టి డిమాండ్లు వచ్చాయి. రాష్ట్రమంతటా సభలు, నిరసన దీక్షలు సాగిన పిమ్మట, ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఏకగ్రీవ తీర్మానం చేసింది. కేంద్రాన్ని కోరుతూ ఒక 'టాస్క్‌ఫోర్సు'ను ముఖ్యమంత్రి గారు ఏర్పరచడంతో ఆ కమిటీ సభ్యులు ప్రధానమంత్రిగారిని స్వయంగా కలిసి తమ వాదాన్ని విన్నవించడం జరిగింది. మాన్య ముఖ్యమంత్రివర్యులు డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి గారు స్వయంగా ప్రధానమంత్రి గారిని కలిసి దీని విషయమై విన్నవించారు. త్వరలోనే యీ ప్రతిపత్తి తెలుగుకు కూడా వస్తుందని ముఖ్యమంత్రి గారూ, కేంద్రమంత్రులూ విశ్వసిస్తున్నారు. తెలుగు, కన్నడ భాషల్ని కూడా గుర్తించాలనే డిమాండ్లు పరిశీలన దశలో ఉన్నాయి.

ఈ లోపుగా తెలుగుభాష ప్రాచీనతపైనా విశిష్టతపైనా అన్వేషణలు, చర్చలు, పరిశోధనలు పుంజుకొన్నాయి. వీలున్నన్ని సాక్ష్యాధారాలను వెలికితెచ్చి తెలుగు విశిష్టతను లోకానికి చాటాలన్న ప్రయత్నం జరుగుతోంది. ఈ కృషిలో పాలుపంచు కొంటున్న వారిలో డా॥ జి.వి. పూర్ణచంద్ గారిని ప్రముఖంగా చెప్పుకోవాలి. ద్రవిడం అన్నదంతా తమిళం కాదనీ, ద్రవిడం అంటే తెలుగు కూడా అనీ, కన్నడ మలయాళీలతోపాటు తక్కిన చిన్నచిన్న ద్రవిడ భాషలకు కూడా ద్రవిడ భాషా కుటుంబ గౌరవం దక్కాలని డా॥ జి.వి.పూర్ణచంద్ వాదిస్తున్నారు. ద్రవిడ మూలాలను ఎక్కువగా నిలబెట్టుకోవడమే గాక, ఎన్నోవిధాలుగా తనదైన ప్రత్యేకతని కలిగి యీనాటికీ అనేక ప్రపంచ దేశాల భాషలలో తెలుగు పదాలుండడాన్ని విస్మరించరాని విషయమని ఆయన చెపుతున్నారు. లోతుల్లోకిపోయి ఆ వివరాలనందిస్తున్నారు. ఎన్నో తెలుగు పదాలను సంస్కృతం తనలోకి తీసుకొన్నదని ఎత్తిచూపుతున్నారు. తన అన్వేషణ

ఫలితాలకు నిరూపణగా జాతీయ అంతర్జాతీయ భాషా శాస్త్రజ్ఞులను, ఇతర పరిశోధకులను ఆయన ఉటంకిస్తున్నారు. ఈ విషయాలన్నీ వరుసగా వ్యాసాల రూపంలో నడుస్తున్న చరిత్ర మాసపత్రికలో ప్రచురణ కావడంతో పరిశోధకులనేకమందికి కొత్త ఆలోచనలు కలిగించినట్లయింది. ప్రజల్లో ఆత్మగౌరవాన్ని పెంచినట్లయింది.

డా॥ జి.వి.పూర్ణచంద్ వృత్తిపరంగా ఆయుర్వేద వైద్యుడు. ప్రవృత్తిపరంగా రచయిత, చరిత్ర పరిశోధకుడు. కాగా, విభిన్నమైన, విశిష్టమైన అంశాలతో ఆయన చేసిన రచనలు ఆయనను ఒక ప్రత్యేకమయిన రచయితగా నిలబెట్టాయి. కృష్ణాజిల్లా రచయితల సంఘానికి ఆయన ప్రధాన కార్యదర్శి. ఆ సంఘం ఇటీవల నిర్వహించిన తెలుగు రచయితల జాతీయ, అంతర్జాతీయ మహాసభలు, ఆ సందర్భంగా తెచ్చిన ప్రచురణలు చారిత్రాత్మక స్థాయిలో గుర్తింపు పొందాయి. 'తెలుగే ప్రాచీనం - కొనసాగవలసిన పరిశోధనలు' అనే ఈ పుస్తకాన్ని ఇప్పుడు డా॥ జి.వి.పూర్ణచంద్ రచించి తెలుగు ప్రజలకు అందిస్తున్నారు. దీని నుంచి ప్రయోజనం పొందవలసిన అవసరం తెలుగు జాతికి ఉంది.

డా॥ జి.వి.పూర్ణచంద్‌కు హృదయపూర్వక అభినందనలు.

అధికార భాషా సంఘం పక్షాన అధ్యక్షులు డా॥ ఎ.బి.కె. ప్రసాద్ గారు ఈ పుస్తకాన్ని ప్రచురించడం సమయోచితం. అందుకు వారిని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను.

**- మండలి బుద్ధప్రసాద్**

# వరుస... ఇదీ !

## అధ్యాయం - 3
## తెలుగు నాగరకత- ప్రాచీనత

# చీకటి కోణాలపై సరికొత్త వెలుగులు!

**శూ**రుల పుట్టుక, దేవతల పుట్టుక, యేరుల పుట్టుక తెలుసుకోవడం ఎవడి తరమూ కాదన్నది, మహాభారతం సూక్తి! అలాగే భాషల జన్మరహస్యాల తంతుకూడా! ఇటీవల కాలంలో, రెండువేల సంవత్సరాలకు పైబడిన తెలుగు జాతి, లిపి, నాణాల, శాసనాల భాషా సాహిత్యాల పరిణామ చరిత్రను, తెలుగు ప్రాచీనతను వక్రీకరించడానికి కొందరు తమిళ సోదరులు చేసిన ప్రయత్నం వల్ల, ప్రసిద్ధ వైద్యులు, భాషా పరిశోధనలో తనదైన శైలిలో అకుంఠితమైన దీక్షతో ముందుకు దూసుకు వచ్చిన డాక్టర్ జి.వి.పూర్ణచంద్ **"తెలుగే ప్రాచీనం"** అని సహేతుకంగా దండోరా వేస్తూ ఈ పుస్తకం రాయవలసి వచ్చింది.

అయితే,ఆయన మొండివాదనతో గాక దండిగల వాదనలతో, కండగల నిరూపణలతో తెలుగు భాష ప్రాచీనతను నిగ్గు తేల్చుతూ రావడమే గాక తన మాటే ఆఖరి మాట అని అహంకారం ప్రదర్శించకుండా **"కొనసాగవలసిన పరిశోధనలు"** అని శంకాపీడితుల కోసం ఒక ఉప శీర్షికను కూడా ప్రధాన శీర్షికకు ఉంచడం ప్రశంసనీయం.

దేశంలోని కొన్ని భాషలను ప్రాచీన చరిత్ర గల్గిన/శిష్టమైన లేదా ప్రశస్తమైన/ లేదా విశిష్ఠమైన భాషలుగా (క్లాసికల్ లాంగ్వేజెస్) గుర్తించి వాటిపై పరిశోధనలు కొనసాగించి, ఇంతవరకూ అజ్ఞాతంగా ఉన్న అనేక అంశాలపైన మరింత వెలుగులు ప్రసరింపజేసేందుకు వీలు కల్పిస్తూ దేశంలోని పలు విశ్వ విద్యాలయాల్లో భాషా పీఠాలు ఏర్పరచి, ప్రాచీన ప్రతిపత్తి గల భాషలను తగు విధంగా గౌరవించడానికి వనరులు సమకూర్చాలని భారత ప్రభుత్వానికి దఫదఫాలుగా విజ్ఞాపనలు అందాయి. ఈ విషయంలో భాషా నిపుణులతో సంప్రతింపులు జరిపిన కేంద్ర ప్రభుత్వం **2004 నవంబర్ 1**న దేశీయాంగ వ్యవహారాల (హోమ్) మంత్రిత్వశాఖ ద్వారా తీర్మానం రూపంలో జారీ చేసిన నోటిఫికేషన్‌లో ఒక భాష ప్రాచీనతకు కొలమానాలేమిటన్న విషయమై ప్రస్తావిస్తూ యిలా పేర్కొన్నది:

**"ఏ భాషనైనా దాని జన్మ సంవత్సరం ఫలానా సంవత్సరమేనని నిర్దిష్టంగా,**

**కరాఖండీగా పేర్కొనడం కష్టం. ఎందుకంటే సుదీర్ఘ కాలంపాటు సాగే పరిణామం ఫలితంగా అవతరించేది భాష, విస్పష్టమైన వ్యక్తిత్వంతో అంతిమంగా ఆవిర్భవించేది భాష** (final arrival of a specific linguistic identity)" అయినప్పుడు అలాంటి "సుదీర్ఘ పరిణామ క్రమంలో" అవతరించిన ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాషలు - తెలుగు, తమిళం, (ద్రమిళ), కన్నడం, మలయాళం. వీటి ప్రాచీన, అర్వాచీన ద్రావిడ మూలాల గురించి, వీటితో పెనవేసుకుని ఉన్న ఆదివాసీ భాషామూలాల గురించి పండిత పరిశోధకులు యిప్పటికి కొన్ని దశాబ్దాల క్రితమే రూఢమైన నిర్ణయాలకు వచ్చారు. తెలుగు ప్రాచీనతకు సంబంధించిన ఆకరాల గురించిన తబిశీళ్లను ఈ గ్రంథ రచయిత డా॥పూర్ణచంద్ అనేక కోణాలనుంచి తడిమారు.

కాని, ప్రస్తుతం చర్చలో పొరుగువాడి అసూయవల్ల వివాదాస్పదంగా మారిన సమస్యల్లా - నిజమైన తెలుగు భాషా చరిత్ర ప్రారంభం నన్నయతోనే జరిగింది కనుక, నన్నయ 11వ శతాబ్దం వాడు కనుక, అప్పటి నుంచే తెలుగు భాషకు పునాదులు లేచాయి కాబట్టి, తెలుగు వారి "ఆదికవి" నన్నయ అని తెలుగు పండితులే రాసుకున్నారు కాబట్టీ తెలుగు ప్రాచీనం కాదు, తమిళమే ప్రాచీనం, దాని చరిత్రే చరిత్ర అని చాటింపు వేస్తూ **"భూమి పుట్టకముందే, భూమిపై రాళ్లూరప్పలూ పుట్టకముందే" తమ భాష పుట్టిందనీ ఆ భాషకు చెందిన కొందరు సోదరులు** అబద్ధ ప్రచారం ద్వారా ఆ భాషకు ప్రాచీన హోదా సంపాదించుకోవడం! "ద్రావిడ భాషలపట్ల, వాటి అధ్యయనం పట్ల, వాటి సాహిత్యంపట్ల **ద్రావిడ జాతుల సంస్కృతిపట్ల మరీ పనిగట్టుకుని "అశ్రద్ధ" ("Special neglect") జరిగిందని** యాభైఏళ్లనాడే తమిళంలో పండితుడైన జకోస్లేవేకియా ఆచార్యుడు డాక్టర్ కామిల్ జెలిబిల్ (1958, ఫిబ్రవరి 6) వాపోవలసి వచ్చింది. **"భారతీయ నాగరికతా పరిణామంలో ద్రావిడ భాషలూ, వాటి సాహిత్యమూ అసాధారణమైన, అపూర్వమైన పాత్ర వహించాయ"**నీ కనుకనే ద్రావిడ భాషా, సాహిత్య, సంస్కృతీ పరిణామాన్ని లోతుగా పరిశోధించాల్సిన అవసరం ఉందనీ స్పష్టం చేశాడు. ఇలా ద్రావిడ భాషలను ఆయన కొనియాడినప్పుడు, ఆ ప్రత్యేక ప్రతిపత్తిని ఒక్క తమిళానికే పరిమితం చేయలేదనీ, మొత్తం ద్రావిడ భాషా కుటుంబానికే అన్వయించాడనీ మనం గమనించాలి. ఈ విషయాన్ని మరో రూపంలో ఆచార్య అమరేశం రాజేశ్వరశర్మ యిలా ధృవీకరించారు : ద్రావిడ భాషా

కుటుంబానికి చెందిన తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం "క్రీస్తుకు పూర్వకాలం లోనే విడిపోయి ప్రత్యేక భాషలుగా వృద్ధి పొందినవే. అంటే **తమిళం ప్రత్యేక భాషగా ఏర్పడినప్పుడే తెలుగు కూడా ప్రత్యేక భాషగా ఏర్పడింది. తమిళ భాష ఎంత ప్రాచీనమయిందో తెలుగు కూడా అంత ప్రాచీనమయిందని** స్పష్టం అవుతుంది. సమష్టి కుటుంబంలో ఉన్న ఇద్దరన్నదమ్ములు వేరు కుటుంబాలుగా ఏర్పడితే ఆ యిద్దరివీ ఒకే సమయంలోనే ప్రత్యేక కుటుంబాలుగా ఏర్పడతాయి కాని ఒకరిదొక రోజూ, మరొకరిదింకొక రోజూ ప్రత్యేక కుటుంబాలుగా ఏర్పడవు గదా! కనుక తెలుగు, తమిళాలు రెండూ సమానమయిన ప్రాచీనత కలవని అంగీకరించక తప్పదు." **("ఆంధ్రవిష్ణువు కాలంలో వెలసిన తెలుగు వ్యాకరణం"** రచన)!

ఇంతకూ మన బంగారం మంచిదైతే ఇతరులను నిందించవలసిన అవసరం లేదు! ఎందుకంటే పదాన్నీ, పాటనూ, జనపదాన్నీ, జానపదులనూ ఈసడించుకుంటూ "చిల్లరపాటలు"గా చిత్రిస్తూ వచ్చిన మన పండిత వర్గంలోని కొందరి వల్ల, ఆది నుంచీ విద్యను తమ గుత్తసొమ్ముగా భావించి ఇతర సామాజిక వర్గాలను విద్యకు దూరం చేసినందువల్లా, మన భాష ప్రాచీనతకు రకరకాల అడ్డంకులు ఏర్పడుతూ వచ్చాయి. అందుకే సుప్రసిద్ధ పరిశోధకులు, "సమగ్ర ఆంధ్ర సాహిత్యం" గ్రంథకర్త అయిన కవి ఆరుద్ర చెప్పినట్టుగా మన పండితులకు పదకవిత్వమంటే ఈసడింపు. 'ముది విటులు విధవ లంజలు పదకవితలు' అని నోటికొచ్చినట్టు తిట్టి పోశారు. నిన్న మొన్నటి దాకా అన్నమయ్య పదసంపదను కూడా విస్మరించాం. 32వేల సంకీర్తనలలో కేవలం 12వేలు మాత్రమే లభించటానికి మన పండితుల అశ్రద్ధే కారణం. "పాటను కవిత్వంగా ఎంచక మనం చెడ్డాం. పాటనే తొలి కవిత్వంగా ఎంచి తమిళులు ప్రాచీన సాహిత్యమున్న వాళ్లయినారు"! ఉండడమే కాదు, తమ ప్రాచీన పాటలను విషయాలవారీగా వర్గీకరించుకుని 18 సంపుటాలుగా అరువు తెచ్చుకున్న ఛందస్సులలో గాకుండా సొంత దేశీయ ఛందస్సులో ప్రచురించుకున్నారు. ఈ సంకలన గ్రంథాలు ఎప్పటివి? క్రీ.శ.4వ శతాబ్దివి. అంత మాత్రానే "తమిళులు ప్రాచీన సాహిత్యం గల వాళ్లయినా" **ఈ సంకలనాలు "మన తెనుగు గడ్డ మీద జరిగిన సంకలనాలకు అక్షరాల అనుసరణే"**నని కూడా ఆరుద్ర ఢంకా బజాయించి మరీ చెప్పారు. ఇంతకూ తమిళ సంకలనాలు దేనికి అనుసరణ? క్రీ.శ. 1-2 శతాబ్దులకే హాలుడు (19-24) ఆంధ్రదేశంలోని ప్రాకృతగాథలను సేకరించాడని,

అవి తెలుగు గాథలపై ఆధారపడిన "గాథాసప్తశతి"గా పేర్కొని "అప్పటి తెలుగు పాటలను ఎవరూ సంకలనం చేయకపోవడం మన దురదృష్ట"మనీ ఆయన బాధపడ్డారు. నిజానికి తమిళుల ప్రాచీనతకు ఆనవాళ్లుగా పాత పాటల సంపుటాలు క్రీ.శ. 4వ శతాబ్దిలో వెలువడిన సమయానికే తెలుగునాట **నందికేశ్వరుడి "అభినయ దర్పణము"** రాతప్రతులన్నీ తెలుగు భాషలోనే ఉన్నాయనీ, ఈ గ్రంథం తెలుగు దేశంలోనే పుట్టిందనీ, గ్రంథకర్త తెలుగు వాడేననీ డాక్టర్ ఘోష్ పీఠిక ఆధారంగా ప్రసిద్ధ పరిశోధకులు డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావు తన **"నాట్య శాస్త్రము"** గ్రంథంలో పేర్కొనడం విశేషం. పైగా, ప్రసిద్ధ భారతీయ నృత్య భేదాలన్నింటికీ మూలగ్రంథం నందికేశ్వరుడి "అభినయదర్పణ" మేనని పండిత మానవల్లి రామకృష్ణకవి అభిప్రాయం కూడా. అలాగే 'సంగం' వాఙ్మయం క్రీ.శ. 4వ శతాబ్ది అని కొందరు, కాదు క్రీ.శ 7వ శతాబ్ది నాటిదని కొందరు తమిళ పండితులే వాదించుకున్నందున – ఆ వాఙ్మయంతో కూడా నందికేశ్వరుడి రచన తులతూగుతుందనేది గుర్తించవలసిన అంశం. అలాగే తమిళుల 'సంగం' వాఙ్మయం గురించి వినిపించే కథలు కూడా ఎంత విచిత్రమయినవో విభిన్న అభిప్రాయాలు వెలిబుచ్చిన తమిళ పండితుల నుంచే తెలుసుకోవచ్చు. క్రీ.శ. 4వ శతాబ్ది నాటి "సంగం" యుగాన్ని ('సంఘం' అన్న సంస్కృత పదం నుంచే 'సంగం' పుట్టింది), తమిళ వాఙ్మయాన్ని క్రీస్తుకు పూర్వందని వారి తాలూకు కొందరు పండితులు చూపే ఆధారం బహుచిత్రమయింది! **"భూమి పుట్టకముందే, రాయీ రప్పా పుట్టకముందే" తమిళ భాష పుట్టిందని వాదించగలవారు కాలాన్ని కూడా పనిగట్టుకుని వెనక్కి నడిపించగల సమర్థులు**, దురభిమానానికి హద్దులు చెరపగలవారు! ఆగస్త్య మహాముని తదితర మునులకు తొలి స్థావరం, వారి పెరుగుదలకు ఆధారం ఆంధ్రదేశమనీ, మరీ ముఖ్యంగా కళింగమనీ నిరూపించిన తమిళ పండితుల్ని కాదనగలవారే దేవుడు (మహేశ్వరుడు) పాణినికి సంస్కృత వ్యాకరణాన్ని, అగస్త్యునికి తమిళ వ్యాకరణాన్ని ప్రసాదించాడని కోతలు కోశారు!

తెలుగు సంస్కృతం వల్ల ఎదిగిందనీ, తమిళం మాత్రం సంస్కృతంతో ఎలాంటి సంబంధం లేకుండా స్వతంత్రంగా ఎదిగిన భాషనీ చెప్పే పెద్ద మనుషులు 'సంగం' (కవుల, రచయితల సంఘం) కవుల్లో హెచ్చుమంది సంస్కృతభాషాభిమానులేనని మరచిపోతున్నారు! వారి లక్షణ 'గ్రంథమై'న "తొల్కాప్పియం" పేరులోనే "తొలి కావ్యం" సంస్కృత శబ్దాలకు అనువాదం.

తమిళలిపి కూడా 'బ్రాహ్మి' లిపి నుండే పరిణమించిందని తమిళులూ అంగీకరిస్తారు. ప్రాచీన తెలుగు, ప్రాచీన తమిళాలకు బ్రాహ్మీతోనే మౌలిక సంబంధం. సంస్కృతం – తమిళం కలగలిసిన వ్యాకరణం "వీర చోళీయం". తమిళకవులు సంస్కృత శబ్దాలను స్వీకరించారు. చివరికి తమిళ వేదమని చెప్పుకొనే "తిరుక్కురళ్"లో కూడా సంస్కృత శబ్దాలున్నాయని పండితుల నిర్ధారణ. కంబన్, అరుణగిరినాథర్‌లాంటి మహాకవులూ సంస్కృత శబ్దాలను యథోచితంగా వాడారు. చివరికి తమిళ బృహన్నిఘంటువులో ప్రవేశించిన సంస్కృత శబ్దాలూ ఇందుకు భిన్నం కాదు! అందువల్ల తెలుగు భాష సంస్కృతమయమని, కాబట్టి అది స్వతంత్ర భాషగా ఎదగలేదని పండితులలో ఒక వర్గం చేసే ప్రచారం కేవలం దుష్ప్రచారంగా పరిగణించాలి. తెలుగు దేశం తమకు ఉత్తరంగా ఉన్నందున తెలుగు వారిని ఉత్తరాదివారుగా భావించిన తమిళులు "వడుగరులు" అని పిలిచినట్టే సంస్కృతం ఉత్తర భారతదేశానికి చెందినది కాబట్టి తమిళులు దానిని 'వడుగర' సంప్రదాయంలోనే "వడచోల్" (ఉత్తరాది భాష) అని పిలిచారు.

అంతేగాదు, క్రీ.పూ. 3వ శతాబ్దినుంచి క్రీ.శ.3వ శతాబ్ది మధ్యకాలాన్ని వూహామాత్రంగా తమిళ 'సంగం సాహిత్యం' గా కొందరు తమిళులు గొప్పలు చెప్పుకొంటున్న సమయంలోనే బ్రిటానికా విజ్ఞాన సర్వస్వాన్ని సంకలనం చేసిన ప్రసిద్ధ పండిత సంపాదకులు సహితం **తమిళ 'సంగం' సాహిత్య కాలం క్రీ.శ.1-4 శతాబ్దుల మధ్యనాటిదని రూఢపరిచారు!** ఇక ఈ సాహిత్యంలో ఉన్నవని చెప్పే పాటలు మదురైలో రాసినవనీ, వీటిలో రాజుల ప్రణయగాథలు, వారి పాలనాచర్యలూ రెండే రెండు ప్రధానాంశాలనీ, 'సంగం' సాహిత్యంలో పేర్కొన్న రాజులు పురాణ కల్పిత వ్యక్తులా, వాస్తవికమైన రాజులా అన్న విషయమై నిన్న మొన్నటిదాకా వివాదం నడిచిందని ప్రాచీన నాణాల ప్రసిద్ధ పరిశోధకుడు డాక్టర్ దేమె రాజారెడ్డి వెల్లడిస్తున్నారు. ఎందుకంటే చెన్నైలోని 'దినమలార్' అనే తమిళ పత్రిక సంపాదకుడైన డాక్టర్ ఆర్.కృష్ణమూర్తి, సంగం పాటలలో ప్రస్తావించి ఉన్న కొందరు రాజులకు లేదా సేనానులకు చెందిన నాణాలను కనుగొన్నారు. కాని ఈ నాణాలపైన ప్రస్తావించిన "మక్కొటై" "కుట్టివన్ కోటై" లాంటి పేర్లు గల రాజులే తమిళ దేశానికి అసలు సిసలు పాలకులని చెప్పడానికి ప్రయత్నించారు. కాని, సంగం యుగం నాణాలలో పెక్కింటికి పూర్వ చరిత్ర లేదని, పైగా వాటిని సంగం కాలం తరువాతి

కాలానికి చెందిన చేర, చోళ, పాండ్య రాజులకు అంటకట్టడం జరిగిందనీ డాక్టర్ రాజారెడ్డి నిరూపించారు! చరిత్రలో శాతవాహనుల పాలన క్రీస్తుపూర్వం 1వ శతాబ్దిలో ప్రారంభమయిందనీ, శాతవాహన కాలానికి పూర్వమున్న రాజుల పేర్లు అనేక నాణాలు మన రాష్ట్రంలోని కోటలింగాల, సింగవరంలలో బయల్పడడంతో తెలుగు జాతి భాషా చరిత్ర మరింత ప్రాచీనతను సంతరించుకుందనీ అర్థమవుతోంది.

అంతేకాదు, తెలుగు కథలు వినిపించిన గుణాఢ్యుని ప్రాచీన "బృహత్కథ"ను (క్రీ.పూ.250-150)తమిళులు "పెరుంగద్రై" పేరుతో అనువదించుకున్నారని చెప్పడానికి కూడా మన వాళ్లు జంకారు! "తిరుక్కురళ్" రచయిత ఆంధ్రుడైన కుందకుందాచార్యులేనని (కొనకండ్ల వాసి - అనంతపురం) చెప్పుకోవడానికి కూడా మన వాళ్లు బిడియపడ్డారు! తమిళ ఛందానికి తెలుగు ఛందస్సు ఆధారమని, ఆ ఛందస్సు లక్షణ కర్త అయిన వాంఛయ్య (తమిళనాడులో స్థిర పడినందున వాంఛియార్ అయ్యాడు) అనీ, **"వడుగ ఛందం" అంటే తెలుగు ఛందం అని తమిళుడయినా చెప్పుకున్నాడు** గాని మన వాళ్లు, ఇప్పుడు ఇంగ్లీషులో మాట్లడకపోతే ఏదో న్యూనతా భావానికి లోనయినట్టుగానే ఈ విషయంలోనూ కుంచించుకుపోయారు! **తమిళులు తెలుగు భాషను ప్రాచీన కాలంనుంచీ, "వడగు" ("వడగరు" లేదా "వడుగరు" లంటే తమిళదేశానికి ఉత్తరంగా ఉన్నందున తెలుగువారని అర్థం) అనేవారు.** తమిళులు ప్రాచీనంగా చెప్పుకునే "సంగం" సాహిత్యంలోనే ఈ "వడగ" శబ్దం కనీసం 9 సార్లు వాడారని పండితులు నిర్ధారించారు. ఎందుకంటే, అరవంలోని "యాప్పిరంగన్" అనే ఒక ఛందశ్శాస్త్రంలో (నన్నయ్యకు పూర్వం) వాంఛయ్య అనే తెలుగు లక్షణవేత్త రచించిన గ్రంథాన్ని తాను చూసినట్లు తమిళ గ్రంథ రచయితలు పేర్కొన్నారని పరిశోధకులు చెప్పారు. దానికి రుజువు ఏమిటంటే - తమిళ కవే **"వాంఛియార్ సేయిద వడగు ఛందవు"** (వాంఛయ్య చేసిన వడగు భాషా ఛందస్సు) అని స్పష్టంగా పేర్కొనడంతో నన్నయకు పూర్వమే తెలుగు కవులు ఛందో గ్రంథాలు రాసి ఉండాలని రూఢమవుతోందని, ఈ లెక్కన నన్నయ్యకు చాల కాలం ముందే తెలుగులో, "దేశి" ఛందంలో గ్రంథాలు వెలువడి ఉండాలనీ పింగళి లక్ష్మీకాంతంగారు చెప్పారు!

"మార్గ" (సంస్కృతం ఆధారంగా) తో పాటు "దేశి" పదాలు కూడా సాహిత్య పరంగా, సంగీతపరంగా, నాట్యపరంగా భాషా ప్రయోగంలో ఉన్నాయని ("మార్గ, దేశి విభాగేన/సంగీతం ద్వివిధం - దేశే దేశేషు సంగీతం/తద్దేశీత్యభిధీయతే") వీరేశలింగంగారు స్పష్టం చేశారు. ఇంత ప్రాచీన రచనలను శ్రద్ధతో తెలుగు వాడు

కాపాడుకోలేదు గనుకనే లక్ష్మీకాంతంగారు "ప్రాకృత, సంస్కృతాలతోపాటు **తెలుగు గ్రంథాలు దేశి ఛందంలో చాలా ఉండి ఉండాలని"** చెప్పారు. అయినా వాటి తబిశీళ్లు తవ్వి తీసుకోలేకపోయాం. తెలుగు గ్రంథాలు దేశి ఛందంలో "ఉండి ఉండాల"ని వూహతోకాదు, ఖచ్చితంగా ఉన్నాగాని "దేశి" పదాలను, దేశి సాహిత్యాన్ని "గాసట బీసటగా" భావించిన పండితులే ఆ పద సాహిత్యాన్ని, "దేశి" సాహిత్యాన్ని కూడా నామరూపాలు లేకుండా చేశారంటే ఎవరూ బాధపడనక్కరలేదు. ఈ వినాశానికి నారు పోసి నీరు పెట్టిన వాళ్లు 'మనవాళ్లయ్య' లేనంటే ఎవరూ నొచ్చుకోనక్కరలేదు!

నన్నయభట్టారకునికి "ఆదికవి" బిరుదు తగిలించిన పెద్దమనుషులే తెలుగు ప్రాచీనతకు సంబంధించిన లిపి, భాషా, సాహిత్య శాసనాది ఆకరాలకు కూడా అంత్యక్రియలు తలపెట్టారని చెప్పాలి! ఎందుకంటే, తనకు "ఆదికవి" బిరుదు తొడగమని నన్నయ ఏనాడూ కోరుకోలేదు. నన్నయ మహాభారత రచనను అంత చిక్కగా,చక్కగా, ప్రౌఢంగా రూపొందించాడంటే అతనికి ముందు కనీసం 500 సంవత్సరాల చరిత్ర తెలుగు భాషా సాహిత్యాలకు ఉండి తీరాలి. ఇందుకు దాఖలా రాజరాజ నరేంద్రుడు జరిపిన సాహిత్య సభలను ప్రస్తావిస్తూ నన్నయ మహాభారత రచనకు తానే పొందు పరిచిన "అవతారిక" చాలు. సంస్కృతంలో అలంకార శాస్త్ర గ్రంథాలు 'గిలక' గలిగిన 50 మంది తెలుగు పండితులకు నన్నయ ప్రస్తావించిన, తానై నిర్వహించిన రమ్యమైన "సకల సూరి సభ"ల గురించి తెలియదా? పోనీ ఆ పండిత (సూరి) సభలలో పాల్గొన్న పండితులు నన్నయ అంతటివారు కాకపోయినా దాని దుంపతెగ నాలుగు చరణాలైనా వారు రాసి ఉండరా! నన్నయ కాలంలో విద్యా గోష్ఠులు జరిగే పండిత సభలున్నాయనీ, ఆ సభలలో వివిధ రంగాలలో నిష్ణాతులైన వారు పాల్గొన్నారనీ నన్నయే చెప్పుకున్నాడు గదా. ఈ సభలలో "తెలుగు కవులు కూడా ఉండవచ్చు" నని నంగి నంగి కబుర్లు చెప్పే కొందరు వాదుకు దిగినా, నన్నయ పేర్కొన్న ఆ పండితులూ, పురాణ కర్తలూ, శృంగారాది రసాలతో, భావాలతో ప్రకాశించి కొత్త అర్థాలతో వాక్యాలు రచించడంలో నిపుణులైన ఆ మహా నేర్పరులూ, అధిక ప్రజ్ఞావంతులయిన ఆ తర్కశాస్త్ర పండితులూ ఎవరు? ఎవరై ఉంటారు? వీరంతా తన విద్యా గోష్ఠుల్లో ఉన్నారని చెప్పిన నన్నయ వారెవరో, వారి పేర్లేమిటో చెప్పకుండా తెలివిగా తప్పించుకుని పోయాడు. కాగా, నన్నయను "ఆదికవి"గా ప్రకటించేసి తెలుగు ప్రాచీనతకు చెదలు పట్టించిన ఆ తరువాతి పండిత కవులు కూడా నన్నయ

మాటమాత్రంగా ప్రస్తావించిన ఆ "మహాపండితుల" పేర్లను గాని ఆనాడు "సుచరిత్ర పావన పయఃపరిపూర్ణములైన సత్సభాంతర సరసీవనా"లలో ఈదులాడిన పండితుల గురించిగానీ, చివరికి తనకు భారత రచనలో తోడుగా నిలిచాడని నన్నయ చెప్పిన బహు భాషా పండితుడైన నారాయణభట్టు గురించిగానీ, అతని రచనల గురించిగానీ ఎలాంటి వివరాలూ చెప్పకుండా తప్పించుకున్నారు!

కేవలం సంస్కృతంలో ఆదికవులయిన వాల్మీకిని, వ్యాసుడిని మాత్రమే భారత రచనలో నన్నయ తలచుకోడానికి కొందరు సాహిత్య ధూర్తులు ప్రగల్భిస్తున్నట్టుగా "నన్నయ తనకు ముందు చెప్పదగిన తెలుగు కవులు ఎవ్వరూ లేకపోవడమే" కారణమా? అందువల్లనే నన్నయను "ఆదికవి" గా పరిగణించవలసి వచ్చిందా? అదే నిజమైతే నన్నయ తానే రాసుకొన్నట్టు "బహు భాషల, బహు విధముల" ఎలా చెవులొగ్గి భారత కథను వినగలిగాడు? తన రచనను లోతులకు వెళ్ళి ప్రశస్తమైన బుద్ధితోనూ, ప్రసాద గుణంతోనూ తాను రాసిన కవిత్వంలోని "అక్షర రమ్యత"ను, తెలుగు సుభాషితాలను మెచ్చుకున్నవాళ్ళు తెలుగు కవులు గాక తెగులు పట్టిన కవులెలా అవుతారు? అసలు విషయం, కొందరు తెలుగు పండితులు వాపోతూ వచ్చినట్టు నన్నయకు ముందు "చెప్పుకోదగిన తెలుగు కవులెవరూ లేకపోవడం వల్ల" సంస్కృతపు 'ఆదికవుల్ని' తలుచుకోవడం కాదు. అసలు రహస్యమంతా నన్నయ్యకు పూర్వం తెలుగు కవిత్వం లేదనీ, నన్నయతోనే తెలుగు పదాలకు, కవితలకూ పొద్దు పొడిచిందనీ భావించి, మనకు తెలియని వేరే ప్రయోజనాల వల్ల కథలల్లి నన్నయకు పూర్వమే కాదు, అతని కాలంలోనూ ఉద్దండులూ, సమ ఉజ్జీలయిన పండిత కవులను, వారి రచనలను కావాలనే కనుమరుగు చేయడంలోనే ఉంది!

తిరుమల – తిరుపతి దేవస్థానాల సంయుక్త ప్రచురణగా వెలువడిన కవిత్రయ మహాభారతానికి పీఠిక రాసిన ప్రధాన సంపాదకుడు జి.వి.సుబ్రమణ్యం కూడా ప్రాచీన శాసనాలను ప్రస్తావిస్తూ తెలుగు ప్రాచీనతనకు నివాళిగా **"శాసన పద్య శైలిలో పోలిన రచన ఒకింత గోచరించటం వలన నన్నయకు రెండు మూడు వందల యేండ్ల ముందు నుండే తెలుగు పద్యకవిత్వం"** ప్రజాదరణ పొందినదని ఒప్పుకొనక తప్పలేదు. నన్నయకు ముందు సాధారణ కవి పండితులే గాక ప్రసిద్ధులైన పండిత కవులు కూడా ఉండి ఉండాలి. కాని "ఉండాలి" అని మాత్రమే కాదు, ఉన్నారని నిరూపించుతూ చెప్పిన వారున్నారు. వారిలో ఒకరు విద్వాన్ కె.వి.సుబ్బరాఘవ కవి

(1940లో మదరాసులోని మాంబళంలో విశిష్ఠ ఉపాధ్యాయునిగా పనిచేసిన పరిశోధకుడు). నన్నయకు ముందున్న ప్రసిద్ధ పండితకవులలో అధర్వణాచార్యుడు ఒకరనీ, అయితే ఆయన 'జైన' కవి కావడం వల్ల నన్నయ కన్నా ముందు ఆయన రాసిన మహాభారత రచనను పనిగట్టుకొని తొక్కిపెట్టారని సుబ్బరాఘవకవి వెల్లడించాడు. అలాగే భీమన "రాఘవ పాండవీయం" కావ్యాన్ని కూడా చాల కాలం పాటు కనుమరుగుచేశారు. అంతేగాదు, నన్నయకు ముందు అనేక సంవత్స రాల నుండే తెలుగు (ఆంధ్రం)లో తొలి వ్యాకరణ కర్తలెందరో ఉన్నారని, వారిలో కాణ్వుడు, హేమచంద్రుడు, రావణుడు, పుష్పదంతుడు ప్రముఖులనీ ఆయన పేర్కొన్నాడు. అధర్వణాచార్యులు మున్నగు వారు ఈ విషయాన్ని కూడా వెల్లడించారని సుబ్బరాఘవకవి **"ఆంధ్రము -ప్రాఙ్నన్న పార్యయుగము"** అన్న రచనలో తెలిపారు. నిజానికి, నన్నయ్యకు కనీసం వందేళ్ళ ముందు, అంటే 10వ శతాబ్దికి చెందిన అధర్వణాచార్య పండితుడిని వీరేశలింగం లాంటి పండితులు సైతం పదిహేడవ శతాబ్దంలోని వాడుగా చిత్రించడం అధర్మమని సుబ్బరాఘవ కవి నిరసించవలసి వచ్చింది. ఎందుకంటే, "వికృత వివేకము" "ఆంధ్ర మహాభారతము" రాసిన అధర్వణాచార్యుడు 'త్రిలింగ శబ్దానుశాసన' (సమగ్రాంధ్రవ్యాకరణం) కర్త కూడా. కాని భారతం విరాట, ఉద్యోగ, భీష్మ పర్వాలు మాత్రమే అధర్వణుడు రాశాడని చెప్పి అతణ్ణి సోదిలోకి రాకుండా చేయాలని కొందరు పండితులు పన్నుగడ పన్నారు. కాని తెలుగు పండిత పరిశోధకులైన తిమ్మావజ్ఝల కోదండరామయ్య **మహాభారతం అన్ని పర్వాలనూ అధర్వణాచార్యుడు రాశాడని రుజువులతో నిరూపించి** నోరు మూయించాల్సి వచ్చిందని మనం మరువరాదు. అయినా కొందరు పండితులకు తమ తప్పు దిద్దుకునే సంస్కారం లేదు. అలాంటి అధర్వణ కృతిని ఎందుకు కనబడనివ్వకుండా చేశారో చెప్పరు. అంతేగాదు, అధర్వణుడు ఎంత ప్రాచీనుడో తెలియజేసే సూక్తి ఒకటి విస్తృతంగా ప్రచారంలో ఉండేది : **ప్రమాద వశాత్తు "సంస్కృతంలో అపశబ్దం ఉచ్చరిస్తే పాణిని స్మరించుకోవలసిందే"** నని **"ఆంధ్రంలో అపశబ్దం ఉచ్చరిస్తే అధర్వణునే స్మరించుకోవాల"**నీ ఒక నానుడిగా మారింది. అలాగే నన్నయకు ముందున్న అనేక ఉదాహరణ కావ్యాలు (గ్రంథాలు) అజాపజా లేకుండా పోయాయని పండితులు ఆందోళన చెందారు. మండ లక్ష్మీనృసింహ కవి తన "ఆంధ్ర కౌముది"లో కూడా నన్నయ్యకు ముందున్న ప్రాచీనాంధ్ర కవులు

కొందరిని పేర్కొన్నాడని సుబ్బరాఘవకవి రాశాడు. ప్రకృతులుగా, అంటే ప్రజల భాషలుగా వర్ధిల్లిన భాషలలో ఒకటైన ప్రాకృతంలో రాసిన వ్యాకరణాలు కనబడుతున్నాయి కానీ, ఆంధ్ర వ్యాకరణాలను కనబడనీయకుండా చేశారని కూడా సుబ్బరాఘవ కవి ఆవేదన వెలిబుచ్చారు.

తెలుగు ప్రాచీనతలో అంతర్వాహినిగా ఉండవలసిన సాహితికి వెలలేని కానుకలుగా, తెలుగు జాతి కాణాచిగా ఉండవలసిన ఇన్ని "తెలుగు వ్యాకరణములు, సూత్రములు, వృత్తులు కనబడుచుండగా **ఇవి కల్పింపబడినవనుటకంటే అన్యాయము మరొకటిలేద**"ని ఆయన శరించవలసి వచ్చింది! ఆంధ్రంలో క్రీ.శ. 6వ శతాబ్దం నాటికే వాఙ్మయం ఉన్నదని చెప్పాడు. ఆ మాటకొస్తే నన్నయ్య మాటమాత్రంగా పేర్కొన్న "బహుభాషలు"లో పన్నెండు రకాల ఆంధ్ర భాషలు కూడా ఉండి ఉండాలి. అవి – "ఆంధ్రము, ఆంధ్రేయణము, కోసలాంధ్రము, హేరంభకాంధ్రము, కళింగాంధ్రము, మల్లికాంధ్రము, ద్రమిళాంధ్రము, గుహకాంధ్రము, రౌద్రకాంధ్రము, క్రౌంచ కాంధ్రము, పిరకాంధ్రము" అని కొందరు పండితులు వింగడించడం జరిగింది. శాతవాహనరాజుల్లో ఒకరైన శాతకర్ణిరాజు అనుమతిచే కళింగాంధ్రము, రౌద్రకాంధ్రము అనే రెండు భాషలను "సర్వశాస్త్ర విశారదుడై వేదవేదాంగ పారగుడైన నందివర్ధన దేవళరాయులచే కృష్ణా-గోదావరీ నదుల మధ్యస్థ" ప్రాంతాల్లో వర్ధిల్లచేయడం జరిగిందని ఒక ఇతిహాసగాథ. ఇది "భాషాధికరణము"లో ఉన్నదని సుబ్బరాఘవ కవి చెప్పారు. అందాకా ఎందుకు? నన్నెచోడుడు నన్నయ్య కన్నా ప్రాచీనుడని మానవల్లి రామకృష్ణకవి సలక్షణంగా చేసిన ప్రతిపాదనను తోసిపుచ్చిన పండిత వర్గానికి చెందిన దివాకర్ల వేంకటావధాని సహితం – ప్రసిద్ధ శాసన పరిశోధకుడు, చరిత్రకారుడు అయిన నిన్న మొన్నటి బి.ఎన్.శాస్త్రి, ఉస్మానియా విశ్వ విద్యాలయం పిహెచ్.డి. డిగ్రీ కోసం నన్నెచోడుని పై సమర్పించిన పరిశోధనా వ్యాసంలో నన్నెచోడుడే "ఆదికవి"గాని నన్నయ్యకాదని రాసినందుకు, ఆ అధ్యయనాన్ని తీసిపారేస్తే తప్ప డిగ్రీ ఇవ్వబోమని ఆగ్రహించారంటే, తెలుగు ప్రాచీనత నిరూపణకు ఈ బాపతు పండితులు చస్తే ముందుకు రారని తేలిపోయింది! చివరికి బి.ఎన్.శాస్త్రి పౌరుషజ్వాలతో 'నేనా అధ్యాయం తొలగించను. నీ డిగ్రీ నాకక్కరలేద'ని ప్రకటించి ఆ థీసెస్‌ను అటకెక్కించుకోవలసి వచ్చిందంటే నన్నయ్యకు 'ఆదికవి' బిరుదు తగిలించిన పండితుల వల్ల తెలుగుభాష పుట్టుపూర్వాల పరిశోధనకు తరతరాలుగా ఎంతటి

హాని జరిగిందో అర్థంచేసుకోవచ్చు. అందుకనే, గాడి తప్పిన తమిళ సోదరుడు తెలుగు ప్రాచీనతను కాదని నిరూపించడానికి నన్నయ నాటి "ఆదికవి" బిరుదునే ఉదాహరించనప్పుడు మన పండితులు ముందుకు వచ్చి ఖండించలేకపోయారు!

ఇక సంస్కృత - తెలుగు సంబంధాలంటారా, ఈ ప్రపంచంలో ఆదాన ప్రదానాలతో నిమిత్తం లేకుండా ఎదిగే భాషలంటూ ఉండవు. ఒక దశలో రాజభాషలుగా ఉన్న ప్రాకృతం, పాలీ, సంస్కృతాలు ఇప్పుడు రాజభాషలు కావు. కాని 'అన్ని భాషలకు మూలం సంస్కృతమేనని' చెప్పడం మాత్రం సాహసం. నిజానికి, ఈ విషయాన్ని తిరుమల రామచంద్రలాంటి బహు భాషాపండితులూ, పరిశోధకులే ఏనాడో తేల్చి చెప్పారు. తెలుగు - ప్రాకృతాల మధ్య సంబంధాల గురించి చెబుతూ ప్రాకృతం **"ప్రజల భాష, ప్రజల నిత్య వ్యవహార భాష, ప్రజల ప్రేమ భాష. ప్రజల కష్ట సుఖాల భాష. ఇదే ప్రకృతుల - ప్రాకృతుల భాష- ప్రాకృత భాష" అన్నారు.** అంతేగాదు, మానవజాతి తొలిచ్ఛందోరూపమైన రిగ్వేదంలో ప్రాకృత భాషా రూపాలు కనిపించినందువల్ల రిగ్వేద భాషకన్నా అతి భిన్నమూ అపరిష్కృతమూ అయిన భాష ఒకటి ఉందని, అదే ప్రాకృతమని, లేదా ప్రాకృత మూలమనీ భావించవచ్చన్నారు. ప్రాకృత భేదంగానే సంస్కృతం (సంస్కరించుకుని) పుట్టింది, ప్రాకృత భేదమే 'పాలీ'గా అవతరించింది; అలాగే **ప్రాకృతం రాజభాషగా ఉండి, తెలుగుమాత్రం ప్రజల భాషగా సమకాలంలో వర్ధిల్లుతూ** వచ్చింది కనుకనే ప్రాకృత భాషలను ప్రస్తావించిన భరతాచార్యుడి ప్రకారం, మాగధీ ప్రాకృతమనీ, శౌరసేనీ ప్రాకృతమనీ, దాక్షిణాత్య ప్రాకృతమనీ, మహారాష్ట్ర ప్రాకృతమనీ, **తెలుగు ప్రాకృతమనీ** రకరకాలుగా రూపుదిద్దుకున్నాయని చెప్పాడు. ఈ సంసర్గత ఫలితంగానే సంస్కృతం నుంచి తెలుగులోకి, తెలుగు నుంచి సంస్కృతంలోకి తెలుగు పదాలు ఎలా వెళ్లాయో, ప్రాకృతం నుంచి తెలుగులోకి, తెలుగు నుంచి ప్రాకృతంలోకి 'పాలీ' లోకి పాకిపోయి పదసంపదలో ఆదాన ప్రదానాలు జరిగాయి. అయితే అంతమాత్రం చేత సకల భాషలకు ప్రాకృతమో, సంస్కృతమో మూల భాష అని ప్రచారం చేయకూడదు. నిజానికి సంస్కృతం సహా అన్ని భాషలకు మూలం "బ్రాహ్మీ" లిపి అని పండితులు తేల్చారు. ఈ 'బ్రాహ్మీ' మూలం ద్రావిడ భాషా కుటుంబంలోని ప్రాచీన తెలుగు అనీ, అశోకుని కాలాని కంటే (క్రీ.పూ. 300 సంవత్సరాలు) ముందటిదైన తెలుగుకు, అంటే క్రీ.పూ. 400 సంవత్సరాల నాటి తెలుగుకు ప్రాచీన రూపం 'బ్రాహ్మీ' కాగా,

భాష 'తెలుగు ప్రాకృతం' అని పండితులు, పురాతత్త్వ శాస్త్రవేత్తలు భావించారు. ఎందుకంటే, తమిళం, తెలుగు ప్రాచీన ద్రావిడ భాషలు కాబట్టి, ప్రాచీన తమిళం 'గ్రంథ' లిపిలో రాయగా, ప్రాచీన తెలుగు 'బ్రాహ్మీ' లిపిలో ఉందనీ, ప్రాకృతం, పాలీ, సంస్కృతం – ఈ మూడూ తెలుగు నుంచే బ్రాహ్మీ లిపిని అరువు తెచ్చుకున్నాయని **"హిడెన్ హెరిటేజి"** గ్రంథంలో తమిళ పరిశోధకుడు డాక్టర్ కాశిపాండ్యన్ పేర్కొన్నారు! దీన్ని బట్టి చూస్తే సంస్కృత సాహిత్యంతో కంటే తెలుగు భాషకు తమిళ, కన్నడాది ద్రావిడ భాషా కుటుంబంతో రూప సంబంధం ఉందని స్పష్టమవుతోందని "ద్రావిడ భాషా పరిశీలనం"లో సంస్కృతాంధ్ర భాషా పండితులు, వ్యాకరణ శాస్త్రవేత్త అయిన "కళాప్రపూర్ణ" శ్రీవఝుల చినసీతారామస్వామి శాస్త్రి ఉదాహరించారు. ఈ విషయ పరిశీలనలో ప్రస్తుత గ్రంథకర్త అయిన డాక్టర్ పూర్ణచంద్ సమన్వయ దృష్టితో ఒక మంచి పరిశీలన జరిపారు: "ద్రావిడ భాషా స్వరూపాన్ని అధ్యయనం చేసినప్పుడు తెలుగులో సంస్కృత పదాలు ఎక్కువగా ఉన్నాయనే పేరుతో తెలుగు భాషని పరిగణనలోకి తీసుకోకుండా పరిశోధకులు ప్రక్కన పెడుతూ వచ్చారు. కాని పాణినీయ **సంస్కృత భాషకు సమాన కాలంలో రూపొందిన ప్రోటో (ప్రాచీన) తెలుగు భాష మాట్లాడిన ప్రజలు** నిర్వహించిన చారిత్రక పాత్ర గణనీయమైంది." సంస్కృత భాష మాట్లాడిన ప్రజలతో సాహచర్యం అంతగా లేనప్పుడు వారి భాషలో సంస్కృత పదాలు ఎక్కువగా ఉండకపోవడం సహజమనీ, తెలుగులో సంస్కృతపదాలు మితిమీరి కన్పించడమే సంస్కృత ప్రజలతో వారికి గల సంబంధాలకు, తెలుగు భాష ప్రాచీనతకూ నిదర్శనమని పూర్ణచంద్ చెప్పారు. కాని, నిజానికి ఎప్పుడూ సంస్కృతం రాజభాషగా, రాజాశ్రయులయిన పండితుల భాషగానే ఉంటూ వచ్చింది గాని, "ప్రజల భాష"గా మాత్రం కాదు! ఈ విషయాన్ని **"తెనుగువారి చదువు"** అన్నరచనలో కవి, పరిశోధకులు మారేపల్లి రామచంద్ర శాస్త్రి ప్రస్తావిస్తూ "తొలి 'తెన్' (తెలుగు) పలుకుమానుపు భారత ఖండమంతటను నెఱసియుండెననుటకు తార్కాణం" గా మల్తో, పాట్నాల దగ్గర, కొలామీ నాగపురవాయవ్య భాగంలోనూ, బ్రాహూయీ సింధు, బెలూచిస్థాన్‌ల లోనూ వాడుకలో తెలుగు వ్యాపించి ఉండడాన్ని పేర్కొన్నారు! అంతేగాదు, ప్రాచీన 'తెన్' (తెలుగు) పలుకులో **వ్రాగమి**, అంటే వాఙ్మయం ఉందనీ, అందులోంచి ఆర్యులు సుమారు పదమూడువేల ఏండ్లకిందట సంగ్రహించినట్లు తెలుస్తున్నదనీ, కాబట్టి, దాని తొలిబిడ్డలయిన తమిళంలోనూ, తెనుగులోనూ "వ్రాగమి" అప్పటి నుండే ఉందనీ

భావించవచ్చునని రామచంద్రశాస్త్రి స్పష్టం చేశారు. అయితే ఇప్పుడా వాఙ్మయ సంపద కానరాదనీ, అది ఎట్లుపోయిందో కూడా తెలియదని చెబుతూ, ఈ విపరిణామానికి, ఈ వినాశానికి తెలుగుదేశంలో పెచ్చరిల్లిన మతద్వేషాలే కారణమని కొందరి తలంపని రాశారు. అంటే, పోయింది పోగా ఏతావాతా మిగిలిన పాతవాఙ్మయం సహితం క్రీ.పూ. ఆరవ శతాబ్దానిదే కావడం విశేషం! అంతేగాదు, రామచంద్రశాస్త్రిగారు మితిమీరిన సంస్కృత భాషా ప్రియుల నెత్తిపైన ఒక బండరాయి కూడా విసిరారు: "మేలి వాఙ్మయం (వ్రాగమి)లో మొదట ఎన్నికకు వచ్చింది పదకొండవ శతాబ్దపు నన్నయ భారతం. **అప్పటికి తెనుగు సంస్కృత పదములతో నిండిపోయి బ్రాహ్మణుల** పెద్దరికం క్రిందికి తాను వచ్చుట చాటుకున్నది." అంటే, మరో మాటలో చెప్పాలంటే శాతవాహన రాజ్యపాలనలో ప్రారంభమైన తెలుగు భాష సంస్కృతీకరణం నన్నయతో పూర్తి అయిందన్నమాట! అందుకే ఆచార్య గంటి జోగిసోమయాజులు తన పరిశోధనలో **నన్నయకు వేయి సంవత్సరాలకు ముందే తెలుగు భాష ఉందని** ఒకటికి పదిసార్లు గుర్తు చేయాల్సివచ్చిందని మరవరాదు. అలాగే, తెలుగుభాషకు రెండువేల సంవత్సరాల చారిత్రక యుగపరిణామం ఉందని పండిత కోరాడ మహదేవశాస్త్రినీ, మొత్తం తెలుగు చారిత్రకోదయకాలం 1957 సంవత్సరాలని ఆచార్య జి.ఎన్.రెడ్డి తేల్చారు. అయితే కాలక్రమంలో ప్రాకృత, సంస్కృత, పాలీ పదాలకు తోడు అనంతరకాలంలో విదేశీ పాలకుల రాజ్యవిస్తరణలో భాగంగా డచ్చి, పోర్చుగీసు, పారసీకం, ఉర్దూ, ఇంగ్లీషు భాషా పదాలు కూడా తోడై, మధ్యేమధ్యే తన తనాన్ని కొంత కోల్పోతున్నా తెలుగు భాష, తెలుగు వాఙ్మయం ("వ్రాగమి") అసాధారణమైన తన గ్రాహ్యశక్తి కొద్దీ పదసంపదను పెంచుకుంటూ నానాటికి సుసంపన్నమవుతూనే ఉంది. సంస్కృతం ప్రభావంలోకి వెళ్లని (నాన్-సాంస్క్రిటిక్) మత ధర్మాలన్నీ వస్తుతహ తెలుగు దేశంలోనే ప్రభవిల్లుతూ వచ్చాయి. బుద్ధుడు, మహావీరుడూ ఉత్తరాదివారైనా బౌద్ధం, జైన ధర్మాలు వ్యాపించి వర్ధిల్లింది తెలుగు గడ్డపైనేనని మరవరాదు. ఈ రెండు ధర్మాలకు, శైవ, వైష్ణవ మతాలకూ మధ్య ఘర్షణల మూలంగానూ శైవ, వైష్ణవ మతాల మధ్య కుమ్ములాటల ఫలితంగాను ఎంతో తెలుగు సాహిత్యం, బౌద్ధ సాహిత్యం మంటగలిసిపోయిందనీ, బౌద్ధారామాలను, చైత్యాలను "లంజదిబ్బల"ని కూసి, కూల్చివేసిన వాళ్లు బౌద్ధ సాహిత్యాన్ని మాత్రం ఉంచుతారా అని తిరుమల రామచంద్ర ఒక సందర్భంగా వెలిబుచ్చిన సమంజసమైన

అనుమానం పెనుభూతం కాకపోయినా సారభూతమైన అభిశంసనగానే మనం పరిగణించక తప్పదు! ఈ దశలో ద్రావిడ నాగరికతకు ముందున్న గిరిజన (ఆదివాసీ) భాషల ఉనికీ, ఉసురూ ఏమయ్యాయో తెలియదు, ఈ భాషలు వ్యాప్తి అయి బతికి ఉన్న కాలం ఎక్కువలో ఎక్కువగా క్రీస్తు పూర్వం 3వ శతాబ్దిగా బర్టన్‌సేన్ (Essays on South India) పేర్కొన్నాడు. ఈ కాలం ఏది? 'బ్రాహ్మీ' లిపిలో ఆది తమిళ శాసనాలు వెలువడక ముందే ఈ గిరిజన భాషలు ఉనికిని చాటుకోగా, శాతవాహనుల కాలానికి ముందే ఆది తెలుగు పరివ్యాప్తమయిందన్నాడు బర్టన్! సంస్కృతంతో నిమిత్తం లేని అన్ని మతాలూ తెలుగు గడ్డ నుంచే ప్రభవించాయి (బౌద్ధం, జైనం వగైరా). ఈ ప్రాచీన సంప్రదాయాన్ని పెంచి పోషించడంలో తెలుగు అగ్రగామి పాత్ర వహించిందని చెబుతూ బర్టన్ మరో విషయం స్పష్టం చేశాడు : "అంతటి సువిశాల ప్రాంతంలో ప్రభవిల్లిన తెలుగు, బలమైన సమైక్యతా లక్షణాలు లేకుండానే క్రీ.పూ. 1500 నుంచి చారిత్రక విభాత సంధ్యల వరకూ చెక్కుచెదరకుండా ఉండడం అసాధ్యం" అని కితాబు యిచ్చాడు ("The Hidden Heritage" లో తమిళ పరిశోధకుడు కాశీపాండ్యన్, 1988). ఈ ప్రశస్తికి కారణాలను తిరుమల రామచంద్ర "గాథా సప్తశతిలో తెలుగు పదాలు" అన్న గ్రంథానికి రాసిన పరిచయంలో మనం చూడొచ్చు: **"క్రీ.పూ.4 - 3 శతాబ్దుల నాటికే ఆంధ్ర దేశంలో బౌద్ధమతం పాతుకొని ఉంది. హైందవ మతఛాయలు ఎక్కడా కనిపించవు. ఆనాటి ఆంధ్రులు పూర్తిగా బౌద్ధాన్నే ఆదరించారని చెప్పడానికి సందేహంలేదు. బౌద్ధంతోపాటు ప్రాకృత భాషకు కూడా విపరీత ప్రజాదరణ లభించింది. దేశి భాష అనుకునే తెలుగు భయం భయంగా ఏమూలనో నక్కి వుండవచ్చు. భవిష్యత్తులోని పరిశోధనలో అలా చీకటి కోణాల్లో దాగున్న తెలుగుకు వెలుగు నీయవచ్చు. .... బౌద్ధాన్ని అవలంబించిన ఒక బ్రాహ్మణ కుమారునితో బుద్ధుడు ప్రాంతీయ పదాలను వాడుకోవటంలోని విశిష్టతను విప్పి చెప్పాడని" రామచంద్ర వివరించారు.**

భట్టిప్రోలు లిపి (క్రీ.పూ.4 శతాబ్ది) నుంచే నేటి తెలుగు లిపి పరిణామం చెందింది. ఆ మాటకొస్తే "బ్రాహ్మీ"యే "ఇండియాలో తొలి లిపి " కనుక సకల భాషలకు తల్లి "బ్రాహ్మీ" అనీ, దీనినుంచే కన్నడిగులు/అరవలు సంస్కృత గ్రంథాలు రాసుకున్న 'గ్రంథ' లిపి/తుళు/మలయాళం/మోడీ(మహారాష్ట్ర) లిపులు, ఓఢ్రలిపి, నాగరీలిపి (ఉత్తరభారతం), గురుముఖీ, డోగ్రీ (జమ్ము-కాశ్మీర్), నేవారీ (నేపాల్),

తిబ్బతీ (టిబెట్) లిపి, వంగలిపి, మైథిలి, అస్సామీ, మణిపురి, నిమాడీ(మధ్యప్రదేశ్) లిపి, మార్వాడీ (రాజస్థాన్) లిపి, ముల్తానా, సింధీ వగైరా (పంజాబ్) లిపులూ, గుజరాతీ, సింహలీ, పరాచి, బహ్వాల్‌పురీ, రోడియా, బిశారీ, హరీ, లామావాసీ, లూంగీ, సరాఫీ, సారికా, స ఈసీ, షికార్‌పురీ వగైరా ఉత్తరాది లిపులూ పుట్టాయని పండితులు నిర్ధారణ చేశారు. ఈ "బ్రాహ్మీ" నే కొందరు మౌర్య లిపి అనీ 'అశోకలిపి' అనీ పిలుస్తూ వచ్చారు. లిపి 'బ్రాహ్మీ" అయి, భాష ప్రాకృతం అయినందుననే తెలుగుదేశంలోని శాసనాలు హెచ్చుభాగం బౌద్ధయుగంలో ప్రాకృతభాషలో ఉన్నాయి. తెలుగు గ్రామాల పేర్లూ, వ్యక్తుల పేర్లు (వేపూరు, నాగబుద్ధ వగైరా) ప్రాకృతంలోకి చొరబడడానికి ఇదే కారణం, నిన్నగాక మొన్న విశాఖజిల్లా కొత్తూరులో బయటపడిన తంబయ దాన శాసనం (క్రీ.పూ. 2వ శతాబ్ది) కూడా ఉన్నది ప్రాకృతంలోనే. కనుక ద్రావిడ భాషలయిన తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, తుళు, కురుఖ్, మాల్తో, కుయి, గోండి, బ్రాహుయీ భాషలు సంస్కృతాది భాషల కన్నా భిన్నమనీ పాశ్చాత్య పండితులయిన, మచిలీపట్నం జిల్లా జడ్జిగా పనిచేసిన ఎల్లిస్, రాస్మస్ క్రిస్టియన్ రస్క్, కాల్డ్‌వెల్, స్టన్‌కోనాలు స్పష్టం చేశారు. కోరాడ, గంటి జోగిసోమయాజులు, చిలుకూరి, మారేపల్లి, భద్రిరాజు పండిత ప్రభృతులు తరతమ భేదాలతో దాదాపు ఇదే అభిప్రాయం వెలిబుచ్చారు. ఇలా భట్టిప్రోలుతో మొదలైన తెలుగు వర్ణయాత్ర అద్దంకి పద్యశాసనంతో స్వర్ణమయపాత్రగా అవతరించింది!

ఇంతటి ప్రాచీన చరిత్ర గల భాషల గుట్టుమట్టులు తీయడంలో విశేష కృషి చేసిన తమిళ పండితుడు ప్రొఫెసర్ సుబ్రమణ్య మలయాండీ తమిళనాడులోని వైగై నదీలోయలో వర్ధిల్లిన తమిళ నాగరికత, ఆంధ్రప్రదేశ్‌లోని తుంగభద్రా నదీలోయలో వర్ధిల్లిన తెలుగు ప్రజల నాగరికత సమాంతరంగా సాగి, ఈ రెండు నాగరికతలూ క్రీ.పూ. 4000–3000 సంవత్సరాల నాటి సింధునదీలోయ నాగరికతతో బరాబరిగా తులతూగాయని ఆధారాలతో సాక్షాత్తూ చిత్రలిపిముద్రల సాక్ష్యంగా నిరూపించాడు! బౌద్ధయుగంలోనూ, ఆ తరువాతా ప్రాచీనాంధ్రుల నౌకాయానం, సాహసయాత్రలు, గ్రీసు, రోములతో పశ్చిమాసియా దేశాలతో, సుమేరియాతో జరిపిన వర్తక వాణిజ్యాల వైభవమూ ఇందుకు చారిత్రక దాఖలాలు. ఈ ప్రస్తావనలు కూడా తెలుగు భాష ప్రాచీనతా నిరూపణలో భాగంగా డాక్టర్ పూర్ణచంద్ ఆసక్తికరంగా తెలుగు పాఠకులకు తన పుస్తకంలో పొందుపరిచారు. ఈ సందర్భంగా ప్రాచీన

సాహిత్యాన్ని (వేదాలు సహా) మథించిన మాక్స్‌ముల్లర్ పండితుడు వేదాన్ని "తెల్లజాతి (ఆర్యజాతి అని) తొలికవితా వచనం" అని ఎందుకు అభివర్ణించాడో ("This is the first Peotic reference of the White race") తెలియదుగాని తిరుమల రామచంద్ర మాత్రం "వైదిక భాషలో ప్రాకృత భాషా పదాల స్వరూపాలు కనిపించడం ఎవరికైనా ఆశ్చర్యకరమే"నన్నాడు! ఈ పూర్వరంగంలో విద్వాన్ సుబ్బరాఘవ కవి "ఆది కావ్యం" పదం గురించి చేసిన ప్రస్తావనను ముగింపుగా పేర్కొనడం సమంజసంగా ఉంటుందని భావిస్తున్నాను : **"ఏ భాషకును ఆదికావ్యమని యొకటియుండదు.** మానవుడాయా కాలములందలి తనకు తోచు వ్యక్తులంబట్టి చేయు **కూనురాగములే యాదికావ్యమనవచ్చును.** అతడు పాడు సంగీతమునందునే యానందమున్నది. ఆవేశమున్నది; రసమున్నది. ఇట్లే నన్నయ భట్టారకునకు పూర్వమూ వాఙ్మయ ముండెను. అదియంత పరిశుద్ధమైనది కాకపోవచ్చును. అంతమాత్రమున నయ్యది కావ్యత్వమున కనర్హమనుట యసమంజసము. అందు కళయున్నది, రసము వెల్లివిరియుచున్నది. అప్పటికి కేవలము ద్విపద కావ్యములుగనో, రగడలుగనో, పాటలుగనో యుండి యుండవచ్చును. "కాళ్లాగజ్జికంకాళమ్మా" అను బాలురయాటలు, "చందమామరావే - జాబిల్లిరావే, కొండమీద వెండిగిన్నె - కొండెక్కితేవే", "పిడికెడు బియ్యం, పిల్లంగోయె - పిల్లల్లారా రండహ్హోయ్" మొదలగు వానిలో కవిత్వాంకురము లున్నవి గదా! **వేదములవలె నీపాటలు నెన్నివేల సంవత్సరముల నుండి వాడుకలోనికి వచ్చినవో** తెలియదు. భక్తి పాటలు, కుచ్చెల పాటలు, ఉడుపు పాటలు స్త్రీలలో, పురుషులలో నోటి విద్యగా వ్యాప్తినొందుచున్నవి గదా! అందు ప్రకృతి పరిశీలన మున్నది, ఆవేశమున్నది, కళయనున్నది, ఆనందమున్నది, రసమున్నది. జంగము పాటలు, లంకాయాగము, వీరగీతములు, బొబ్బిలిపాట మొదలగునవి జంగముల చేతను, దాసరుల చేతను కథానుసారముగ వినవచ్చును. **వారికి లిపి తెలియకుండినను** వారు ధారాళముగా జ్ఞప్తియందుంచుకొందురు. కాన, **లిపి లేనప్పుడు కూడా వాఙ్మయముండి యుండవచ్చును".** (వావిళ్లవారి సమ్మాన సంపుటము:త్రిలిజ్ఞ రజతోత్సవ సంఘం: 1941) అందువల్ల ఈ పూర్వరంగం నుంచి పరిశీలించినపుడు డా॥ పూర్ణచంద్ "తెలుగే ప్రాచీనం" అని నిరూపించడానికి తనకు అందుబాటులో ఉన్న శోధన సామాగ్రి ఆధారంగా చేసిన ప్రయత్నంలో నెరసులు వెతికే వారు ఉంటే ఉండవచ్చును. కాని, తెలుగు ప్రాచీనతను అంతే చరిత్రగల పొరుగువాడు ప్రశ్నార్థకం

చేసినపుడు తగినన్ని ఆకరాలతో కొమ్ములు తిరిగిన పండితులు ముందుకు వచ్చి జాతి, లిపి, భాష, నాణేల, శాసనాలపరంగా చరిత్రను తవ్వి, ముక్కుమీద గుద్దినట్టు విరుచుకుపడకుండా అచేతనులై పడిఉన్న దశలో పూర్ణచంద్ సాహసంతో ఈ ప్రయత్నం చేశాడు. ఆయన తెలుగు ప్రాచీనత గురించి సీమాంతరాలు దాటి మెడలు చాచి మరీ చేసిన నిరూపణలతో, చూపించిన ఉపపత్తులతో విభేదించేవారుంటే ఉండవచ్చు. కాని ఆయన ఈ విషయాలపై "నడుస్తున్న చరిత్ర" లో ధారావాహికంగా రాస్తున్నప్పుడు సంతోషించిన వేలాదిమంది పాఠకులలో నేనూ ఒకడ్ని. ఈ ప్రయత్నాన్ని గ్రంథకర్త మరింతగా కొనసాగించి పరిశోధనా ఫలితాల్ని చీకటి కోణాలపై సరికొత్త వెలుగులతో తెలుగువారికి అందించగలరని ఆశిస్తున్నాను. భారమైన ఈ అన్వేషణా యాత్రలో ఆయనకు అండగా నిలవడం మన కనీస ధర్మం. సెలవు.

మీ

(డా॥ ఎ.బి.కె.ప్రసాద్)
అధ్యక్షుడు, ఆం.ప్ర.అధికార భాషాసంఘం

ఫిబ్రవరి 11, 2008
హైదరాబాద్

డా॥ సామల రమేష్‌బాబు మెప్పుకోలు

# ఈ పుస్తకం ఇప్పుడెందుకు?

డా॥ జి.వి. పూర్ణచంద్ ఆయుర్వేదంలో పట్టభద్రుడు. సుమారు ఇరవయ్యాయిదేండ్లుగా విజయవాడలో వైద్యవృత్తిలో ఉన్నారు. విద్యార్థి దశ నుండీ కవితల్నీ కథల్నీ చారిత్రక అంశాలతో నవలల్నీ వ్రాసి, ఒక స్వతంత్రమైన రచయితగా గుర్తింపు తెచ్చుకొన్నాడు. హేతుబద్ధంగా ఆలోచించడం, సృజనాత్మకంగా వ్రాయడం, భావనాత్మకంగా మాట్లాడడం చేతనయినవాడు. సభల్ని నిర్వహించడంలో నిపుణుడు. రెండున్నర దశాబ్దాలుగా కృష్ణాజిల్లా రచయితల సంఘానికి కార్యదర్శి. ప్రజాహిత సేవా కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొంటూ సమాజంలో గౌరవప్రదంగా ఎదిగినవాడు. తనకున్న సమయాన్నంతా ఏమాత్రం వృథా చేయకుండా, చేపట్టిన పనుల్ని విజయవంతంగా నెరవేర్చడంలో సిద్ధహస్తుడు. మూడు దశాబ్దాలకు మించి, సన్నిహితంగా చూస్తూ ఆయన గురించి నేను ఈ మాటలు వ్రాశాను.

ఇరవై నెలల క్రితం ఒక రోజున నాదగ్గరకు వచ్చి 'ఎలుకలు చెప్పిన హక్కులు ఎవరికి ఎరుక?' అనే వ్యాసాన్ని చదివి వినిపించి, వివరించినపుడు – నేను నడుస్తున్న చరిత్రను సాధనంగా చేసుకొని సాగిస్తున్న తెలుగుజాతి సేవాయజ్ఞంలో డా॥ పూర్ణచంద్ నాకు తప్పక తోడుగా ఉంటాడనిపించింది. ఇలాగే వ్రాస్తూండమన్నాను. నాలుగు నెలలు వరుసగా వ్రాశాడు. డా॥ పూర్ణచంద్ అన్వేషణ నన్ను ఆకట్టుకొంది. ఆయన వ్యాసాలకు 'అన్వేషణ' అనే శీర్షికను ఇచ్చాను. ఇప్పటికి 20 వ్యాసాలదాకా ఆ శీర్షిక క్రింద ఆయన వ్రాశాడు. ఇవన్నీ సంచలనాత్మకాలయ్యాయి. వివాదాస్పదం అన్నారు కొందరు. ఆలోచించవలసిన సంగతులే అన్నారు ఇంకొందరు. వీళ్లంతా మేధావి వర్గానికి చెందినవారు. 'ఇంతకాలం మేం చెప్పనివీ, చూడనివీ యీ రంగంవాడు కాని ఇతగాడు చెప్పడమేమిటి' అని కొందరు బాధపడ్డారు, ఈసడించుకొన్నారు. ప్రతి మంచి ప్రయత్నాన్నీ స్వాగతించాలనే వారెందరో యీ అన్వేషణను కొనసాగించమన్నారు.

డా॥ పూర్ణచంద్ నీటిలోంచి నిప్పును పుట్టిస్తున్నాననలేదు. తాను స్వయంగా

క్షేత్రస్థాయి పరిశోధనలు చేసి ఇదంతా మీముందు ముగ్గులు పోస్తున్నాననలేదు. కంప్యూటర్ల లోతుల్లోకీ, పుస్తకాలలోకీ వెళ్లి, ఒక్కొక్క అంశాన్నీ వెదికి పట్టుకొని, తన ఆలోచనల్నీ, అంచనాల్నీ పాఠకుల ముందు పెట్టాడు. ప్రసిద్ధిగాంచిన భాషాశాస్త్రజ్ఞుల్నీ, చరిత్ర పరిశోధకుల్ని ఉటంకిస్తూనే కొత్తకోణాల్ని వెతికి, 'దయతో పరిశీలించండి' అంటూ విద్వజ్జనులకు నివేదించాడు. ఇదంతా నడుస్తున్న చరిత్ర పత్రిక ద్వారా జరిగింది; కొనసాగుతూ ఉంది. ఇందుకు నేను సంతోష పడుతున్నాను..

నడుస్తున్న చరిత్రలో వచ్చిన కొన్ని వ్యాసాల సమాహారం పుస్తకరూపంలో ఇప్పుడు పాఠకుల చేతుల్లోకొస్తున్నది – 'తెలుగే ప్రాచీనం' అనే పేరుతో.

అవును! తెలుగే ప్రాచీనం. ఈ అంశం మీద నడుస్తున్న చరిత్రలో చాలాకాలంగా పలువురి వ్యాసాల్ని ప్రచురిస్తూనే ఉన్నాం. కీ.శే. సుబ్రమణియన్ మలయాండి పరిశోధనాంశాన్ని 'తెలుగే ప్రాచీనం' అనే మకుటంతోనే అయిదేళ్ల క్రితం ఒక వ్యాసంగా ఇచ్చాము. కానీ అందులో ఆయన చర్చించిన అంశం వేరు. పురావస్తు తదితర సాక్ష్యాల ప్రకారం అది సాగింది. ఆ కోణంలో చాలా చర్చ ఇప్పటికి జరిగింది, జరుగుతోంది. కాని, ఇప్పుడు డా॥ పూర్ణచంద్ మనముందు పెడుతున్న అంశాలు మరొక కోణం నుంచి. వాడుకలో ఉన్న తెలుగు పదాలెన్నో ఇతర దేశాల భాషల్లో ఎక్కడెక్కడ ఉన్నాయో ఆయన వివరించాడు. ద్రవిడ భాష అంటే తమిళమేనని ఒక తప్పు నిర్ణయం చేసుకొని, తెలుగు మూలాలను విస్మరించి, కావాలని తెలుగు పదాలకి ఎలా ముసుగువేశారో ఎన్నో సందర్భాల్లో తెలియజేశాడు. ద్రవిడ వ్యుత్పత్తి కోశం (ద్రవిడియన్ ఎటిమలాజికల్ డిక్షనరీ) ఆధారపడి కొందరు పరిశోధకులు తెలుగును పట్టించుకోకుండా వ్యవహరించిన సంగతిని నిర్మొహమాటంగా చెప్పాడు. సుమేరియన్ భాషా సంస్కృతులకు మనతోవున్న బొడ్డుతాడు బంధాన్ని వివరించాడు. కొన్ని ప్రజా సమూహాల/జాతుల భాషలకు తెలుగుతో ఉన్న బంధాన్ని విశ్లేషించాడు. విశ్వవ్యాప్తంగా తెలుగు భాష ప్రభావాన్ని ఎత్తిచూపాడు.

అసలు సందర్భాన్ని ఇక్కడ మనం వివరించుకోవాలి. ఎంతో ప్రాచీనత కలిగిన మనజాతి, మనం మాట్లాడుకునే భాష – మన తెలుగు – ప్రాచీనం కాదా? తమిళమే ప్రాచీనమా? తమిళ మాతృభాషీయులకు నాలుగింతలకు పైగా జనసంఖ్య, ఎంతో సాహిత్యం, ఎందరో విశిష్ట రచయితలు, కవులు ఉన్న మన భాష ప్రాచీనం కాదా?

మరి, మనం ఎక్కడి వాళ్లం? ఎప్పటి వాళ్లం? మన భాష ఎప్పటిది? ఎంతో చర్చ జరుగుతున్నది.

2004 అక్టోబరులో తమిళానికి విశిష్ట ప్రాచీన భాష హోదానిచ్చి దానికి జాతీయంగా, అంతర్జాతీయంగా ఉన్నత పరపతిని, హుందాగా ఎదగడానికి కావలసిన నైతిక, ఆర్థిక, రాజకీయ వనరుల్ని కట్టబెట్టింది. కేంద్రప్రభుత్వం ఎందుకిలా వ్యవహరించింది? భాషాప్రయుక్త రాష్ట్రాల సమాఖ్యగా వున్న మన రాజకీయ వ్యవస్థలో చెయ్యకూడని పనిని నేటి ప్రభుత్వం చేసింది. భాషల మధ్య వివక్షను చూపెట్టింది. రాజ్యాంగం 8వ అధికరణంలో ఉన్న 22 భాషలనూ సమదృష్టితో గౌరవించి, ఆయా రాష్ట్రాలు తమతమ భాషల్ని అభివృద్ధి పరుచుకోవడానికి అవకాశమివ్వవలసిన కేంద్రప్రభుత్వం ప్రత్యేకించి ఒక భాషను నెత్తిన బెట్టుకొని ఊరేగడమేమిటి? ద్రావిడ భాషల్లో పెద్దవిగా ఉన్న నాలుగు భాషల్లోని ప్రత్యేకతను గుర్తించి, వాటికి అంతర్జాతీయంగా ఎదిగే అవకాశాలనిచ్చి ఒక పద్ధతిగా వ్యవహరించాలి. భాషా రాజకీయాల్ని ఊపిరిగా చేసుకొని వ్యవహరించే రాజకీయపక్షాల అండతో తమ అధికారాన్ని రక్షించుకోవడానికి భాషలమధ్య చిచ్చుపెట్టడం సమంజసమా? నదీజలాల వివాదాలు, ఆర్థిక వనరుల పంపిణీలో తేడాలు, ఆహారధాన్యాల మద్దతు ధరల్లో ఎక్కువతక్కువలు, పాలనా వ్యవహారాల్లో రాష్ట్రాలపట్ల వివక్ష వంటి సమస్యలుండగా, కొత్తగా భాషాపరమైన పక్షపాతాన్ని ప్రదర్శించి, కేంద్రం సాధించదలచుకొన్నదేమిటి? ఇవన్నీ తేలవలసిన ప్రశ్నలు.

తమిళానికి 'క్లాసికల్' ప్రతిపత్తినిచ్చినప్పటి నుంచీ తెలుగు, కన్నడ భాషలు తమకూ ఆ ప్రతిపత్తిని పొందే సర్వహక్కులు ఉన్నాయని తెలుపుతూ తమ వాదాల్ని కేంద్రం ముందుపెట్టాయి. ఉద్యమబాట పట్టాయి. ఈ 2008లో కర్ణాటకలోనూ, మరో ఏడాదిలో మన రాష్ట్రంలోనూ ఎన్నికలొస్తాయి గనుక ఈ అంశం మళ్లీ వేడెక్కుతోంది. త్వరలోనే ఈ రెండుభాషలకు 'క్లాసికల్' - విశిష్ట ప్రాచీన భాషా ప్రతిపత్తి - వస్తుందని కేంద్రమంత్రులు, ముఖ్యమంత్రీ అంటున్నారు.

ఈ నేపథ్యంలో ఈ పుస్తకం వస్తున్నది.

ఇక్కడ మరొక అంశాన్ని ప్రస్తావించుకోవాలి.

ఐదువేల సంవత్సరాలకు పైబడిన చరిత్ర, 2000 ఏళ్లకు పైబడిన సాహిత్యం,

శాసనాలు లభిస్తున్నా, అనేక సామాజిక, రాజకీయ, చారిత్రక కారణాల వల్ల ఒక భాషాజాతిగా మనల్ని మనం మరిచిపోయాం. పట్టనితనాన్ని పెంచుకొన్నాం. భౌగోళికంగా కూడా చెల్లాచెదురయ్యాం. సాహిత్యాన్ని, చరిత్రను భద్రపరచుకోవడంలో తగిన జాగ్రత్త వహించలేదు. మితిమించిన సంస్కృతీకరణతో తెలుగు తేటదనాన్ని పలుచన చేసుకొన్నాం. జానపదులను, ప్రజాకవులను గౌరవించుకోలేకపోయాం. సామాన్య ప్రజల భావోద్వేగాలే మన భాషకు ఊపిరి అని మరచిపోయాం.

మన మేధావులకు, మన ప్రభుత్వ నేతలకు జాతి గౌరవాన్ని, భాషను కాపాడుకోవాలన్న తలంపేలేదు. గత ఆరేడేళ్లుగా రాష్ట్రంలో భాషోద్యమ గాలులు వీస్తుండడం వీళ్లకు అర్థంకావటం లేదు. భాష, సాహిత్యం, సంస్కృతుల పరిరక్షణ విషయంలో, భాషాజాతిగా స్వాభిమానంతో వ్యవహరించడంలో పొరుగున వున్న తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్రలను చూచి అయినా నేర్చుకొందామన్న ఆలోచనే లేదు. ఈ సమయంలో తమిళభాషకు 'క్లాసికల్' హోదా నివ్వడంతో తెలుగుజాతిలో ప్రకంపనలు మొదలయ్యాయి. ఒక విధంగా ఇది మంచి పరిణామాలకే దారితీస్తున్నది.

ఇప్పుడున్న జనాభా ప్రకారం తెలుగు మాతృభాషగా గలవారు సుమారు 18 కోట్లమంది (2001 నాటికి జాగ్రత్తగా లెక్క వేసుకుంటే 15 కోట్లమంది తెలుగు మాతృభాషీయులు). వీరిలో దాదాపు సగంమంది మాత్రమే ఆంధ్రప్రదేశ్‌లో, తక్కినవారు చుట్టుప్రక్కల రాష్ట్రాలలో విస్తరించి ఉన్నారు. వీరంతా ఇళ్లలో తెలుగు మాట్లాడుకొంటున్నా, మూడింట రెండొంతుల మంది తెలుగు వ్రాయడం, చదవడం రాని పరిస్థితుల్లో పడ్డారు. వీరంతా ఒక ముఖ్యమైన మానవ హక్కును – మాతృభాషలో ప్రాథమిక విద్య పొందడానికివున్న హక్కును – పోగొట్టుకొంటున్నారు.

తమిళానికి మాత్రమే విశిష్ట ప్రాచీన భాష హోదానిచ్చి, తెలుగుకు ఇవ్వకపోవడం వీరిని మానసికంగా మరింత న్యూనతాభావంలోకి నెట్టివేసింది. నిజానికి ఈ భావం తెలుగు జనాల్లో చాలా ఏళ్లుగా గూడుకట్టుకొంటున్నది. ఇందుకు కారణం మన మేధావులు, మన రాజకీయనాయకులు.

ఏమాత్రం సాంస్కృతిక భావోద్వేగం గాని, ఆత్మగౌరవం గాని లేని రాజకీయ నాయకులే మనకు ఎక్కువగా ఉన్నారు. వాళ్లనుబట్టే ప్రభుత్వాలు నడుస్తున్నాయి. మేధావులు స్వార్థపరులయ్యారు. ఈ పరిస్థితులను మార్చేదిశగా ఉద్యమాలు రావాలి.

ఇందుకు కావలసిన ముడిసరుకు – ఆలోచన. అది భావ విప్లవానికి దారితీస్తుంది. డా॥ పూర్ణచంద్ అన్వేషణ, యువమేధావులను పరిశోధనలకు పురికొల్పుతుంది. ఉద్యమకారులకు ఊపిరినిస్తుంది.

తెలుగుకు సంపన్న ప్రాచీనభాష హోదా వస్తుందా, రాదా? ఎప్పుడు వస్తుంది? – ఈప్రశ్నలకు ఈ పుస్తకం సమాధానం కాకపోవచ్చు. ఆ సమాధానం చెప్పవలసింది మన రాజకీయనాయకులు మాత్రమే. కాలం విసిరిన సవాళ్లనందుకొని, ఎవరి పనిని వాళ్లు చెయ్యగలిగితే, కలిసి ముందడుగు వేయగలిగితే మనం అన్నీ సాధించుకోవచ్చు.

కానీ, సాధించుకొన్న తర్వాతయినా, మనం ఏం చెయ్యాలో చెప్పేందుకు పనికొచ్చే ఒక పుస్తకం ఇది. పైనే ప్రస్తావించినట్లు ఇదొక కోణం మాత్రమే. తెలుగుజాతి భాషా మూలాల్ని, చారిత్రక మూలాల్ని బాగా అన్వేషించుకోవాలి. భవిష్యత్తుపట్ల ఒక ప్రణాళికతో ముందడుగు వెయ్యాలి. తెలుగుజాతి ఎంతో శక్తివంతమైంది. ఈ తల్లి కడుపున ఎందరో మహావ్యక్తులు జన్మించారు. ఈ బంగరుతల్లి సర్వశక్తిమంతురాలు. ఆ అమ్మ బిడ్డలుగా మన పూర్వులపట్ల గౌరవంతోనే – మన ముందున్న కర్తవ్యాలను నెరవేర్చడం కోసం ముందడుగు వెయ్యాలి. ఆ ప్రయాణాన్ని నిర్దేశిస్తున్న ఒక దారిదీపం ఈ పుస్తకం. ఇందుకే ఈ పుస్తకాన్ని డా॥ జి.వి.పూర్ణచంద్ మనకిచ్చాడు. ఆయనను నిండుమనసుతో అభినందిస్తున్నాను.

**డా॥ సామల రమేష్‌బాబు,**

సంపాదకుడు : నడుస్తున్న చరిత్ర

# 1. దక్షిణ భారత భాషా కుటుంబం

1816లో ఫ్రాన్సిస్ ఎల్లిస్ అనే బ్రిటిష్ పౌర అధికారి మొట్టమొదటగా దాక్షిణాత్య భాషలన్నీ ఒకే భాషాకుటుంబానికి చెందినవిగా ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. అక్కడి వరకూ అది ఒక గొప్ప ఆలోచన.

ఆ తర్వాత 40 ఏళ్ళకి "ఏ *కంపారెటివ్ గ్రామర్ ఆఫ్ ద ద్రవిడియన్ ఆర్ సౌత్ ఇండియన్ ఫ్యామిలి ఆఫ్ లాంగ్వేజెస్*" అనే గ్రంథాన్ని *రాబర్ట్ ఎ. కాల్డ్‌వెల్* 1856 లో ప్రకటించాడు.

"ద్రవిడియన్ భాషా కుటుంబం" అని గానీ, "సౌత్ ఇండియన్ భాషాకుటుంబం" అని గానీ, ఏదైనా ఒక పేరుతో ఈ భాషాకుటుంబాన్ని వ్యవహరించాలని ఆయన ఉద్దేశ్యం. కానీ, "*ద్రావిడ భాషా కుటుంబం*" అనడం వైపే భాషాశాస్త్రవేత్తలు నడిచారు.

'*ద్రావిడ* అనే సంస్కృత పదం దక్షిణాదిలోని అన్ని ప్రాంతాలనూ సూచించేదిగా చాలా కొద్ది సందర్భాలలో మాత్రమే ప్రయోగించ బడినప్పటికీ, అది తమిళులకూ, తమిళ భాషకూ ఉత్తరాది వారు పెట్టుకున్న పేరేననేది స్పష్టం.

ఈ ద్రావిడ పదాన్ని 24 భాషల సముదాయానికి తగిలించినప్పుడే, తమిళేతరులకు, ముఖ్యంగా తెలుగు వారికి-తెలుగు భాషకు జరగవలసిన అపకారం జరిగిపోయింది. ఇప్పుడు జరగవలసింది తెలుగు భాష ప్రత్యేకతనీ, ప్రాచీనతనీ, ప్రశస్తినీ నిరూపించుకునే ప్రయత్నాలు మాత్రమే !

## "భాషా ప్రాంత" సిద్ధాంతం

'*భాషా ప్రాంతంగా ఇండియా*"(ఇండియా యాజ్ ఎ లింగ్విస్టిక్ ఏరియా) అనే ప్రతిపాదనతో భారత దేశంలోని నాలుగు ప్రధాన భాషా కుటుంబాల్నీ సమన్వయం చేస్తూ, అనేక పూర్వ ద్రావిడ భాషా రూపాల్ని వెలుగులోకి తెచ్చిన "***ప్రొఫెసర్ ముర్రే బారన్సన్ ఎమెనో***" భారతీయులందరికీ, ముఖ్యంగా తెలుగు, తమిళ ప్రజలకు ప్రాతః స్మరణీయుడయ్యారు.

భాషా చారిత్రక దృష్టి కోణంలోంచి పరిశీలించినప్పుడు, ""*భాషా ప్రాంత సిద్ధాంతం*"అనేదిచాలా ముఖ్య మైనదిగా కనిపిస్తుంది. 1956లో *ప్రొఫెసర్* ఎమెనో ఈ సిద్ధాంతానికి ఒక రూపం కల్పించాడు.

అనేక భాషా కుటుంబాలకు చెందిన భాషల్లో కొన్నింటి మధ్య ప్రాచీన కాలంగా ఏర్పడి ఉన్న సంబంధాల వలన అనేక సామీప్య సారూప్యతలు రూపొందుతాయి. అలా వివిధ భాషా కుటుంబాలలో, వివిధ రూపాలు ఏర్పడినప్పుడు అది "భాషా ప్రాంతం" అవుతుంది !

ఈ **భాషా ప్రాంత సిద్ధాంతాన్ని** ప్రొఫెసర్ ఎమెనో భారత దేశంలోని నాలుగు ప్రధాన భాషా కుటుంబాలకు అన్వయించారు. ఒక భాషా కుటుంబంలోని భాషలు ఆ దేశం అంతా వ్యాపించి ఉంటాయి. దేశానికి వెలుపల కూడా ఉంటాయి. ఆయా భాషల వ్యాపనాన్ని (డైరక్షన్ ఆఫ్ డిఫ్యూజన్) అధ్యయనం చేస్తేనే భాషా చరిత్ర తెలుసుకో గలుగుతాం.



ప్రొఫెసర్ ముర్రే బారస్సన్ ఎమెనో'

**ప్రొఫెసర్ ఎమెనో** తన సహచరుడు **టి.బరో** తో కలిసి రూపొందించిన **ద్రవిడియన్ ఎటిమలాజికల్ డిక్షనరీ** ఈ దిశలో ఒక గొప్ప మలుపు. ద్రావిడ భాషల స్వరూప స్వభావాల్ని అర్థం చేసుకోవడానికి ఇది ఒక కరదీపికగా ఉపయోగపడ్తోంది. దీన్ని అధ్యయనం చేస్తూంటే, ద్రావిడ భాషల మూలాలు బాగా అవగతం అవుతాయి. సంస్కృతం ఇంకా ఇతర ఇండోఆర్యన్ భాషల్లోకి వెళ్ళిన ఎన్నో ద్రావిడ పదాలుకూడా మనకు స్పష్టంగా కన్పిస్తాయి.

# సంస్కృతం పైన ద్రావిడ భాషల ప్రభావం

భాషా చారిత్రక విశ్లేషణకోసం *ప్రొఫెసర్* ఎమెనో మొదట ఇండియాలోని నాలుగు భాషా కుటుంబాలకూ సరిహద్దులు నిర్ణయించే ప్రయత్నం చేశారు.

ఒక్కో భాష తన మూల స్థానం నుంచి ఏ విధంగా వ్యాపనం చెందిందో విశ్లేషించడం ఆయన లక్ష్యం.

ఒక భాషా కుటుంబానికి చెందిన ఏదైనా ఒక భాష $F_1$ అనుకొంటే, ఆ భాషాపదం వేరొక భాషా కుటుంబానికి చెందిన మరోభాషలో కన్పించినప్పుడు, ఆ రెండో భాష $F_2$ అవుతుంది.

అంటే, $F_1$ , $F_2$ భాషలు వేర్వేరు భాషా కుటుంబాలకు చెందిన రెండు భాషలు. ఈ రెండింటిలోనూ ఒకే రూపంలో, ఒకే అర్థంలో అనేక పదాలు కన్పించినప్పుడు, అవి $F_1$ లోంచి $F_2$ లోకి వెళ్ళాయా-$F_2$లోంచి $F_1$ లోకి వచ్చాయా అనేది ప్రశ్న. సాధారణంగా పరస్పర మార్పిడి పద్ధతిలోనే పదాలు ఒక భాషలోంచి ఇంకొక భాషలోకి ఆదాన ప్రదానాలవుతాయి. ఒకో పదాన్నీ విడివిడిగా పరిశీలించి విశ్లేషిస్తే అది ఏ భాషలోంచి ఏ భాషలోకి వెళ్ళిందో అవగతం అవుతుంది.

ఇండో-ఆర్యన్ భాషా కుటుంబంలోని సంస్కృతాన్ని $F_1$ గాను, ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన తెలుగుని $F_2$ గాను భావిస్తే, *ప్రొఫెసర్* ఎమెనో $F_2$ లోంచే $F_1$ లోకి పదాలు ఎక్కువగా వెళ్ళేందుకు అవకాశం ఉన్నదన్నారు.

ముఖ్యంగా సంస్కృతం లాంటి *ఇండో ఆర్యన్ భాషా కుటుంబానికి* చెందిన భాషలు, ద్రావిడ భాషల్లోంచి ఎన్నో పదబంధాల్నీ, పదాలనూ అరువుగా తీసుకున్నాయని, ఆ తర్వాతే అనేక క్రొత్త సంస్కృత పదాలు రూపొందాయనీ పేర్కొన్నారు (Indo Aryan, including Sanskrit, had borrowed a complex Trait and numerous items from Dravidian, then developed new items independently).

తొలి దశలో, సంస్కృత భాష సామాజికంగా ***"పూర్వద్రావిడ భాష"*** (ప్రోటో ద్రవిడియన్ భాష)తో ఎక్కువ సంబంధాలు కలిగి ద్విభాషా శైలితో కూడుకొని ఉండేదని కూడా దీనిని బట్టి మనం అర్థం చేసుకోవచ్చు. ఇంగ్లీషు మాటలు కలగలిపి మనం తెలుగు మాట్లాడుతున్నట్లు ఆ రోజుల్లో సంస్కృత భాష మాట్లాడిన ప్రజలు ***"పూర్వద్రావిడ భాష"*** పదాలను కలిపి మిశ్రమ శైలిలో మాట్లాడి ఉంటారు.

"Dravidianization of Sanskrit in some of its structural features must lead to the partial conclusion that, a sufficient proportion of certain generations of Sanskrit Speakers learned their Sanskrit from person whose original Dravidian linguistic traits were translated into Indo Aryan-" ఈ మాటలు *ప్రొఫెసర్ ఎమెనో* గారిని ఉటంకిస్తూ ***ఇండియా యాజ్ ఎ లిటరరీ ఏరియా*** అనే వ్యాసంలో *సెంట్రల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ లిటరేచర్* (CIIL,Mysore)పూర్వపు డైరెక్టర్ *శ్రీ కె. నారాయణ్* పేర్కొన్నవి.

ఏ ద్రావిడ భాషా పదాలు సంస్కృతంలోకి చేరిపోయాయో ఆ ద్రావిడ భాషకు చెందిన వారి ద్వారా...సంస్కృతాన్ని, సంస్కృతం మాతృభాషగా కల్గిన ప్రజలు నేర్చుకోవాల్సి వచ్చిందని ప్రొఫెసర్ ఎమెనో స్పష్టీకరించినట్లు దీన్నిబట్టి అర్థం అవుతోంది. *పూర్వతెలుగు* (ప్రోటో తెలుగు) లేదా తెలుగు భాషతో సంస్కృతంలోకి ఆదాన ప్రదానాలు ఎక్కువగా జరిగాయి కాబట్టి, ఆ ద్రావిడ భాష తెలుగేనని గట్టిగా చెప్పవచ్చు.

*తెలుగు భాష సంస్కృత భూయిష్ఠం, తమిళం స్వతంత్ర భాష అంటూ, ద్రావిడ భాషపై పరిశోధనలు చేసే వారిలో చాలామంది తెలుగును ఈసడిస్తూ పక్కన పెడుతూ వచ్చారు. కానీ, సంస్కృతాన్ని మాతృభాషగా కల్గిన ప్రజలతో, సన్నిహిత సాహచర్యం లేకుండా జన సామాన్యం మాట్లాడుకునే తెలుగులోకి సంస్కృత పదాలు ఎలా చొచ్చుకు రాగలుగుతాయి ?*

***సంస్కృత పదాలు ఏ భాషలో జనం వాడకంలో ఎక్కువగా ఉన్నాయో ఆ భాషా ప్రజలు సంస్కృత ప్రజలకు కచ్చితంగా సమకాలీనులు కావాలి. సహజీవనులు కావాలి కూడా...***

తెలుగులో సంస్కృత పదాలు సంస్కృతం లోంచి వచ్చినవో లేక తెలుగు లోంచే సంస్కృతంలోకి వెళ్ళినవో శాస్త్రీయ విశ్లేషణ ఎవరూ చేయలేదు. తెలుగువారికి పదసంపదే లేదన్నట్లు మనల్ని మన వాళ్ళు కూడా తక్కువ చేసుకునే ఆలోచిస్తున్నారు.

కొంచెం లోతుగా పరిశీలిస్తే, తెలుగులో ఉన్న చాలా సంస్కృతపదాలు తెలుగు లోంచే సంస్కృతంలోకి వెళ్ళినవిగా బోధపడ్తుంది. సంస్కృతంలో తెలుగు పదాలున్నాయని రుజువు కావడం తెలుగువారికి గర్వకారణమైన విషయమే కదా... అందువలన సంస్కృత భాషకు అపచారం జరిగేది మాత్రం ఏముంటుంది... ?

## పూర్వ ద్రావిడ భాష అంటే ఏది ?

ప్రొఫెసర్ భద్రిరాజు కృష్ణమూర్తి("భాష-సమాజం-సంస్కృతి" పేజీ-162)లో ఇలా రాశారు:

"షుమారు 6,000 ఏళ్ళకు ముందు, ద్రావిడ భాషా కుటుంబానికి మాతృక అయిన భాష ఒకటి ఉండి ఉండాలి. క్రీ.పూ. 2000 ఏళ్ళ క్రిందట ప్రాచీన ద్రావిడ మాతృక మూడు శాఖలుగా చీలింది."దక్షిణ", "మధ్య", "ఉత్తర" ద్రావిడ శాఖలని.

క్రీ.పూ.1500 ప్రాంతంలో *దక్షిణ పూర్వ ద్రావిడ శాఖ* (సదరన్ ప్రోటో ద్రావిడియన్) మరి రెండు ఉపశాఖలయ్యింది. ఒక ఉపశాఖలోని మాండలికాలు ఏడు భాషలైనాయి. తమిళం, మళయాళం, కన్నడం, తుళు, తోద, కోత, కొడగు-అని. రెండో ఉపశాఖ కూడా ఏడు భాషలయ్యింది. తెలుగు, గోండి, కొండ, కూయి, కువి, పెంగో, మంద -అని.

ద్రావిడ భాషల్లో తెలుగు, తమిళ, కన్నడ, మళయాళ భాషలకు మాత్రమే లిఖిత సాహిత్యం ఉంది. గోండి, కూయి భాషలు తెలుగుతో పాటే విడివడి రూపొందిన ఉపశాఖలే. కానీ, ఈ భాషల్ని మాట్లాడుతున్న ప్రజలు ఉత్తరాదిలో ఉన్నారు. కాబట్టి తెలుగు పలుకుబడులకు అవి దూరంగా వున్నాయి- అని.

*పై రెండు శాఖలు వేరైన తర్వాత క్రీ.పూ. 5-6 శతాబ్దాలకే తెలుగు ప్రత్యేక భాషగా జ్ఞాతి భాషలనుంచి వేరయి ఉండాలి అని అన్నారాయన.*

***తెలుగు భాషా పరిణామాన్ని స్వరూపదృష్టితోనూ, ప్రయోగ దృష్టితోనూ పరిశీలించాలనీ, పూర్వ యుగాలలో తెలుగు వినియోగం ఏ విధంగా ఉండేదో, ఏయే మార్పులవల్ల నేటి తెలగు ఏర్పడ్డదో గుర్తించాలనీ, తెలుగు వాడుక ఏయే రంగాల్లో మొదటినుంచీ వర్ధిల్లిందో చారిత్రకంగా అధ్యయనం చేయాలనీ ఆచార్య భద్రిరాజు పేర్కొన్నారు.తెలుగే ప్రాచీనం పేరుతో వెలువరిస్తున్న ఈ గ్రంథానికి ఈ ఆప్త వాక్యాలే ప్రేరణ.***

# 2. సింధు నగరాలలో ప్రోటో తెలుగు ప్రజలు

ప్రాచీన భారతదేశ చరిత్ర అంటే ఋగ్వేదం, సింధునాగరకత, ఆర్యులదాడి, ద్రావిడులను దక్షిణాదికి తరిమేయడం ఇవే ప్రధానాంశాలు కావనీ, ఋగ్వేద ఆర్యులు, సింధునగరాల వాసులైన ప్రజలు సహజీవనం చేశారనీ, వారితోపాటు *పూర్వ ద్రావిడులు (లేదా) ద్రావిడ భాషా కుటుంబీకులు* కూడా కలిసి జీవించారనీ, వీరంతా ఒకరి వలన మరొకరు ప్రభావితులైన వారనీ నిరూపించే అనేక అంశాలు వెలుగులోకి రావడంతో పరిశోధనలు కొత్త పుంతలు తొక్కసాగాయి.

*భారతదేశంలో నాలుగు ప్రధాన భాషాకుటుంబాలున్నాయి*

1. **ఆస్ట్రిక్ భాషాకుటుంబం:**- ఇందులో ***ముండా భాష*** అతి ప్రాచీనమైంది .
2. **ఇండో యూరోపియన్ భాషా కుటుంబం:**- ఋగ్వేద సంస్కృతం ఈ భాషాకుటుంబ పరిధిలోకి వస్తుంది. ఉత్తర భారతదేశం లోని అనేక భాషలు ఈ కుటుంబంలో రూపు కట్టుకున్నాయి.
3. **ద్రావిడ భాషాకుటుంబం:**- తెలుగు, తమిళ, కన్నడ, తుళు, మలయాళం తదితర 24 భాషల కుటుంబం ఇది.
4. **మంగోలాయిడ్ భాషా కుటుంబం:**- సైనో టిబెటన్ భాషా కుటుంబం అని కూడా అంటారు. చైనా, టిబెట్, అసోమ్, బెంగాల్, బీహార్, నేపాల్, రాజస్థాన్, మధ్యప్రదేశ్, ఛత్తీస్‌ఘడ్‌లలో అనేక గిరిజన తెగల భాషల భాషా కుటుంబం ఇది.

భారత దేశంలో ఈ భాషాకుటుంబాలు అతి ప్రాచీన కాలంలో నెరపిన సాన్నిహిత్యం, సంస్కృతిని నిర్మించుటంలో వీటి సమష్టి పాత్ర గణనీయమైనది.

భారత దేశంలో భాషల చరిత్రని పరిశీలించుటం మొదటుగా **ఆస్ట్రిక్ భాష అయిన పూర్వ ముండా భాషతోను, ఇండో ఆర్యన్ భాష అయిన ఋగ్వేద ఛందంతోను ప్రారంభం అవుతుంది.**

*ఈ క్రమంలో పరిశీలిస్తూ ఉండగా ఋగ్వేదంలో ఆస్ట్రిక్ భాషాకుటుంబానికి చెందిన కొన్ని "పూర్వ ముండా " (ప్రోటో మూండా) భాషాపదాలను అలాగే మరికొన్ని "పూర్వ ద్రావిడ " (ప్రోటో ద్రవిడియన్) భాషా పదాలను పరిశీలకులు గుర్తించగలిగారు.* ఈ పరిశీలన తరవాత మూడు విషయాలు స్పష్టమైనాయి.

1.కురు-పాంచాల భరతుల చరిత్రగా ఋగ్వేదం అధిక భాగం భారత దేశంలోనే సంకలితం అయ్యింది. ఇక్కడి జాతులు, ఇక్కడి నాగరకత, ఇక్కడి భాష, ఇక్కడి సంస్కృతులే అందులో ప్రతిబింబిస్తున్నాయి.
2. ఋగ్వేద రూపకర్తలకన్నా ముందు నుంచే వాళ్ళకన్నా భిన్నమైన సంస్కృతి, భాష కలిగిన ప్రజలు ఈ దేశంలో నివసించేవారు.
3. ఋగ్వేద ఆర్యులు, వారికన్నా పూర్వీకులైన పూర్వ ముండా ప్రజలు, పూర్వ ద్రావిడ ప్రజలతో సహజీవనం కొనసాగించారు. వారి ప్రభావం ఋగ్వేద రూపకల్పనలో తప్పనిసరిగా ఉంది.

## ఆర్యులూ ద్రావిడులూ కలిసే జీవించారు

చరిత్రకారులలో ఆర్యుల దాడి జరిగిందనే వారు, జరగలేదనే వారు... ఇలా రెండు వర్గాలుగా ఉన్నారు.

జిమ్ షాఫర్, డైని లిఖ్‌టేన్‌స్టీన్(1999) అనే ఆర్కియాలజిస్టులు ఆర్యుల దాడి అనేది జరిగిన దాఖలాలు ఏమీ లేవని స్పష్టంగా పేర్కొన్నారు. అయితే, ఆధారాలు దొరకనంత మాత్రాన ఆర్యుల దాడి జరగలేదనలేమని షేరీన్ రత్నాగర్ (1999)వాదిస్తున్నారు.

*ఆర్యన్ ఇన్వేజన్ థియరీ (ఏఐటీ)* వాదులు ఆర్యులు బయటనుంచి వచ్చి ఉత్తర భారత దేశం అంతా తమ సంస్కృతినీ, భాషనీ వ్యాపింప చేశారని అంటారు. ఆర్యుల జన్మభూమి భారత దేశం కాదనీ, ఇండో యూరోపియన్ భాషా కుటుంబం జన్మభూమి కూడా భారత దేశం కాదనీ నిరూపించడం వీరి లక్ష్యం. ఓఐటీ-(ఔట్ ఆఫ్ ఇండియా థియరీ) సిద్ధాంతం అని దీనికి పేరు.

వీళ్ళలో రెండు రకాల వాదాలు కన్పిస్తాయి. (1) ఆర్యులు ఆగంతకులుగా దాడి చేసి వచ్చారు- ఇన్వేజన్ (2) ఆశ్రితులుగా వలస వచ్చారు-ఇమ్మిగ్రేషన్ అని.

ఇంక రెండోవర్గం వారిది వీరికి భిన్నమైన వాదన. ఆర్యుల దాడి జరగనే లేదని వాదిస్తారు. ఈపరిశోధకులుఎక్కువ మంది ఆర్యుల జన్మభూమి భారత దేశమేనంటారు.

ఈ రెండు సిద్ధాంతాలూ రైలు పట్టాల్లాంటివి. ఏ నాటికీ కలవవు, కలవలేవు. చరిత్రకు రాజకీయ రంగు పులమడమే ఇక్కడ విచారకరం.

ఈ వివాదాలకు సమన్వయం అనదగిన రీతిలో కొన్ని సిద్ధాంతాలను అధ్యయనం చేసినప్పుడు ఆర్యులు అనేక జాతులతో సహజీవనం చేసిన వైనం వెలుగులోకొస్తుంది.

క్వీపర్, హోల్, సౌత్‌వర్త్ బ్లాచ్, లేవీ, ప్రిలుడ్‌స్కీ లాంటి ప్రముఖులు ద్రావిడ భాషల మూలాలను, మూండా భాష మూలాలను ఋగ్వేద శబ్దాలలోంచి వేరు చేసి చూపగలిగారు.

దక్షిణ ఆసియాలోని దేశాల మధ్య అనాది కాలంగా నడచిన పరస్పర సంబంధాలన్నీ ఇచ్చి పుచ్చుకునే ధోరణిలోనే సాగాయి. కాబట్టి, మూల ద్రావిడులు, వైదిక ఆర్యులు సమకాలీనంగా కలిసి జీవించారనేది వీరి విశ్లేషణలో ముఖ్యమైనది.

అంతేకాదు, సింధు నాగరికతలోని నగరాలు అనేక నగర రాజ్యాలు కావచ్చనీ, ఈ రాజ్యాలలో కొన్ని ఆర్యులవి, కొన్ని పూర్వ ద్రావిడ భాషా కుటుంబీకులవి కావచ్చనీ మరో ముఖ్యమైన ఆలోచన కలగటానికి ఈ సమన్వయం దారి తీసింది.అలా ఆర్యులతోకలిసి జీవించిన వారిలో పూర్వ తెలుగు ప్రజలుకూడా వున్నారనేది ఇక్కడ ముఖ్య విషయం.

*మైఖెల్ విజ్జల్* వివరణ ఇది–

*'వరి'* ధాన్యాన్ని *ఉత్తర సింధు నాగరకత* (రెండు పంజాబ్‌లూ కలసిన ప్రాంతం)లో ప్రజలు ఆ రోజుల్లో ఎరిజ్ (@E@rij) అని పిలిచారు.

*దక్షిణ సింధు నాగరకత* (సింధు రాష్ట్రం) ప్రాంతంలో *వరి, (వ్)అరికి, వరిజ్‌కె* అని పిలిచారు–

*నాగలిని* కూడా ఇలాంటి కొద్ది తేడాతోనే పిలిచారు,

ఉత్తర సింధు:laGgal (సంస్కృత లాంగల)
దక్షిణ సింధు :nagkal(తెలుగు నాగలి)

***విజ్జెల్ పండితుని ప్రకారం ఉత్తర సింధునాగరికతలో అంటే, మొహెంజోదారోలో పూర్వ (ప్రోటో ఆర్యన్లు) ఆర్యులు నివసించారని, దక్షిణ సింధు నాగరకతలో అంటే హరప్పా లో పూర్వ ద్రావిడులు(పూర్వ ద్రావిడులు) నివసించారని అర్థం అవుతోంది.***



ప్రొఫెసర్ మైఖెల్ విజ్జల్

ఈ ప్రోటో ఆర్యన్లు భారత దేశంలో ఋగ్వేదం వంటి మహత్తర సాహిత్యాన్ని అందించిన ఆర్యులుగా గంగాతీరం వెంబడి వ్యాపించారు. ఈ ప్రోటో ఆర్యులలోనే ఇరాన్ వైపు వెళ్ళినవారు *జెండ్అవెస్తా* రూపకర్తలయ్యారు.

లోథాల్ ఓడరేవు లాంటి ముఖ్యమైన సింధు రాజ్యాలను వెలికితీసి సింధులిపిలో ఆర్యుల మూలాలను విశ్లేషించిన *ప్రొఫెసర్ ఎస్.ఆర్.రావు* సింధు నగరాలలో ఋగ్వేద ఆర్యులు కూడా ఇతరులతో కలిసే జీవించారని, పూర్వ ద్రావిడులు, ఆర్యులు సహజీవనం చేశారని పేర్కొన్న విషయం ఇందుకు ఊతంగా కన్పిస్తుంది.

ఇదే కోణంలోనే మరిన్ని వివరాలు పరిశీలించండి:-

*వరి* (ద్రావిడ రూపం), *వ్రీహి* (ఋగ్వేద సంస్కృత రూపం) ఈ రెండు పదాలూ పూర్వముండా (*ప్రోటో మూండా*) భాషా రూపం *ఎరిగ్* లోంచే ఏర్పడ్డాయని *విజ్జెల్, క్వీపర్* పండితులు నిరూపిస్తున్నారు.

సింధునాగరకత ఉత్తర భాగంలో వేద భాషా కుటుంబీకులు, దక్షిణ భాగంలో వైదికేతర భాషాకుటుంబీకులు నివసించి ఉంటారనేది వీరివాదన. ఈ వైదికేతరులు బహుశా ద్రావిడభాషా కుటుంబీకులు కావచ్చు. ఇందుకు *విజ్జెల్* చేసిన విశ్లేషణ ఇది.

**ఉత్తరసింధు** : వేద భాష: ఎరిగ్, ఎరిజ్, వ్రిజ్, వ్రిజ్హి(ఘి), వ్రీహి

**దక్షిణ సింధు** : పూర్వ ద్రావిడ : ఎరిగ్ (వ్) అరి' వరి-కి',

తెలుగు: వరి

తమిళ: అరికి

కన్నడ: అక్కి

*పూర్వముండా భాషారూపం ఎరిగ్ లోంచే, వైదిక వ్రీహి తెలుగు వరి మొదలైన పదాలు ఏర్పడ్డాయనీ, ఇది సింధునాగరకతలో ఆర్యులు, ద్రావిడులు సహజీవనం చేసిన కాలంలోనే జరిగిందనీ విజ్జెల్ గారి నిరూపణ. వరిలోంచే గ్రీకుల ఒరైజా, ఇంగ్లీష్ రైస్ పదాలు ఏర్పడ్డాయి.*

*భాషా ప్రాంత సిద్ధాంతం ప్రకారం వివిధ భాషా కుటుంబాలకు చెందిన పదరూపాలు ఒకదానిలోంచి ఇంకొక దానిలోకి పరస్పర వ్యాపనం చెందుతాయి. అలా చెందినప్పుడే అది భాషా ప్రాంతం అవుతుంది. ఈ సిద్ధాంతం ప్రకారం వేద శబ్దాలలో అనేక ద్రావిడ శబ్దాలు కూడా కలగలిశాయి. ఋగ్వేదం రూపొందే విషయంలో ఆర్యేతరుల సహకారం, సాహచర్యం వున్నాయనడానికి ఇవి సాక్ష్యాలు.*

ఈ ఆర్యేతరులలో పూర్వద్రావిడులు నిర్వహించిన పాత్ర ముఖ్యమైంది. పూర్వ ద్రావిడ భాషల్లో బ్రాహుయి, కురుఖ్, మాల్తోలతో పాటు, ప్రోటో తెలుగు కూడా అప్పటికే అంతో ఇంతో రూపుదిద్దుకునే ఉంటుందని భావిస్తున్నారు. మరిన్ని వివరాలలోకి వెళదాం.

# *3. మనువులు - పూర్వ ద్రావిడులు*

సింధు నాగరకత 8,000 ఏళ్ళ క్రితం మొదలైందనీ, 4,400 ఏళ్ళ క్రితం ఉచ్ఛస్థితిలో వున్నదనీ కనీసం 700 ఏళ్ళపాటు దేదీప్యమానమయ్యిందనీ, 3,700 ఏళ్ళ క్రితం క్షీణదశ ప్రారంభమై అనతి కాలంలోనే అంతరించిందని పరిశోధకులు చెప్తారు.

***సింధునగరాలలోకి ఆర్యుల రాకకు సంబంధించి తిలక్ పండితుడు చెప్పిన విషయాలను ఒకసారి పరిశీలిద్దాం.***

క్రీ.పూ.10,000-8000 సంవత్సరాల కాలంలో వైదిక సంస్కృతి ఉత్పాదకులైన ఆర్యులు బహుశా ఉత్తర ధృవంలో ఉండేవారు. క్రీ.పూ.8000-6000మధ్య కాలంలో యూరప్, ఆసియా ఖండాలకు చేరుకున్నారు. ఆర్య నాగరకతకు అది ప్రారంభకాలం. దాన్ని *"అదితి యుగం", "పునర్వసు యుగం"* ఇలా చెప్పుకున్నారు.

క్రీ.పూ. 6000 నుంచి 3000 మధ్య కాలం ఆర్య నాగరకతకు ద్వితీయ యుగం. దీన్ని *"మృగశీర్ష"*యుగం అన్నారు. ఈ యుగంలో ఆఫ్ఘనిస్తాన్ హద్దులదాకా



**సింధునగరాలలో ఆర్యులు- ఒక చిత్రకారుడి ఊహా చిత్రం**

లేదా సింధు నాగరకత ముఖద్వారం దాకా ఆర్య గణాలు ప్రవేశించి వుండాలి. ఋగ్వేదంలోని అనేక సూక్తాలు ఈ యుగంలో ఆవిష్కృతాలయ్యాయి. ఋషి పరంపరగా వచ్చిన వైదిక విజ్ఞానాన్ని భద్ర పరచుకోవాలనే విధానం ఈ యుగంలో కన్పిస్తుంది.

క్రీ.పూ. 3000-1400 ఇది ఆర్య నాగరకతలో 3వ భాగం. దీన్ని *"కృత్తికా యుగం"* అన్నారు. ఈ యుగంలో ఋగ్వేదం ఒక రూపాన్ని పొంది ఉంటుంది. తైత్తిరీయం బ్రాహ్మణాలు కూడా వెలువడ్డాయి. సామ, అధర్వణ వేదాలకు రూపకల్పన జరిగి వుంటుంది. సామవేదం, తైత్తిరీయాల తర్వాతే అధర్వవేదం వెలువడిందని *సంస్కృత వాఙ్మయ చరిత్ర గ్రంథంలో మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు* పేర్కొన్నారు (పేజి 49). గంగా తీరానికి ఆర్యులు విస్తరించడం మొదలు పెట్టిన దశ ఇది.

క్రీ.పూ. 1400- 500 మధ్య కాలం ఆర్య నాగరకతలో 4వ భాగం. ఇది *బుద్ధుడికి పూర్వయుగం.* ఈ యుగంలో అనేక సూత్రాలు, వేదాంత గ్రంథాలు వెలువడ్డాయని ఆయన పేర్కొన్నారు. ***ఈ యుగంలో సంస్కృతం మాతృ భాషగా కలిగిన ప్రజలతో అచ్చ తెలుగు (ప్రోటో తెలుగు) ప్రజలకు అత్యంత సాన్నిహిత్యంతో కూడిన సాహచర్యం ఏర్పడి ఉండాలి.***

## ద్రావిడ భాషలో "మను" శబ్దం

పురాణేతిహాసాల్లో కన్పించే మనువులు భారత వర్ష వాసులు కారని, వీళ్ళు రమ్యక వర్ష వాసులని భారత భాగవతాది గ్రంథాల్లో కన్పిస్తుంది.రమ్యక వర్ష పాలకులైన మనువులు మొత్తం 14 మంది.

స్వాయంభువుడు, స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుసుడు, వైవస్వతుడు, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, దౌత్యుడు, భౌత్యుడు- ఈ పేర్లు మనకి కన్పిస్తాయి.***వీళ్ళలో వైవస్వత మనువు కాలంలో ఆర్యులు సింధునాగరకతలో అడుగు పెట్టి వుండాలి. అందుకని "వైవస్వతమన్వంతరే" అని మనం మన ఉనికిని చెప్పుకొంటున్నాం.***

ఆనాటి ఆర్య గణాల పాలకులైన ఈ మనువుల రాజ్యాంగ విధానంలో మూడు అంచెల పాలనా వ్యవస్థ కన్పిస్తుంది. 1. దేవతలు 2. ఋషులు 3. రాజులు. ఈ ముగ్గురూ సభ్యులుగా గల సంఘానికి అధ్యక్షుడు మనువు. మనువు మారిపోతే కొత్త మనువు అధ్యక్షుడుగా వస్తాడు.

వైవస్వత మనువు తర్వాత 7 మంది మనువుల వరకూ ఈ వ్యవస్థ కొనసాగి ఉంటుంది. ఆ తర్వాత ఆర్యులు గంగా తీరానికి విస్తరించడం ప్రారంభించాక ఈ మనువుల వ్యవస్థతో గానీ, లేదా మను సంఘాలతో గానీ తెగతెంపులు చేసుకుని స్వతంత్ర ఆర్యులుగా తమదైన వ్యవస్థని నిర్మించుకొని వుంటాయి ఆర్యగణాలు.

మనువుల కాలంలో కన్పించిన ఆదిత్యులు, వసువులు, రుద్రులు, సాధ్యులు, విశ్వులు, మరుత్తులు, భృగువులు అంగీరసుల స్థానంలో అత్రి, వసిష్టుడు, కశ్యపుడు ,గౌతముడు, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, జమదగ్ని ఇలా సప్త ఋషుల పేర్లు ప్రముఖంగా కనిపిస్తాయి.

అంటే, దేవతల వ్యవస్థని తప్పించి ఋషులు, రాజులు ప్రధానంగా ఉంటూ, మనువు స్థానంలో ఇంద్రుణ్ణి ప్రతిష్ఠించుకున్నట్లు అర్థం అవుతోంది. ఇది గంగా తీరం చేరే దశలో చోటు చేసుకున్న పరిణామం కావచ్చు.

*"త్రివిష్టపం"* అంటే స్వర్గలోకం. దేవతల పాలనావ్య వస్థ అది. యక్షులు, సిద్ధులు, సాధ్యులు, చారణులు, విద్యాధరులు, అప్సరసలు, నాగులు, కిన్నరులు, కింపురుషులు వీళ్ళంతా ఈ పాలనా వ్యవస్థలో భాగస్వాములే. కాబట్టి వీళ్ళందరినీ దేవతలే అన్నారు. ఈ దేవతల దాయాదులలో రాక్షసులు, దానవులు, దైతేయులు, పిశాచులు, అసురాది గణాలెన్నో ఉండేవి.మనువులు వీళ్ళకి నాయకులై ఉంటారు.

నిజానికి ఈ ఊహాత్మక అంశాలతో భాషా చరిత్రకు ఏ సంబంధంలేదు. కానీ, పూర్వ ద్రావిడ భాషలో **"మన్"** అనే రూపం చాలా విస్తృతార్థంలో కనిపిస్తుంది.

*1) పూర్వ ద్రావిడ రూపం మన్* to be

*2) పూర్వ ద్రావిడ రూపం మన్* earth , clay

*3) పూర్వ ద్రావిడ రూపం మన్* To unite , marry

ఈ మూడు పూర్వ ద్రావిడ మన్ రూపాలలోంచి ప్రోటో తెలుగులో రూపొందిన పదాలను గమనించండి.

1) **ప్రోటో తెలుగు**: మన్ –earth, mud,soil,dirt మను –మన్ను, మట్టి, నేల.

2) **ప్రోటో తెలుగు మన్** –grandson తెలుగు: మనుమడు, మనుమరాలు

3) **ప్రోటో తెలుగు మన్** –to live, exist, behave, conductoneself

తెలుగు **మను** – జీవించు, వర్తించు, బ్రతుకు

*అదనపు రూపాలు:*

(అ) మనకి, (మనికి) మనుట, పొంచుట, వాసస్థానం, స్థానం existence, home, place, location, living, life, livelihood, abode, dwelling

(ఆ)- మనుకువ, వాసస్థానము, చెలిమి (abode) dwelling place

(ఇ)- మనుగడ life, living, livelihood, subsistence.

(ఈ)- మనుచు, మనుపు, పోషించు, బ్రతికించు protection, maintainance

(ఉ)- మన్ను : దృశ్య మృగము, యుద్ధ సాధన విశేషము, భూమి, మన్నిక to last, be durable

(ఊ)- మన్ని : జీవనము, మన్న్య, పెడతలయందుండు నరము life

4) **ప్రోటో తెలుగు**: *మనమ్:* we (inclusive) తెలుగు: మనము

5) **ప్రోటో తెలుగు**: *మన్ -అవ్* a humble or respectful, request, prayer, reprasentation, socitation,petition తెలుగు: మనవి.

6) **ప్రోటో తెలుగు**: *మన్* (the male of a species of antelope, gayal, bison, potu, male-animal)

మనువు ఆడపిల్లకు ఇచ్చిన రాజ్యాన్ని దేవ రాజ్యమని, మగ సంతతికిచ్చిన రాజ్యాన్ని మానవ రాజ్యం అని అన్నారు. విశేషమేమంటే,

తెలుగులో మనుబోతు అంటే మగజంతువు. ఇంగ్లీష్‌లో manpower, chairman లాంటి పదాలలోmanఅనేది పురుషాధిక్య పదంగానే వాడుకలో ఉంది.

మొత్తం మీద ప్రోటో ఆర్యన్‌ల "మనువు"... ప్రోటో ద్రావిడియన్‌ల 'మన్' శబ్దాలు ఈ భూమి మీద స్థిరంగానూ, సుఖంగానూ జీవించటం అనే అర్థంలోనే కనిపిస్తున్నాయి. ఈ మన్ మూల ద్రావిడ రూపం తమిళ మలయాళాలలో earth, world అనే అర్థాలలో మాత్రమే వున్నాయి.

తమిళం కన్నా తెలుగులో ***మన్ రూపాలు*** అధికంగా ఉండటానికి ప్రోటోతెలుగు ప్రజలతో ప్రోటో ఆర్యన్లకు దగ్గర సంబంధం ఉండటం ఒక కారణం కావచ్చు. ఈ సంబంధాలకు సింధు నగరాలు వేదికగా నిలిచి ఉంటాయి.

# 4. సింధునాగరకతలో పూర్వ ద్రావిడులు

సింధునాగరికత ఏ ఒక్కరి స్వంతం కాదనీ, అనేక జాతుల లేదా తెగల సమష్టి కృషి అందులో ఇమిడి ఉందని ఇప్పుడు ఎక్కువమంది శాస్త్రవేత్తలు భావిస్తున్నారు.

సింధు నాగరకతకు చెందిన ఆనాటి ప్రజలకు భాష ఉంది. సంస్కృతి ఉంది. సరళమైన లిపి కూడా ఉంది. దాంతోనే సమాచారాన్ని ఇచ్చిపుచ్చుకునే వారు. సమాచారాన్ని దాచుకునే వారుకూడా.

సింధువులు అగ్నిని ఆరాధించారు. జంతువులను బలి ఇచ్చారు." ఇండస్ మైథాలజీ" అనే వ్యాసంలో ప్రొఫెసర్ ఎస్.ఆర్.రావు (మిథిక్ సొసైటీ క్వార్టర్లీ జర్నల్-1983) సింధునగరాల ప్రజలతో ప్రోటో ఆర్యన్లు సహజీవనం చేశారనీ, వారిలో ఇరానియన్లు, హిట్టయిట్ల రూపురేఖలు కూడా కన్పిస్తున్నాయని పేర్కొన్నాడు.

ఋగ్వేద రూప కర్తలకు ప్రోటో ఆర్యన్లు పూర్వీకులు. ఇటు వైదిక ఆర్యులకు, అటు ఇరానియన్ ఆర్యులకు ఈ ప్రోటో ఆర్యన్లు మూల పురుషులు (common ancestors) కావచ్చునని దండేకర్ (1979) ప్రకటించారు.

మిగిలిన సమకాలీన నాగరకతలతో పోల్చినప్పుడు సుమేరియన్ నాగరకత విషయంలో జాతుల సంలీనం భిన్నంగా జరిగింది. మెసపొటేమియా తదితర ప్రాంతాలను సుమేరియన్లు జయించారు, వారినించి ఇండో యూరోపియన్ తెగలకు చెందిన హిట్టయిట్లు జయించి పాలించారు. బాబిలోన్, ఇలమ్ (ప్రాచీన పర్షియా)లను కూడా అనేక జాతులు ఇలానే ఆక్రమించి పాలించాయి. కాబట్టి, సింధునాగరకత విషయంలో కూడా ఈ విధమైన ఘర్షణలే జరిగి ఉంటాయని కొందరు భావించారు.

అయితే, ఋగ్వేదం తొలి మండలాలలో ఆర్యులు ఆర్యేతరులైన అనేక జాతుల వారిని కలుపుకుని వాళ్ళని అర్ధదేవతలుగా స్వీకరించటాన్ని బట్టి సుమేరియాలో జరిగినంత ఘర్షణ సింధు నాగరకతలో జరిగి ఉండక పోవచ్చని నమ్మవచ్చు.

అసుర, దాస, దస్యు, యాతుధాన, క్రవ్యాద, మూరదేవ, రాక్షసాది ఆర్యేతర తెగలలో *ప్రోటో ద్రవిడియన్లు* కూడా ఉండి ఉంటారు.

"ఓ ఇంద్రా... ఆర్యులెవరు, దస్యులెవరో తెలుసుకుని కర్మ విరోధులైన ఆ దస్యుల్ని వధించు. లేదా, యజమానికి వశపరచు. దుష్టశిక్షకుడవై యజ్ఞ ఘాతకుల్ని అణిచి యజమానులతో యాగాన్ని చక్కగా చేయించు"-(ఋ-1-51-8)

"ఆర్యుడెవరో, దాసుడెవరో తెలిసికొని వాళ్ళని వేరుచేస్తూ, నేను యజ్ఞం కోసం వచ్చి యజమానుడి సోమాన్ని తాగుతున్నాను" -(ఋ-10-86-19) ఇలాంటి ఋక్కుల్లో ఆర్యులూ, ఆర్యేతరులూ కలగలిసి పోయి జీవిస్తున్న సమాజంలో ఆర్యులు తమని ప్రత్యేకంగా చెప్పుకుని తమఆధిపత్యాన్ని నిరూపించు కోవటానికి ప్రయత్నించారనే విశ్లేషణ కన్పిస్తుంది. తమ జాతిని, తమ సంస్కృతిని తమ భాషని కూడా సంరక్షించుకోవాలనే తపన వారి మాటల్లో స్పష్టంగా తెలుస్తోంది.

సింధునాగరికత కాలంలో సమాజం **ఉత్పాదకులు- వ్యాపారులుగా** ఉంది. కార్మికులు కర్షకులు కష్టించి తెచ్చిన ఉత్పత్తులకు వ్యాపారులు పెట్టుబడులు పెట్టడం, వాటిని మారకం చేయడం- ఒక విధమైన పరస్పర సహకారం జాతుల మధ్య నడిచేది. సింధునగరాల పతనం తరువాత వ్యాపారాలు పడిపోయాయి, జాతులు దూరంగా జరిగిపోయాయి. జీవన పోరాటం పెరిగింది. జాతుల మధ్య వైషమ్యాలు కూడా పెరిగాయి.

తొలి నాటి నీగ్రిడ్స్ తెగలను ప్రోటో *ముండా* ప్రజలు దక్షిణాదికి తరిమారు. కాలవాహినిలో చిన్న చిన్న తెగలుగా చీలిపోయి నీగ్రిడ్స్ తెగల వారు దక్షిణాది ప్రాంతాలలోనూ, అండమాన్ నికోబార్ దీవుల్లోనూ ఇంకా గిరిజనులుగానే బ్రతుకు వెళ్ళమారుస్తున్నారు.

సింధునగరాలనుంచి అంటే, ఈనాటి పంజాబ్ నుంచి గంగాతీరానికి విస్తరిస్తూ ఆర్యగణాలు ప్రోటో ముండా ప్రజల్ని ఈశాన్యానికి తరిమాయి.

బెలూచిస్తాన్‌లోని బోలాన్ నది పక్కన గల మెహర్‌ఘర్ ప్రాంతంలో వ్యవసాయం ప్రారంభించిన *బ్రాహుయి* ప్రజల్ని నాగరకులైన బెలోచి తెగలు అడవుల్లోకి తరిమాయి.

ఇలా దశాంతర్దశల్లో ఒక జాతి అభ్యున్నతిని సాధిస్తుంటే, మరో జాతి అధోగతి పాలవటం కన్పిస్తుంది. వ్యవసాయం తెలియనివారు అడుగంటిపోయారు. పశుపాలన చేపట్టనివాళ్ళు అడవుల్లో గిరిజనులుగా మారిపోయారు. ఒకవేళ పశుసంపద ఉన్నా వ్యవసాయం తెలియని వారు పశువుల మేత కోసం సంచార జాతులుగా మారిపోయి దేశ ద్రిమ్మరులయ్యారు. సుగాలి, లంబాడి, బంజారా జాతులు ఇలా మిగిలిపోయిన వారే. ఇది చరిత్రలో ఒక నెగిటివ్ పార్శ్వం.

గోండులు, సవరలు, కుయి, కువి, కొలమి గదబ ఇంకా మన కళ్ళముందు సంచరిస్తున్న ఎరుకలు, యానాదులు ... వీళ్ళంతా ఒకనాడు బలమైన సాంస్కృతిక

సంపద కలిగినవారే. వీళ్లంతా ద్రావిడ మాతృకలోంచి వివిధ భాషలు విడివడుతున్న సమయంలో తెలుగుతో సహజీవనం నెరపిన వారే. కానీ, తమ మనుగడకు పశు సంపద, వ్యవసాయం, సాంకేతిక పరిజ్ఞానం మూడింటిని సముపార్జించుకున్న జాతుల వారు స్థిరంగానూ, సంపన్నంగానూ జీవించ గలిగారు.

## ఆర్యేతరులలో ద్రావిడులెవరు ?

ఋగ్వేదంలో ఆర్యులతోపాటు సహజీవనం చేసిన జాతుల పేర్లు చక్కగా తెలుస్తున్నాయి. అసుర, దాస, దస్యు, యాతుధాన, క్రవ్యాద, మూరదేవ, రాక్షస– వీళ్ళందరూ ఆర్యేతరులైన ప్రజలు. బహుశా సింధు నాగరకతలో వీళ్ళు కూడా భాగస్వాములే కావచ్చు.

అమరకోశంలో– అసుర, దైత్య, దైతేయ, దనుజ, దానవ, దితిసుత– ఈ పదాలన్నీ సమానార్థకాలుగా ఉన్నాయి. వీళ్ళని *అర్ధదేవతలు* (డెమీగాడ్స్) అన్నారు.

కిన్నెర, గుహ్యక, సిద్ధ, భూత, పిశాచ, యక్షులతోపాటు, రాక్షసులు కూడా అర్ధదేవతలుగానే అమరకోశంలో కనిపిస్తారు. వీళ్ళందరూ ఆర్యుల ధర్మాన్ని గౌరవించి, సఖ్యతతో ఉండి ఉంటారు. కాబట్టి, వీళ్ళకి అర్ధదేవతలనే గౌరవం దక్కి ఉంటుంది. అంటే సగం, ఆర్యులన్నమాట.

ఆర్యులతో సంలీనం కానివారు ఎలా అర్ధదేవతలవుతారు ? బహుశా వీరి మధ్య సాంస్కృతిక, సామాజిక సంబంధాలతోపాటు వైవాహిక సంబంధాలు కూడా ఎక్కువ జరిగి వుండాలి.

క్షసులకు పుణ్యాజనులనే మరో పేరు ఉండేది. బెహరేన్(కథరేన్) ప్రాంతంలోని పట్టణాల మధ్య జరిగిన వర్తక వాణిజ్యాలలో పుణ్యాజన రాక్షసులదే పైచేయి. సముద్రంలో మునిగి పోయిన ద్వారక ఒకప్పుడు పెద్ద ఓడరేవు పట్టణం. ఇది పుణ్యాజన రాక్షసుల వాణిజ్య కేంద్రం అని *యస్. ఆర్. రావు* పేర్కొన్నారు.

వీళ్ళని *పంచజన రాక్షసులని* కూడా అనే వాళ్ళు. శ్రీకృష్ణుడు ఈ *పంచజన రాక్షస* నాయకుడి నుంచి అతని శంఖాన్ని పొందినట్లు, అందుకే దానికి పాంచజన్యం అనే పేరు వచ్చినట్లు భాగవతం చెప్తోంది. ఆ రోజుల్లో ద్వారక నుంచి బెహ్రైన్‌కు ఓడలు నడిచేవనీ, వర్తక వాణిజ్యాలు ముమ్మరంగా సాగేవని ఈ కథ సాక్ష్యం చెప్తోంది.

ఋగ్వేదం (8–96–13) లో "కృష్ణుడు" అనే పేరుగల అసురుడు పదివేలమంది అనుచరులతో అంశుమతీ నదీ తీరంలో నివసించేవాడు. ద్రుతగతి (వేగంగా వెళ్ళేవాడు).



**సముద్రంలో మునిగిన ద్వారకానగరంలో దొరికిన ఒక రాతిమీది అక్షరాలు**

క్రూరకర్ముడు అయిన ఈ కృష్ణుణ్ని ఇంద్రుడు బృహస్పతి సహాయంతో సంహరించాడు" అని ఉంది.

సింధునగరాలలో ప్రోటో ఆర్యన్లతో సఖ్యత నెరపిన వ్యక్తులు సింధునాగరకత అనంతరం ఆర్యులకు శత్రువులుగా మారినట్లు దీన్ని బట్టి అర్థం అవుతోంది. అయితే సంఘర్షణలతో పాటు ప్రోటో ఆర్యన్లు, ప్రోటో ద్రవిడియన్ల మధ్య భాషలు సంస్కృతులుకూడా సంలీనం జరిగాయి. ఇందుకు అనేక సాక్ష్యాలను *యస్. ఆర్. రావు* ప్రతిపాదించారు.

తలపైన కొమ్ము, చుట్టూ కొన్ని జంతువుల మధ్య యోగాసనంలో కూర్చుని ఉన్న ఒక దైవ రూపం ముద్రిక సింధునగరాలలో దొరికింది. దీన్ని ప్రోటో శివ రూపం అని కొందరు, బ్రహ్మ పూర్వరూపం అని కొందరు భావించారు.

అయితే, ఉత్తర సింధునాగరకతా కేంద్రమైన హరప్పాలో ఆర్యుల ప్రాబల్యం ఎక్కువగా ఉండేదనటానికి సాక్ష్యంగా అక్కడ దొరికిన ముద్రిక(నెంబర్ 307)మీద ఈ ప్రోటో శివుడి చుట్టూ అగ్ని జ్వాలలున్నాయి. అగ్నిని ఆరాధించిన ప్రోటో ఆర్యులు, పశుపతినాథుణ్ణి లేదా బ్రహ్మను ఆరాధించిన ఆర్యేతరులు సంలీనం చెందారనటానికి ఈ ముద్రిక సాక్ష్యమిస్తోందని *ప్రొఫెసర్ యస్. ఆర్. రావు* విశ్లేషించారు.

ద్దు, ఏనుగు, గుర్రం, దున్నపోతు, పెద్దపులి ఇలాంటి జంతువుల గుర్తులు కొన్ని ముద్రికల పైన కన్పించాయి. ఒకో జంతువు ఒకో తెగకు చెందిన ప్రజల దేవతా రూపం కావచ్చు నంటారాయన. ఆ దేవతల పేర్లు మనకు తెలియవు.

వృషభాన్ని ఆరాధించిన ఒక వ్యాపారి, వ్యాఘ్రాన్ని ఆరాధించిన మరొక వ్యాపారి మధ్య జరిగిన వ్యాపార ఒప్పందాలకు ఆ రెండు జంతువుల రూపాలతో చెక్కిన ముద్రిక సాక్ష్యం కావచ్చని అంటారు.

మౌలికంగా ఆ ప్రజలు వ్యాపారులు కాబట్టి తమ దేవతల దయతో వ్యాపారాభివృద్ధి కావాలని వారు ఆశించి ఉండవచ్చు. యస్.ఎ. డాంగే కూడా దైవకృప(డివైన్ ఫేవర్) కోసమే ముద్రికలపైన వీటి రూపాలు ఉంచారని భావించాడు.

కొమ్ములున్న ప్రతీ జంతు రూపమూ మాహిషమే కావాలని లేదు. వ్యాఘ్రానికి కూడా కొమ్ములున్న (బనావలి సీల్) ముద్రిక దొరికింది. కొమ్ములు అగ్నికీలలకు సంకేతం అనుకున్నట్లయితే వ్యాఘ్రారాధకులు అగ్ని ఆరాధనని(fire cult) స్వీకరించి ఉంటారని ఊహించవచ్చు.*ఆర్య సంస్కృతి ద్రావిడీకరణం జరిగిందనాలా. ? ద్రావిడసంస్కృతిఆర్యీకరణం చెందిందనాలా... ? రెండూకావచ్చు*



**సింధు నగరాలలో దొరికిన పశుపతినాథుడు**

# 5.ముండా ప్రజల వ్యావసాయిక జీవనం

*ఆస్ట్రిక్ లేదా ఆస్ట్రో ఆసియాటిక్* భాషా కుటుంబంలో ముఖ్యమైనది *ముండాభాష.* ఈనాటికీ, ఈశాన్య భారత రాష్ట్రాలలోనూ, బంగ్లాదేశ్‌లోనూ, *ఈ భాష* మాట్లాడుతున్న ఆదిమ తెగలవారున్నారు. కోల్, మాంఖ్మేర్ తెగల వారు వీళ్ళలో ముఖ్యులు.

క్రీ. పూ. 5000 ఏళ్ళ క్రితమే ముండా తెగల వారు పశువుల మందలను పెంచి నదీ మైదానాలను ఆక్రమించి వ్యవసాయం పారంభించారు.

*సింధూనాగరకత* ఇంకా ఒక రూపం ఏర్పరచుకోని కాలం అది.5000 ఏళ్ళ క్రితం అంటే, క్రీ.పూ.3000 కాలంలో ముండా తెగల ప్రజలు వరినీ చెరకునీ పండించారని డాక్టర్. వి.యస్. ఏకాంకర్ నిరూపించాడు.వాళ్ళు పత్తిని కూడా పండించారు. పత్తి నుంచి నూలు దారం తీశారు. నూలు దారంతో బట్టలునేశారు.

వడ్డించిన విస్తరిలా ఆ నాటి సమాజం ఉంది. కాబట్టే, వ్యాపార వర్గాలు చొరవగా ముందుకు వచ్చి ఎగుమతులు, దిగుమతులు చేపట్టటంతో సింధూ రాజ్యాలు గొప్పవిగా ఏర్పడేందుకు అనుకూల పరిస్థితులు కలిశొచ్చాయి.

సింధూ నగరాలకన్నా ముందే ఉత్పత్తి ముమ్మరంగా జరిగింది. దానిని అందుకోవటానికి ఎన్నో జాతుల వారు ఇక్కడకు చేరుకున్నారు. అలా వచ్చిన వారిలో ప్రోటో ద్రవిడియన్లు, ప్రోటో ఆర్యన్లు, ప్రోటో ముండా ప్రజలు ముఖ్యులు. పరస్పర సహకారంతో ఈ మూడు ముఖ్యమైన భాషా కుటుంబీకులు ఆరోజుల్లో సహజీవనం చేయ గలిగారు కాబట్టే, వారి భాషల మధ్య ఆదాన ప్రదానాలు సహజమైన విషయం.

పూర్వ ద్రావిడులు (ప్రోటో ద్రవిడియన్లు) నిస్సందేహంగా వ్యాపారులే. *ముండా ప్రజలు* వ్యావసాయకులు. పల్లెలు వాళ్ళకు పట్టు కొమ్మలు. తూర్పు దిశగా, సారవంతమైన భూమిని, నీటిని వెతుక్కుంటూ గంగా తీరం వెంబడే మొదట విస్తరించింది *ముండా ప్రజలే !* వారి వెనక పశుపాలకులైన ప్రోటో ఆర్యన్లు బయలుదేరారు. క్రమేణా వాళ్ళు కూడా వ్యవసాయ అవసరం గుర్తించి కొత్త జీవిత విధానానికి అలవాటు పడటం ప్రారంభించారు.ఆర్యగణాలు సప్తసింధులో పంజాబ్‌లోంచి గంగాతీరంలోకి అడుగు పెట్టిన తరువాత క్రమంగా వ్యావసాయకులుగా మారారు. యవలు, బార్లి, గోధుమలు, నువ్వులు, మినుములు, పెసలు పండించారు. ఒక్కోదశలో గోధుమలను, ఒక్కోదశలో

యవధాన్యాన్ని పండించేవారు. ధాన్యాన్ని పండించే వారిని "ధాన్యకృత్తు"లని పిలిచారు. "వపంతో బీజమివ ధాన్యకృతః పృంచంతి"( ఋ-10-94-13)

యవం వృకేణాశ్వినా వపం తేషాం దుహంతా మనుషాయ దస్రా -"(ఋ-1-117-21) "ఓ అశ్వినీ దేవతలారా ! ఆర్యుడైన మనువు నిమిత్తం రైతులు నేలను దున్ని ధాన్యబీజాలు చల్లునట్లు చేశారు గదా....."" మిత్రులారా ! నాగళ్ళు సిద్ధం చేయండి. అటికలు కట్టి పొలం దున్నండి. నాగేటి చాళ్ళలో విత్తనాలు చల్లండి. మనం ఆశించినట్లే మన పంటలు పండుతాయి. మన కొడవళ్ళు మన పైరును కోస్తాయి."

ఋగ్వేద మండలాల్లో *"దాశరాజ్ఞ యుద్ధం"* వర్ణన కన్పిస్తుంది. ఇందులో *"సుదాసు"* అనే రాజుకు ఎప్పుడో ఒకప్పుడు మిత్రులుగానో, విరోధులుగానో ఉన్నవాళ్ళు- 1.తుర్వశ 2.యదు 3.అను 4.దృహ్యు 5.పురుగణాలకు చెందిన ప్రజలు ముఖ్యులు. 6.శిమ్యుడు 7.కవషుడు 8.భేదుడు 9.ఒకటవ వైకర్ణుడు10.రెండవ వైకర్ణుడు-వీళ్ళువ్యక్తిగతంగా సుదాసుకుశత్రువులు. 11.మత్స్యులు12.ఫక్తులు(ఫక్తూన్‌లు)13.భలానసులు(బోలాన్‌పాస్ ప్రాంతానికి చెందిన ప్రజలు) 14.అవినులు 15.నిషాణులు 16.అజులు 17.శివులు 18.శిగ్రులు 19. యక్షులు- వీళ్ళంతా సుదాసుకు ఏదో ఒక సమయంలో వ్యతిరేకంగానో, అనుకూలంగానో నిలబడిన వాళ్ళే *(ఋగ్వేద ఆర్యులు- రా.సాంకృత్యాయన్.)*

సింధునగరాలను(పంజాబ్)వదలి గంగాతీరానికి ఆర్యులు వెళ్ళిపోయినా, సింధు నాగరకత అంతరించిన తర్వాత కూడా బ్రాహుయి భాష మాట్లాడిన ఫక్తూనులు, భలానులతో ఆర్యులకు సంఘర్షణలూ, సంలీనాలూ కొనసాగాయనటానికి ఋగ్వేదంలోఈ పేర్లు సాక్ష్యంగా కన్పిస్తున్నాయి.

***తమ ఆధిపత్యాన్ని పెంచుకుంటూనే ఆర్యేతరులయిన ప్రజలనుంచి వారి నాగరకతనీ, సంస్కృతినీ, భాషను స్వీకరించిన ఆర్యులు వాటిని తమకు అనుకూలంగా మలచుకుని అభివృద్ధి చెందారని దీని భావం.***

ఆర్యుల ఆయుధ బలం, ముఖ్యంగా వాళ్ళ రథాలు ఆర్యేతరులను జయించటానికి తోడ్పడ్డాయి. కానీ, ఆర్యేతరుల సంస్కృతి నాగరకతలు మౌలికంగా ఆర్యులను అంతకు ముందే జయించగలిగాయని కూడా దీని భావం.

ఈజిప్టులో క్రీ.పూ.4200 నాటికే నైలూనదీ తీరాన నాగరకత ప్రారంభం అయ్యింది. క్రీ.పూ.3400నాటికి మొదటి రాజవంశం ఏర్పడింది. క్రీ.పూ.2900-2080 నాటికి మూడవ రాజవంశం పాలించింది. ఈ కాలంలోనే రాతి పిరమిడ్ల నిర్మాణం జరిగింది

అంటే, సింధుభూముల్లో మహానగరాలు నిర్మాణం అవుతున్న కాలంలో ఈజిప్ట్‌లో మహోన్నత చారిత్రక కట్టడాలు(పిరమిడ్లు) నిర్మించబడుతున్నాయన్నమాట..

ఇంక, మెసపటోమియా విషయానికొస్తే క్రీ.పూ 4000- 2000 మధ్య టైగ్రస్-యూఫ్రటీస్ నదుల దిగువ ప్రాంతంలో సుమేరియన్ నాగరకత బాగా వృద్ధి పొందింది. అంకెలు బాగా అభివృద్ధి చెందాయి. సుమేరియన్లు సింధువులు మౌలికంగా వాణిజ్య పరమైన జీవులు. వారికి అక్షరాలతోకన్నా అంకెలతోనే ఎక్కువ పని.

ఈ రెండు మహానాగరకతల మధ్య సముద్రమార్గాన భూమార్గాన కూడా సంబంధాలు నడిచాయి. అక్కడ సింధువుల ముద్రికలు కొన్ని దొరకటం ఇందుకు సాక్ష్యం. దక్షిణ భారత దేశంలోని డెక్కన్‌కు చెందిన ఒక టేకు ముక్క కూడా అక్కడ దొరికింది. ఇవన్నీ పరిశీలనాంశాలే.

క్రీ.పూ.2000 నాటికి హిట్టయిట్లు మెసపొటేమియాని ఆక్రమించే సమయానికి సింధు నాగరకత చరమాంకానికి చేరుకుంటోంది. అయినా, హిట్టయిట్ల ప్రభావం భారతీయ సామాజిక వ్యవస్థపైన గణనీయంగానే ఉంది. క్రీ.పూ.1750 నాటికి బాబిలోనియాని కస్సైట్స్ ఆక్రమించారు. ఈ పరిణామాలన్నింటికీ సింధు నాగరకత సాక్షిగానే నిలిచింది.

వీరందరితోపాటూ, ముఖ్యంగా చెప్పుకోవలసిన నాగరకులు అక్కాడియన్లు. వీళ్ళు కూడా వాణిజ్యంపైన ఆధారపడి జీవించిన వారే ! *అక్కాడ్* లోనూ సింధూ వర్తకులకాలనీ ఒకటిఉండేది.బహ్రైన్, మెసపోటేమియా, దిల్‌మున్,  మాగన్, మెలుహ్హాలకు అనేక ఎగుమతులు జరిపి ఉంటారని సాక్ష్యాధారాలను బట్టి విశ్లేషిస్తున్నారు

# 6. సింధు నగరాలలో జీవన వ్యవస్థ

కంచు, రాగి, ఇనుము సింధువుల కాలంలోనే వాడకంలోకి వచ్చాయి. వ్యవసాయం బాగా అభివృద్ధి చెందింది. అందువలన అనేక వృత్తులు కూడా వృద్ధి చెందాయి.

*కుమ్మరి సారెనే* కాదు, నల్లపూసలకు బెజ్జం వేయగలిగే *బౌడ్రిల్* (బర్మా)ని కూడా తయారు చేయగలిగారు.

సాంకేతిక పరిజ్ఞానం కొంతలో కొంత అనుభవంలోకి రాసాగింది. *వస్త్రపరిశ్రమ* ఆనాటి చేతి పరిశ్రమలలో అన్నింటికన్నా ప్రాణప్రదమయింది. అందుకు కావలసిన యంత్రసామగ్రితోపాటు *మగ్గాలను* కూడా సమకూర్చుకోగలిగారు. నిత్యావసరాలకు కావలసిన జాడీలు, పాత్రలు, హారాలు తయారయ్యాయి.

పశుపోషణ, ఆహారోత్పత్తులకు పల్లెలు తోడ్పడితే, వస్తూత్పతికి, వ్యాపారాలకు పట్నాలు తోడ్పడ్డాయి. ఆనాటి జీవన వ్యవస్థలో ఈ రెంటికీ స్పష్టమైన తేడా కన్పిస్తుంది.

సింధు నాగరకత కాలంలో బంగారు నగలు, వెండి నగలు, రత్నాలు, ఖరీదైన పాత్రలు, శిల్పాలు, రాగి, కంచు ఆయుధాలు...వీటిని వివిధ చేతి వృత్తులవారు తయారు చేశారు. వర్తకులు వాటిని ఇతర ప్రాంతాలకు ఎగుమతి చేశారు. సంపద పెరగటానికి ఉత్పత్తి – ఎగుమతులు ముఖ్య కారణం.

"*అమ్మకం*" అనేది సింధు నగరాలలో ప్రధాన విషయం. అది ఒక పద్ధతి ప్రకారం జరిగేలా ప్రోత్సహించేందుకు *ధనిక వర్తక సంఘాలుండేవని* ప్రొఫెసర్ బిల్ట్ ప్రకటించారు. పట్టణాలలోని వీధులు, మురుగు కాల్వలు, మంచి నీటి కుళాయిలు, స్నానపు గదులు ఇవన్నీ సిద్ధాంతపరంగా ఒక ప్లాను ప్రకారమే నిర్మించగలిగారు. అందుకు *మున్సిపల్ కౌన్సిల్* లాంటిది కూడా వుండేదని తేల్చి చెప్పారు.

ఇందులో ఆశ్చర్యం ఏమీలేదు. డబ్బు అనేది వుండాలి గానీ మనిషి తెలివి ఎంతటి అద్భుతాన్నయినా సృష్టించ గలదు.

కానీ, ఈ డ్రైనేజీలను కడిగిందెవరు ? వాళ్ళ స్థానం ఏమిటి ? ఆనాటి సామాజిక వ్యవస్థలోని తారతమ్యాల గురించి ఆలోచిస్తే చాలా విశేషాలు బైటకొస్తాయి.

ఈజిప్ట్ మెసపొటేమియాలలో ధనాన్ని విచ్చలవిడిగా ఖర్చుపెట్టి, మానవ శ్రమను పణంగా వుంచి అద్భుతమైన సమాధులు, రాజభవనాలు నిర్మించినా, మనుషులు మాత్రం

మట్టికొంపల్లోనే బతికారు. కానీ, సింధు నగరాలలో మాత్రం గట్టి ఇళ్ళు కట్టుకొని మనుషులు సుఖంగా జీవించారని *సర్ జాన్ మార్షల్ పోల్చి* చెప్పారు.

కానీ, సింధునగరాలలో నివసించిన మనుషుల్లో ఏ ఏ స్థాయిల వారున్నారు.. ? అన్ని స్థాయిలవారికీ ఒకే తరహాఇళ్ళున్నాయా.. ? ఒకే తరహా జీవన వ్యవస్థ ఉందా.. ?

## *సింధు నగరాలలో అస్పృస్యులు*

*సింధు నగరాలలోని ధనిక వర్గానికి పంటలు పండించి అన్నం పెట్టిన కర్షకులు, వారి వ్యాపారాలకు వస్తువులు ఉత్పత్తి చేసిన కార్మికులు, వారికి బట్టలు నేసి ఇచ్చిన చేనేత పని వారు. వారి నగరాలను శుభ్రంచేసి, వారి డ్రైనేజీలను కడిగి, వాళ్ళు ఆరోగ్యంగా వుండేలా చేసిన పారిశుధ్య కార్మికులు.... వీళ్ళంతా సింధు నగరాల అభివృద్ధికి మూల కారకులు. కానీ, నగరసౌకర్యానికి దూరంగా సాధారణ జీవితమే గడిపిన అసలైన పౌరులు.*

సింధునగరాల్లో కోటల్లాంటి ధనికుల ఇళ్ళకీ, పరమ పేదల బీద కొంపలకీ మధ్య స్పష్టమైన తేడా కన్పిస్తుంది. గోచీ పెట్టుకొని దారి పక్కన కూర్చున్న ఒక బానిస బొమ్మ త్రవ్వకాలలోదొరకడం ఇందుకు సాక్ష్యం. .



*హిందూ వ్యవస్థలో కులతత్వం ద్రావిడీకరణం వలనే ఏర్పడిందనీ, అలనాటి భారతీయ సామాజిక వ్యవస్థ ఇప్పటి మన తెలుగు సమాజంలానే వుండేదనీ భావించడానికి ఈ నిరూపణ అవకాశం ఇస్తోంది.*

.సమరంలో ఓడినవారు గెల్చిన వారికి బానిసలవుతారన్నది నిజం. కానీ, బానిసలంతా అలా ఓడిన రాజులే కావాలని లేదు.

సింధునగర రాజ్యాలు రక్తసిక్తమైన రణభూముల్లోంచి పుట్టిన యుద్ధరాజ్యాలు కావు. కాబట్టి, అక్కడి బానిసలు ఓడిన వ్యక్తులు కాదు – జన్మతః బానిసలే అయివుంటారని ఊహించవచ్చు.

*ఈనాడు మనం దళిత శబ్దంతో పిలుస్తున్న సామాజిక వర్గం ఆనాడు కూడా జన్మతః దళితులుగానే వున్నారని అర్థం అవుతుంది.*

పూర్వ ద్రావిడ భాషలో ***మాల్*** అనే రూపం confused, perturbed, intoxicated, to die,to destroy ఇలాంటి అర్థాలలో కన్పిస్తుంది. చలింపచేయు, కదిలించు, ఆందోళన కలిగించు, వైకల్యం అనే ఈ అర్థాలనిచ్చిన ***మాల్*** శబ్దంలోంచి మాల కులవాచకం ఏర్పడి ఉంటుంది. మాల్‌నరిష్మెంట్ మాల్‌ప్రాక్టీస్, మాల్‌ఎడ్జెస్ట్‌మెంట్, లాంటి పదాలలో నెగెటివ్ అర్థాన్నిచ్చే ***మాల్*** కి ఇది మాతృక కావచ్చు.

*వర్ణ వ్యవస్థ, కుల వ్యవస్థ వేర్వేరు అంశాలు. ఋగ్వేద ఆర్యులది వర్ణ వ్యవస్థ. ఆర్యేతరులైన ద్రావిడులది కుల వ్యవస్థ. కాలగమనంలో ఈ రెండూ కలగలసి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు అదనంగా దళితులు హిందూవ్యవస్థలో భాగం అయ్యారు.*

గీతలో కృష్ణుడు "నాస్తి పంచమాః పంచములనే వారే లేరు"అని ఎంత మొత్తుకుని చెప్పినా హిందూవ్యవస్థలో పంచముల అగచాట్లు ఆగలేదు.

# 7. ఆంధ్ర విష్ణువే అసలు విష్ణువు

తెలుగు భాషా పరిశోధనలకు కరదీపిక లాంటిది శ్రీ కోరాడ మహాదేవశాస్త్రి రూపొందించిన *హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ తెలుగు* ఆంగ్ల గ్రంథం. ఇందులోఆంధ్ర శబ్దం గురించి ఆయన కొంత చర్చ చేస్తూ–"The word Andhra is no doubt known as the name of a race as old as the Vedic Age,* and the story of Sunassepa, narrated in the Aitareya Brahmana goes to show that about the 7th c BC. They were a race of Aryan out castes living southern of Vindhyas along with some aboriginal Tribes of India-" అని పేర్కొన్నారు.

ఆంధ్ర శబ్దం నిస్సందేహంగా జాతి పరమైనదే గాని, భాషాపరమైంది కాదని దీన్ని బట్టి అర్థం అవుతోంది. ఈ ఆంధ్రజాతి భారత దేశంలో వైదిక ఆర్యులతో సమకాలిన జాతి అని కూడా మహాదేవశాస్త్రి స్పష్టంగా పేర్కొన్నారు.

ఐతరేయ బ్రాహ్మణంలో హరిశ్చంద్రుడి కథలోని శునశ్శేపుడి వృత్తాంతం ఇందుకు ఆధారంగా ఆయన చూపించారు.. క్రీ. పూ 7వ శతాబ్దంనాటిది ఐతరేయ బ్రాహ్మణం అని పండితులు భావిస్తున్నారు.

ఆర్యేతరులైన ఈ ఆంధ్రులు వింధ్యకు దక్షిణంగా ఉన్న ప్రాంతంలో ఇతర జాతులతో కలిసి జీవించి వుంటారని, ఆ తర్వాతి కాలంలో దక్కన్ పీఠభూమికి చేరివుంటారనీ ఒక దశలో తమదైన రాజ్యాన్ని వ్యవస్థాపించుకున్నారనీ మహాదేవశాస్త్రిగారి వివరణ.

ఆంధ్రులు ప్రాచీనులే అనటానికి ఎవరికి ఎటువంటి సందేహం లేదు. కానీ, ఆంధ్రులు మాట్లాడిన భాష ప్రాచీనం అనాలంటే మాత్రం నిరూపణలు, ఋజువులు, సాక్ష్యాలు, శాసనాలు, పుస్తకాలు కావాల్సి వస్తోంది. మహాదేవ శాస్త్రిగారి ప్రకారం– "It is this migration from the north of the powerful tribe of the Andhras into the Telugu country and their establishment of a kingdom here which grew in to a powerful empire, that gave their name to thiscountry as well as to the people living in it.. This is how the original inhabitation of the telugu country came to be known as Andhras–"

ఉత్తరాదికి చెందిన శక్తివంతమైన జాతి ఆంధ్రులు. వాళ్ళు ఈ తెలుగునేల మీదకు చేరి ఇక్కడ రాజ్యాన్ని వ్యవస్థాపించారు. ఈ నేలకు, ఈ ప్రజలకు వారి పేరే చిరస్థాయిగా నిలిచిపోయింది. ఈవిధంగా స్థానిక తెలుగునేల ఆంధ్రభూమిగా అవతరించిందని ఆయన విశ్లేషించారు.

ఆంధ్రుల భాషలో ఎక్కువ ప్రాకృత పదాలున్నాయని, వారు వచ్చి తెలుగువారితో కలవడం వలన తెలుగు కూడా సంస్కృత పదభూయిష్ఠం అయ్యిందని మహాదేవశాస్త్రిగారి విశ్లేషణ. కానీ, ఈ ఆంధ్రులు కచ్చితంగా ఆర్యేతరులేకదా. ?. కాబట్టి ప్రాకృతం వారి మాతృభాష అనడానికి వీల్లేదు. వారి అసలు భాష ఎలా ఉంటుందో తెలియదు.

***కీ.శే. ఏటుకూరి బలరామమూర్తి గారు తన ఆంధ్రుల చరిత్ర*** అనే వ్యాసంలో ఆనాటి ఆంధ్రులు మాట్లాడిన భాష కూడా ద్రావిడ భాషలకు సంబంధించినదే అయిఉంటుందనీ, అది నేరుగా వచ్చి పాలు-తేనెలాగా తెలుగులో కలిసిపోయి ఉంటుందని అన్నారు. ఈ రెండు భాషలు ఒకే కుటుంబానికి చెందినవేనని ఆయన చేసిన సమన్వయం చాలా సమంజసంగా కన్పిస్తుంది.

ఈ విశ్లేషణ తెలుగు భాషలో ఆంధ్ర పదాలను తెలుగు పదాలలోంచి అనవసరంగా ఏరి వెదకవలసిన అవసరం లేకుండా చేస్తోంది. రెండూ ద్రావిడ భాషలే అయినప్పుడు భిన్నమైన పదజాలానికి చాలాతక్కువ అవకాశాలుంటాయి. కాబట్టి, తెలుగా ఆంధ్రమా అనే చర్చలు విలువ లేనివి అవుతాయి.

ఒకే తెలుగు పదానికి రెండు వేర్వేరు అర్థాలు వుండటానికి ఒకటి తెలుగు అర్థము, ఒకటి ఆంధ్ర అర్థము కావచ్చని కొందరు చెప్తారు. కానీ, మూల ద్రావిడ (లేదా) మూల తెలుగు రూపాలలోనే ఇలా రెండు అర్థాలు కన్పిస్తాయి. ఉదాహరణకి 'తెలుపు' అనే పదానికి ఒకటి white విశేషణ రూపంలోనూ, ఒకటి tell క్రియా రూపంలోనూ రెండు అర్థాలు మూలద్రావిడ భాషలోనే వుండటాన్ని గమనించవచ్చు.

మూల ద్రావిడ భాషలోంచి విడివడింది తెలుగా *ఆంధ్రమా* అనే ప్రశ్నకు కూడా ఇదే సమాధానం అవుతుంది. తెలుగూ ఆంధ్రమూ రెండూ మూలద్రావిడంలోంచి విడివడి తెలుగు భాషగా కలిసిపోయి ఉంటాయి. ఆంధ్రులూ, తెలుగు వారూ వేర్వేరుగా లేరు కాబట్టి వీటికి ప్రత్యేకమైన ప్రతిపత్తి ఏది కన్పించదు. మనం జాతిపరంగా ఆంధ్రులం, భాషపరంగా తెలుగువాళ్ళం ఈ రెండు పదాలనూ వేరుచేసి ఆలోచించడం అనర్థ దాయకం.

తెలింగులు, తెలంగాణా, తెలగాణ్యులు (బ్రాహ్మణులు) తెలగలు(బ్రాహ్మణేతర కులము) ఈ పదాలన్నీ తెలుగునేల అనదగిన మొత్తం ప్రాంతానికంతటికి వర్తించేవే. తెలంగాణా అంటే మొత్తం తెలుగు ప్రజలు నివసించే ప్రాంతం అని అర్థం.

***తెలుగు వారు నివసించిన భూమి అంతా తెలంగాణమే ! ఆ తెలంగాణాలో నివసించే వారంతా ఆంధ్రులే.***

కృష్ణాజిల్లా జగ్గయ్యపేట దగ్గర పరిటాల వజ్రాల గనుల వరకూ తన భూభాగంలోనే వుంచుకొని, నిజాం ప్రభువు తక్కిన కోస్తా ఆంధ్ర ప్రాంతాలన్నింటినీ బ్రిటిష్ వారికి ధారాదత్తం చేశాడు. ఒకసారి సర్కార్ జిల్లాల్నీ, ఇంకొకసారి రాయలసీమ ప్రాంతాన్నీ (దత్తమండలం) **దత్తత** ఇచ్చాడు. అంటే తెలంగాణాలో కొంత భాగాన్ని బ్రిటిష్ వారికి సమర్పించుకున్నాడన్నమాట నిజాం. అలా నిజామ్ కారణంగా సాగరాంధ్ర, సీమ ప్రజలు ఇంగ్లీష్ వారి ఆధీనంలోకి చేరిపోవాల్సి వచ్చింది.

ఇక్కడ మరో ముఖ్య విషయం తప్పకుండా ప్రస్తావించాలి. రామాయణ, భారతాల్లోనూ, పురాణాల్లోనూ, బౌద్ధ సాహిత్యంలోనూ ఆంధ్రులకు సంబంధించిన అనేక విశేషాలున్నాయి. అంధకుడి సంతతి ఆంధ్రులు అనేది జైన, బౌద్ధ గ్రంథాలతోపాటు, హిందూ పురాణాలలో కూడా రూఢిగా కనిపించే విషయం. కానీ, ఈ అంధకుడి గురించిన చారిత్రక అంశాలను వెలుగులోకి తెచ్చే ప్రయత్నాలు సరిగా జరగలేదు. బహుశా, శైవ గ్రంథాలు అతన్ని అసురుడిగా చిత్రించిన విషయాలు మన మనసుల్లో బలంగా నాటుకుపోయి ఉండటం ఇందుకు కారణంకావచ్చు. అంధకుడిని సంపూర్ణంగాఅధ్యయనం చేస్తే గానీ, ఆంధ్రుల మూలాలు అర్థం కావు.

## ఆంధ్ర మహా విష్ణువు కథ

ఆంధ్ర మహా విష్ణువు తెలుగు వారి ఆరాధ్య దైవం. కృష్ణాజిల్లా శ్రీకాకుళంలో ఆంధ్ర విష్ణు దేవాలయం ఉంది. శ్రీకృష్ణదేవరాయలు ఈ దేవుణ్ణి దర్శించుకొని స్వామి ఆదేశం మేరకు తాను ఆముక్తమాల్యద గ్రంథరచనకు ఉపక్రమిస్తున్నట్లు రాసుకొన్నాడు. ***నేను తెలుగు వల్లభుణ్ణి, నా భాష తెలుగు భాష అది అన్ని భాషలకన్నా గొప్పది*** అని స్వామి తనకు స్వయంగా చెప్పినట్లు కూడా పేర్కొన్నాడు.

ఆంధ్రులకూ విష్ణువుకూ సంబంధం ఏమిటీ.. ? కొన్ని పరిశోధనాంశాలు విష్ణువుని ఆంధ్రుల దేవుడిగా నిరూపిస్తున్నాయి. హిందూ సంస్కృతిలో విష్ణువుని ప్రవేశ పెట్టిన

వారు ఆంధ్రులేనని ఈ పరిశోధనలు చెప్తున్నాయి..ద్రావిడ భాష మాతృకలో (ప్రోటో ద్రవిడియన్) ***విష్*** అనే రూపం కనిపిస్తుంది. 1.all, 2. big, great అని దీనికి ద్రవిడియన్ ఎటిమాలజీలో అర్థాలు కనిపిస్తాయి. ద్రావిడ ***విష్*** శబ్దానికి సమస్తం, పెద్దదైన, గొప్పదైన అని అర్థాలుంటే, ఆర్యుల ***విష్*** శబ్దానికి సర్వవ్యాపకుడు అని అర్థం కనిపిస్తుంది.

"***విశతీతి విష్ణుః*** అని ***విష్ణు*** శబ్దాన్ని నిర్వచిస్తూ, "విష్ణువుకు గల ***విశ్వమ్, విష్ణుః*** అను నీ రెండు నామంబులును వ్యాప్తినే దెల్పుచునుండియు. విశ్వ శబ్దము ***పూర్తిని***, విష్ణు శబ్దము ***వ్యాప్తిని*** చెప్పుటచే పునరుక్తి దోషము లేదు-" అని విష్ణు సహస్రనామాలకు పరాశరభట్టరుల భాష్యాన్ననుసరించి చేసిన వ్యాఖ్య చెప్తోంది.

ఋగ్వేదంలో విష్ణువుకు సంబంధించిన వర్ణనలు కేవలం 5 లేక 6 సూక్తాలలో మాత్రమే కనిపిస్తాయి. దేవతలందరికంటే గొప్పవాడు, ఊరుగాయుడు, ఊరుకర్ముడు, మూడు పాదాలు కలిగినవాడుగా కనిపిస్తాడు. భూమి, అంతరిక్షం, స్వర్గాలను ఈ మూడు పాదాలతో విష్ణువు ఆక్రమించాడు. ఈ మూడో పాదం స్వర్గానికి నేత్రం కాబట్టి. స్వర్గాన్ని ***విష్ణుపదం*** అంటారు.

సూర్యుడే తన వ్యాప్తి శీలాన్ని బట్టి విష్ణువుగా స్తుతులు పొందినట్లు కనిపిస్తుంది. ఋతుచక్రాన్ని త్రిప్పేది ఈయనే. శుక్ల యజుర్వేదంలో విష్ణువు యజ్ఞానికి అధిష్ఠాతగా కనిపిస్తాడు. యజ్ఞమే విష్ణువుగా కీర్తించబడింది. అయితే, ఈ విష్ణువు గురించిన అంశాలు ఋగ్వేద అనంతరకాలంలోనే ఎక్కువ వ్యాప్తి లోకి వచ్చాయి. ఈ విష్ణువు ఆర్యుల దేవతా... ? ఆర్యేతరులైన ద్రావిడుల దేవతా.. ? చారిత్రక దృష్టితో చూస్తే కొన్ని వాస్తవాలు వెలుగులోకి వస్తాయి.

s.k.చటర్జీ "the Aryan vishnu," the spreading one" as a name for the Sun was combined with a Dravidian Sky God VIN, VINNU to give the later Hindu notions of Surya Narayana అన్నారు. ***సర్వవ్యాపకుడు అయిన ఆర్యుల విష్ణువు సూర్యుడికి ప్రతి రూపం. ఈ దేవతని ద్రవిడుల అంతరిక్ష దేవత విణ్ (లేదా) విణ్ణు రూపంతో కలుపుకోవడం వలన సూర్యనారాయణ రూపం ఏర్పడుంటుందని చటర్జీగారి భావన.*** 1912లోనే "Life in the Ancient India in the age of Mantras" అనే గ్రంథంలో పి.టి. శ్రీనివాస అయ్యంగార్ ***విష్ణు అనేది నిస్సందేహంగా ద్రావిడ పదమే***నని రాశాడు. నూరుసంవత్సరాలనాటి ప్రకటన అది. అప్పట్లో ఆయన వాదనని ఎవ్వరూ

పట్టించుకోకపోవడానికి హిందూ దేవతలంతా ఆర్యులేనన్నే ఒక అపోహ ముఖ్య కారణం కావచ్చు.

అసలు ఆర్యజాతి అనేది ప్రత్యేకంగా ఉన్నదా ? చటర్జీగారు "there are Aryan Languages, but there is no Aryan Race "అని చెప్పిన విషయం ముఖ్యమైంది. ఆర్య భాష మాట్లాడిన ఆ నాటి ప్రజలు నార్డిక్ జాతుల వారే... ! అంతేకానీ, ప్రత్యేకంగా ఆర్యజాతి ఏదీ లేదని చటర్జీ గారి అభిప్రాయం. ఋగ్వేదంలో చాలామంది "*అన్యవ్రతులు*"(ఆర్యేతరులైన ప్రజలు) గురించి అనేక ఋక్కుల్లో కనిపిస్తుంది. వీళ్ళు ఆర్యులకుమొదటగా తారస పడింది సింధూ నగరాలలోనే.

R.C. Majumdar, H.C. Roy Chowdari & Kalikinkar Datta ఈ ముగ్గురూ రూపొందించిన "An advanced History of India" గ్రంథంలో " ...the Indus Valley people were either Sumerians or Dravidians. These two races might have been identical or different. The dravidians at one time inhabited the whole of India, including the Punjab, Sindh and Baluchistan and gradually migrated to Mesopotamia. The fact that Dravidian Language is still spoken by the BRAHUI people of Baluchistan is taken to lend strength to this view." అని పేర్కొన్నారు.

సింధు నగరాలలో నివసించిన ప్రజలు సుమేరియన్లు గానీ, ద్రవిడియన్లు గానీ అయి ఉండాలి. సుమేరియన్లు ద్రవిడియన్లు ఒకరే కావచ్చు కూడా. ద్రవిడియన్లు ఒక దశలో పంజాబ్, సింధు, బెలూచిస్తాన్‌తో సహా భారత దేశం అంతా వ్యాపించి ఉండేవారు. క్రమేణా వీళ్ళే మెసపొటేమియా వరకు వెళ్ళి ఉండాలి. ద్రావిడ భాషలలో ఒకటైన "బ్రాహుయి"ని బెలూచిస్తాన్ తదితర ప్రాంతాలలో ప్రజలు మాట్లాడుతూనే ఉన్నారంటే ఈ వాదనకు మరింత బలం చేకూరుతోంది."

ఆర్య భాష మాట్లాడిన ప్రజలకు అడుగడుగునా ద్రవిడియన్లు ఎదురయ్యారు. ఆర్యులు వీళ్ళని దాస, దస్యు...ఇలా రకరకాల పేర్లతో పిలుచుకున్నారు.. తమ కన్నా అత్యున్నత నాగరకులనీ, సంపన్నులనీ, బలమైన నగరాలు కలిగినవారనీ, వారి స్త్రీలు పాలతో స్నానాలు చేస్తారని... ఇలా వర్ణించుకున్నారు.

దాస, దస్యాది ఆర్యేతర ప్రజలు సంపన్నులుగా ఉన్నంత కాలం ఈ విధమైన ప్రశంసలు బాగానే పొందారు. సింధు నగరాల పతనం తర్వాత వర్తక వాణిజ్యాలు లేక ఈ దాస దస్యులే నల్లవాళ్లుగా, అస్పృశ్యులుగా, బాహ్యులుగా, బానిసలుగా నిందించ బడ్డారు. ఆనాటి దాస, దస్యాది ఆర్యేతర వర్గాలది బతికి చెడిన వాడి పరిస్థితి. వీళ్లలో ద్రావిడులు కూడా ఉండి ఉండవచ్చు.

సింధు నగరాల పతనంతో వ్యాపారాలు పడిపోయి, ఉత్తరాదిలో ఆర్యుల ప్రాబల్యం పెరుగుతున్న కొద్దీ ద్రవిడియన్లు దక్షిణాదిలో కేంద్రీకరించ సాగారు. అనతి కాలంలోనే కోల్పోయిన ప్రాబల్యాన్ని సాధించుకో గలిగారు.

నిజానికి, మౌర్యుల పాలనవరకూ ఉత్తర భారత దేశమే సాంస్కృతికంగా, మత పరంగా, భాషా పరంగా పటిష్టంగా ఉంది. మౌర్యుల తరువాతే దానికి కష్టకాలం దాపురించింది. బాక్ట్రియన్లు, శకులు, సిథియన్లు, కుషాణులు ... ఈ బార్బేరియన్ జాతులన్నీ ఉత్తరాదిని చుట్టుముట్ట సాగాయి. వీళ్ళలో చాలామంది తర్వాతి కాలంలో బౌద్ధులుగా మారారు. వీళ్ళ బారినించి ఆర్య ధర్మాల్ని సంరక్షించు కోవడానికి సురక్షిత స్థావరాలను వెదకుతూ ఆర్యులు దక్షిణాదికి వలస కట్టవలసి వచ్చింది.

పద్మినీసేన్ గుప్తా "every day life in Ancient India" గ్రంథంలో South India became the truer representative of Hindu culture, because it was more stable and more protected" అని రాశారు.

ఉత్తరాదిన బర్బరుల దాడితో మొదలైన అల్లకల్లోలం మరో వెయ్యేళ్ళ తర్వాత మొఘల్ చక్రవర్తుల దాడులతో మరింత అస్థిరతని సృష్టించింది. ఈ పరిస్థితుల్లో ఉత్తరాదిలోని ఆర్యులకు తెలుగు నేలే దిక్కయ్యిందట "Builders, Artistes, Artisans and Craftsmen went South because of the invasions in the North, Trade flourished and Aryans found a welcome home in the Andhra Kingdom which stretched from the Bay of Bengal to the Arabian Sea and afforded a stable Civilised Empire where the immigrants could take shelter" అన్నారు పద్మినీసేన్ గుప్తా .ఆర్యులకు ఆంధ్రులు తలుపులు బార్లా తెరిచి స్వాగతం పలికారట.

***ఆర్య ధర్మాలలో ఆంధ్రుల ధర్మాలు సంలీనం అయి కొత్త హిందూ ధర్మం ఈ విధంగా అవతరించింది.అందుకు తెలుగు నేల ఒక వేదిక కావడమే విశేషం.*** హెరిటేజ్

ఆఫ్ ఇండియా సిరీస్‌లో భాగంగా పి. చెంచయ్య ఆనే పరిశోధకుడు " a History Telugu literature" అనే వ్యాసంలో " the Telugus may have been in the remote past a Dravidiyan people possessing a non Aryan Culture, but they seem to have lost their Dravidian identity very early in their History. In Historical times, they were so completely Aryanised in religion, Language and Literature, that for all practical purposes they may be treated as Aryans-although their indigenous dravidian influence continued to make it self felt."

*"తెలుగు వారు ఒకప్పుడు ద్రవిడియన్లే.. ! ఆర్యేతర సంస్కృతీ వికాసాలు కలిగినవారే. కానీ, కాల క్రమంలో వాళ్ళు తమ ఆర్యేతర ద్రావిడ సంస్కృతిని వదులుకున్నట్టు కనిపిస్తోంది. చారిత్రక యుగం మొదలయ్యే నాటికే తెలుగువారు ద్రావిడ సంస్కృతికి దూరంగా ఉన్నారు. చారిత్రక యుగాలకు వీళ్ళు పూర్తిగా ఆర్యీకరణం చెందినవారిగా కనిపిస్తారు. మత పరంగానూ, భాషా పరంగానూ, సాహిత్య పరంగా కూడా ఆర్యుల వ్యవహార విధానాలనే తెలుగు వారు అలవరచు కున్నారు. బౌద్ధ యుగంనాటికి తెలుగువారు అన్నివిధాలా ఆర్యులుగానే ఉన్నారు. ఆంధ్రుల సొంత ఆచార వ్యవహారాలు ఆర్య ధర్మాలుగా మారడంతో వాళ్ళు ఆర్యులుగా జీవించడానికి అవకాశాన్నిచ్చింది."*

ఇక్కడ విన్సెంట్ స్మిత్ చెప్పిన అంశం ముఖ్యమైంది: early Indian History as a whole cannot be viewed in the perspective, until the non Aryan institutions of the South receive adequate Treatment-" దక్షిణాదిలోని ఆర్యేతరుల చరిత్రని సమగ్రంగా విశ్లేషిస్తే గానీ, అఖండ భారత తొలి చరిత్ర నిర్మాణం సాధ్యం కాదు.

## ఆంధ్రుల విష్ణువు - ఆర్యుల విష్ణువు

prof. Jean Przyluski అనే పరిశోధకుడు ***మిథిక్ సొసైటీ క్వార్టర్లీ జర్నల్*** 1935 జనవరి సంచికలో "the name of the God Visnu and Krsna-legend" అనే వ్యాసాన్ని ప్రచురించారు. ఇది 18వ ఓరియంటలిస్ట్ కాంగ్రేస్ (Leyden)లో చేసిన ప్రసంగపాఠం. యల్.వి. రామస్వామి అయ్యర్ దీన్ని ఫ్రెంచ్ నుంచి ఇంగ్లీష్ లోకి అనువదించి ఈ సంచికలో ప్రకటించారు. ***ఆంధ్ర విష్ణువే అసలు విష్ణువు*** అని నిరూపించే ప్రయత్నం చేశాడు ఈ విదేశీ పరిశోధకుడు. డెక్కన్ భూభాగంలో ఆంధ్ర విష్ణువు మూలాలను వెదికారాయన.

మహారాష్ట్రలోని పండరీపురంలో విష్ణువుని ***విఠల*** పేరుతో కొలుస్తారు. విఠు, విఠోబా, విఠ రూపాలు కూడా కనిపిస్తాయి. కన్నడంలో ***బిఠ*** అంటే విష్ణువు. బిఠ, బిఠ్ఠి, బిఠదేవ, అనే పేర్లున్న కన్నడ రాజులు కన్పిస్తారు. తెలుగు రాజవంశీకులలో ***బేత*** అనే పేరు కనిపిస్తుంది. బేతవోలు అనే ఊరు, త్రిభువనమల్ల బేతరాజు అనే కాకతీయ రాజ వంశీకుడి పేర్లలో బేత శబ్దం ఈ విధంగా విష్ణు సంబంధమైనదే కావచ్చు కూడా.

బౌద్ధ జాతక కథలలో ఘటజాతకం (పాళీ నెం. 355, 454), సంకిచ్చ జాతకం (పాళీ నెం. 530)లలో విష్ణువు పేరు ***వెణ్హు లేదా వెన్హు*** అని కనిపిస్తుంది. విధు, వెష్ణు అనే ప్రాచీన నామాంతరాలుకూడా కనిపిస్తాయి. విధ-విష్ణు గానూ,: వెధ-వెష్ణుగానూ రూపాంతరం చెంది ఉండవచ్చు. మహా పరినిబ్బాన సుత్త (దీఘనిక-2 ) అనే బౌద్ధ గ్రంథంలో వెథదీప (విష్ణుద్వీప) ప్రస్తావన ఉంది.

ఘటజాతక కథలో అంధకవెణ్హు పేరు కనిపిస్తుంది. ఆంధ్ర విష్ణువుకు ఇది పాలీ భాషా రూపం. అంధక శబ్దం బౌద్ధ గ్రంథాలలో ఆంధ్రులకు పర్యాయంగా కనిపిస్తుంది. ఆంధ్రవిష్ణువు వాసుదేవ కృష్ణుడి పెంపుడు తండ్రి. ఈ కథ తెలుగు వారి గురించిన అనేక విశేషాలు చెప్తోంది.

## బుద్ధుడు చెప్పిన కృష్ణుడి కథ

ఘటజాతక కథలో ఘటకుమారుడనే మంత్రికి బుద్ధుడు స్వయంగా కృష్ణుడి కథని చెప్పి నిర్వేదం పోగొడతాడు. ఈ కథలో దేవగర్భ, ఉపసాగరుడు దంపతులు, నందగోప, అంధకవెణ్ణు దంపతులు ముఖ్య పాత్రలు. కంసుడి బారి నుంచి తనకు పుట్టిన మగపిల్లల్ని రక్షించుకోవడానికి, దేవగర్భ తన పిల్లల్ని అంధక వెణ్ణు దగ్గరకు చేర్చి అక్కడ పుట్టిన ఆడ పిల్లల్ని తన దగ్గరకు రప్పించు కొంటుంది. ఇది భారత, భాగవతాలలో కథే...పాత్రలు, పాత్రధారులూ కొద్దిగా మారతారు. భారతంలో కథ బౌద్ధులకు చేరిందా.. బౌద్ధుల కథ భారతం లోకి చేరిందా..అనేది ప్రశ్న.

ఆ విధంగా మొత్తం 10 మంది మగపిల్లలు వాసుదేవ, బలదేవ, చందదేవ, సూర్యదేవ, అగ్గిదేవ, వరుణదేవ, అజ్జున, పజ్జున, ఘటపండిత. అంకుర... వీళ్ళంతా అంధకవెణ్ణు పుత్రులుగా పెరుగుతారు. దుష్టశిక్షకులుగా వీళ్ళని రూపొందించి కంసుని చంపించడంలో ఈయన పాత్ర ప్రముఖమైంది. జంబూద్వీపం యావత్తూ వాసుదేవుడిచేత జయింపచేస్తాడు అంధకవెణ్ణు.

ఈ కథకు మంచి ముగింపు ఉంది. తన కొడుకు మరణించడంతో దుఃఖంలో మునిగిపోయిన వాసుదేవుడికి అతని తమ్ముడు ఘటపండితుడు మరణ రహస్యం వివరించి విషాదాన్ని పోగొడతాడు. భారత కథలో ఈ విధిని అర్జునుడి విషయంలో కృష్ణుడు చేసినట్లుంది.

"ఆంధ్రుడైన విష్ణువు (అంధక వెణ్ణు) సాధించిన విజయం ఇది" అని వ్యాఖ్యానిస్తాడు ఈ కథని ప్రస్తావించిన prof. Jean Przyluski. ఈ విష్ణువు ద్రావిడ సంబంధీకుడే అయి ఉండాలనేది ఆయన నిశ్చితాభిప్రాయం.

"A Theogony in which the ancestralGod is called VISNU, the Andhra, could only have been of Dravi[ian origin" కృష్ణుడికి సంబంధించిన ఇలాంటి కథల్ని పోల్చి, ఆ ***విష్ణువే పాలీ భాషలో చెప్పిన అంధక విష్ణువు*** అనీ, వాసుదేవుడూ, బలదేవుడూ లాంటి దేవతలకు పితృదేవత లేదా మూలదేవత అనీ అంటాడాయన.

ఈ బౌద్ధ జాతక కథలో చెప్పిన ఇంకా అనేక విషయాలు మహాభారత కథలోనూ కనిపిస్తాయి. వాసుదేవుణ్ణి ***జర*** అనే రాక్షసి (వార్ధక్యం) పీడించినట్టు

కవిత్రయ భారతంలో మౌసల పర్వంలో రాసిన విషయం ఇందుకు సాక్ష్యం.

కృష్ణుడి తమ్ములు, అతని పరివారం తాగిన మైకంలో ఒకరినొకరు నరుక్కొని చంపుకోవడం కూడా ఘటజాతకంలో చెప్పిన విషయమే. ఈ కథలు ఆంధ్రులలో బాగా వ్యాప్తిలో ఉన్నవేనని, మన నుంచే అటు ఆర్యులకీ, ఇటు బౌద్ధులకూ అంది ఉంటాయని ఊహించవచ్చు.

ద్వారకానగరాన్ని మంత్రశక్తులున్న ఒక గాడిద కావలి కాస్తుంటుంది. శత్రువు వచ్చినప్పుడు అది బిగ్గరగా అరవగానే, ద్వారకానగరం గాలిలోకి లేస్తుందట. వాసుదేవుడు వెళ్ళి ఆ గాడిద కాళ్ళు పట్టుకొని ప్రార్థించి అది అరవకూండా చేసి ద్వారకని జయిస్తాడు. *వసుదేవుడంతటివాడు . గాడిద కాళ్ళు పట్టుకున్నాడు* అనే తెలుగు సామెత జనం నోట ఈ నాటికీ నానుతోందంటే ఘటజాతకంలో కథ తెలుగునాట ఆ రోజుల్లో ఎంతో ప్రాచుర్యంలో ఉండేదని అర్థం చేసుకోవచ్చు.

నాగార్జునకొండ శిధిలాలో ఘటజాతక కథని చెక్కిన ఫలకాలు కొన్ని దొరకడం ఇందుకు ప్రబల సాక్ష్యం.

ఋగ్వేదం (8-72-8)లో "సజాత్యా" అనే పదం (Gods and men have same origin) కనిపిస్తుంది. Racial oneness -అంటే, ఏ జాతి ప్రజలకు ఆ జాతి దేవతలే ఉంటారు. రెండు వేర్వేరు జాతులు సంలీనం చెందినప్పుడు ఆ ఇద్దరి దేవతలుకూడా సహజంగానే సంలీనం చెందుతారు. విష్ణువు విషయంలోనూ ఇదే జరిగింది. *ఆర్యేతరులైన ఆంధ్రుల విష్ణువు ఆర్యుల దేవుడయ్యాడు. ఆంధ్రులు స్వయంగా తాము ఆర్యులుగా మారారు.*

ఇది ఋగ్వేదం రూపుదిద్దుకొంటున్న దశలోనో, సింధు నాగరకత చరమాంకం లోనో, డెక్కన్ భూభాగంలోనో జరిగి ఉంటుందని భావించవచ్చు. ఆర్యుల ఆభిజాత్యం (Aryan pride) ఈ కథల్ని యథాతథంగా అంగీకరించనీయక పోవడంతో తరువాతి కాలాలలో అవి బౌద్ధ గ్రంథాల ద్వారా వెలుగులోకి వచ్చి వుంటాయి.

ఘతజాతక కథ కృష్ణుడి జీవిత చరిత్రని చెప్పిన బౌద్ధ గ్రంథం. హరివంశం, భాగవత పురాణాలు ఆర్యుల వాదనననుసరించిన గ్రంథాలు.

పురాణేతిహాసాలు మన వారసత్వ సంపదగా ఎంత ముఖ్యమైనవో, పాళీ భాషలో పదిలంగా ఉన్న బౌద్ధ జాతక కథలు కూడా అంతే ముఖ్యమైనవి. వాటిని వదిలేయడంవలన ముఖ్యంగా తెలుగువారి చరిత్రని వదిలేసు కొంటున్నాం.

ఇంకా, టిబెట్, చైనా, సింహళాలలో బౌద్ధ గ్రంథాలు పరిశీలిస్తే ఎంతో విలువైన తెలుగువారి చారిత్రక సంపన్నత వెలుగులోకి వస్తుంది.

శాతవాహనులు తమని ఆంధ్ర భృత్యులుగా చెప్పుకున్నారు. ఫ్యూడల్ వ్యవస్థలో ఒక రాజవంశం తమని తమ ప్రజలకు సేవకులమని చెప్పుకున్నారంటే నమ్మలేము. ఆంధ్ర భట్ట అనే పదాన్ని ఆర్యులు ఆంధ్ర భృత్య అని వక్రీకరించి ఉంటారని కొందరు చెప్తారు. కానీ, ఆంధ్ర అంటే విష్ణువు ( Andhra, the Vishnu) కాబట్టి, ఆంధ్ర భృత్యులంటే విష్ణుసేవకులనే అర్థాన్ని prof. Jean Przyluski ప్రతిపాదించారు.

కృష్ణుడితో ఆంధ్రులకు సంబంధాలు ఉండేవనడానికి సముద్రంలో మునిగిన ద్వారకతో వాణిజ్య వ్యవహారాలలో ద్రావిడులదే పైచేయిగా ఉండేదని ప్రొఫెసర్ యస్ ఆర్ రావు పేర్కొన్న పరిశోధనాంశాలే సాక్ష్యం. బౌద్ధ జాతక కథలో కనిపించిన అంధకవెణ్ణు ప్రస్తావన ఇంకా ఇతర మత గ్రంథాలలో కూడా ఉంది.

## అంధకుడి కథలు

1. అంధకుడి సంతతే ఆంధ్రులయ్యారని జైన సాహిత్యం చెప్తోంది. బౌద్ధంలోంచి జైనంలోకి, జైనంలోంచి బౌద్ధంలోకి మతంమారి దేవతలఆగ్రహానికి గురై, అంధకుడు అంధుడై పోయాడనీ, అతని సంతానంకూడా అంధులే ఆయ్యారనీ, జైనుల కథనం.

2. శైవ సాహిత్యంలో అంధకుడు శివపార్వతుల మూడవ పుత్రుడు. పార్వతి ఒకసారి సరాగంగా శివుడి కళ్ళు మూసినప్పుడు విశ్వం అంతా చీకటి ఏర్పడిందట. ఆ సమయంలో శివుడి శరీరంలోంచి పుట్టిన వాడే ఈ అంధకుడు. పార్వతి ఆ శిశువుని పెంచవలసిందిగా హిరణ్యాక్షుడికి ఇచ్చిందట. ఒంటికాలు మీద తపస్సు చేసి వరబలగర్వితుడైన అంధకుడికి దుర్యోధనుడు, విఘాసుడు, హస్తి అనే ముఖ్య అనుచరులున్నారు. వీళ్ళు ఒకరోజు పార్వతిని చూసి ఆమె ఎవరో తెలియక అంధకుడికి చెప్పారు.

అంధకుడు ఆ అందగత్తెను చెరబట్టే ప్రయత్నం చేయిస్తాడు. శివుడితో ఘోరమైన యుద్ధం జరుగుతుంది. అంధకుడి సైన్యాన్ని తిరిగి బ్రతికిస్తున్నాడని కోపించి శివుడు శుక్రుడిని మింగేస్తాడు. శివుడి ఉదర భాండంలో మూడు లోకాలనూ దర్శించుకుని శుక్రాచార్యుడు తనను విడుదల చేయవలసిందిగా ప్రార్థిస్తాడు. శివుడు అతన్ని తన శుక్రంద్వారా బయటకు వదిలేస్తాడు. శుక్రుడికి ఆ పేరు అందుకు వచ్చింది.

3. గ్రీకు పురాణాలలో ANTAEUS తో హెర్క్యులస్ పోరాడిన కథ కూడా ఇలాంటిదే ! నేలను తాకిన ప్రతిసారీ ఆంత్యూస్ మహాకాయుడిగా ఎదుగుతాడు. శివుడు అంధకుడితో పోరినంతసేపూ నేలమీద పడిన అతని ప్రతి నెత్తురు చుక్కలోంచి అనేకమంది అంధకులు పుట్టుకొస్తారని అందుకని శివుడు అతన్ని మధ్యకు విరిచి నేలమీద అతని నెత్తురుపడకుండా ఒక పాత్రలో పట్టి, అతని శరీరాన్ని ఎత్తి సూర్యరశ్మికి మాడి మసి అయ్యేలా చేస్తాడని శైవ సాహిత్యంలో చెప్పిన కథలాంటిదే ఈ గ్రీకు కథ. హెర్క్యులస్ కూడా ఆంత్యూస్‌ని ఇలానే గాలిలోకి అమాంతం ఎత్తి చంపుతాడు.

అంధకుడి గురించిన కథలు సేకరిస్తే ఇలాంటివి చాలా దొరుకుతాయి. తెలుగు నేల ఇతని కథలకు ప్రధాన వేదిక కావడమే ఇక్కడ ముఖ్య విషయం. మరికొన్ని పరిశీలనాంశాలు కూడా ఉన్నాయి:

1. అంధక విష్ణువు లేదా ఆంధ్ర మహా విష్ణువే హిందూ సంస్కృతిలో విష్ణువుగా కనిపిస్తాడు.

2. చరిత్ర యుగంలో అంధక విష్ణువుల మీద శైవుల దాడి ముమ్మరంగా జరిగినట్లు ఈ కథలలో స్పష్టం అవుతోంది.

3. ఒకరినొకరు అన్యమతస్థుల్ని అసురులుగా చిత్రించుకున్నారని కూడా తెలుస్తోంది.

4. ఆంధ్ర అనేది జాతిపరంగానూ, తెలుగు అనేది భాషా పరగానూ, ఒకే ప్రజలకు వర్తించే పదాలు

5. ఆంధ్రులు వేరే జాతి ప్రజలనీ, వాళ్ళు ఎక్కడినుంచో వచ్చి తెలుగువారిలో కలిసిపోయారనే వాదన సరికాకపోవచ్చు.

6. అంధకులు లేదా ఆంధ్రులు తెలుగువారేనని, ఆదినించీ డెక్కన్ భూభాగంలోనే నివసించారని అర్థం అవుతోంది.

7. తెలివాహ నది ఒడ్డున అంధక రాజ్యం ఉందని సిరివణిజ జాతక కథ చెప్పిన విషయం ఇక్కడ గమనార్హం.

8. అంధకుడు నూరుశాతం తెలుగు వాడు. స్వయంగా అతనే విష్ణువు. అతని చరిత్రని వదిలి ఆంధ్రుల చరిత్రని నిర్మించడం అసమగ్రం అవుతుంది.

9. ఆంధ్రుల సొంత సంస్కృతి, ఆచార వ్యవహారాలన్నీ ఆర్య దర్మాలలో సంలీనం చెంది, ఒక క్రొత్త హిందూ సంస్కృతి రూపొందేందుకు అవకాశం ఏర్పడింది. అది డెక్కన్ భూభాగంలోనే జరిగింది.

10. ఆంధ్రులకు సంబంధించిన కథలు అటు ఆర్య గ్రంథాలలోకి, ఇటు బౌద్ధ జాతక కథల్లోకి సమనంగానే వ్యాపించాయి. ఎవరి దృష్టి కోణంలోంచి వాళ్ళు వాటిని మలుచుకొని ప్రచారం చేశారు.

11.అంధకుడు అసురుడనే భావంతో ఆంధ్రులు అతని కథల్ని తమ కథలుగా చెప్పుకోవడానికి ఇష్టపడి ఉండక పోవచ్చు.

12. *ఆంధ్ర విష్ణువని పండిత లోకం ఏ కారణం చేత విస్మరించారో తెలియదు. నేను తెలుగు వల్లభుణ్ణి అని స్వామి స్వయంగా చెప్పుకున్నతర్వాత కూడాస్పందించ లేకపోయాం మనం.*

# *8.ఎరుకలు - కుర్రు భాష*

*కొరవంజి అంటే ఎరుకలసాని.*

మధ్యయుగాలనాటి తెలుగు సాహిత్యంలో ఈ *కొరవంజి* సామాజికంగా ఎంతో పలుకుబడి కల్గిన స్త్రీగా కన్పిస్తుంది. రాజుగారి అంతఃపురంలోకి నేరుగా వెళ్ళగలిగిన చొరవ ఈమె కుండేది.

చాలా కథల్లో ఈ ఎరుకల స్త్రీ రాణిగారికి ఆంతరంగిక సలహాదారు. సాక్షాత్తూ శ్రీనివాసుడికి పెళ్ళి రాయబారం నడిపిన పాత్ర కదా... ఒక కథని అద్భుతంగా మలుపు తిప్పడానికి *ఎరుకలసాని* పాత్ర ఎంతగానో ఉపయోగపడేది కవులకి...

శ్రీనివాసుడు పద్మావతి విరహం తట్టుకోలేక ఎరుకలసాని రూపంలో రాజాంతఃపురం దగ్గర తిరుగుతుంటాడు. పరిచారికలు సోదిచెప్పడానికి లోపలికి రమ్మని పిలిస్తే రాణిగారు స్వయంగా వచ్చి పిలుస్తేనే వస్తానంటాడు. ఎరుకలవారికి ఆ రోజుల్లోగల గల సామాజిక ప్రతిష్ఠని ఈ కథ సూచిస్తోంది.

*అఖిల భూతముల*
*తెలగెల్ల భంగులు తెల్లంబుగాను*
*ఎరుకగల్గిన వారమౌటకు మమ్ము*
*యెరుకల వారని యందురే చెలియ-*

అని, ఎరుకలసాని తమ పుట్టుపూర్వోత్తరాలు ఘనంగా చెప్పుకున్నట్లు వెంకటరాయకవి లేపాక్షి జలక్రీడలు అనే కావ్యంలో వర్ణించాడు.

ఈ సృష్టిలోని అన్ని విషయాలు తమ ఎరుకలోనివేనంటుంది ఎరుకలసాని..

ఎరుకల స్త్రీకి చక్కని ఔషధ పరిజ్ఞానం కూడా వుంటుంది. అడక్కుండానే వైద్యం చెప్తుంది. మూలికల్ని గుర్తుపడ్తుంది.

చేతులు చూసి భవిష్యత్తు చెప్తుంది. ముఖం చూసి మనసులో మాట బైటకు లాగేస్తుంది. తాతముత్తాతల ఆత్మలతో మాట్లాడి, పితృలోకానికి తానో సంధానకర్తగా కన్పిస్తుంది.

తన వేషధారణతోనూ, మాటల చమత్కృతితోనూ ఎదుటివాళ్ళని ఎత్తి అమాంతం తన నడుంమీద బుట్టలో వేసెయ్యగలుగుతుంది.

## ఎరుకలు సుమేరియన్ లా... ?

ఎరుకలు తాము మాట్లాడేది కుర్రు భాష అని చెప్పుకుంటారు.

సుమేరు అస్సీరియా భాషల్లో మెరకనేలల్ని ***కుర్రు*** అనీ, పల్లపునేలల్ని ***తుర్రు*** అనీ పిలిచేవాళ్ళు. రాంభట్ల కృష్ణమూర్తిగారు సుమేరియన్ సంస్కృతి గురించి ఎన్నోవిలువైన రహస్యాలను వెలికి తెచ్చిన పరిశీలకుడు. *తెలుగు - పుట్టుపూర్వోత్తరాలు* అనే వ్యాసంలో ఆయన ఈ ***కుర్రు, తుర్రు*** పదాలను విశ్లేషించారు

1) మేరు పర్వతం నుంచి బయలుదేరిన సుమేరియన్లు నైలూనది ఎగువన కొండల మధ్య తమ రాజధానిని కట్టుకున్నారు. ఆ పట్టణానికి *కుర్రు* అని పేరు పెట్టుకున్నారు.

2) అలాగే కాస్పియన్ సముద్రం పక్కన ఉన్న పల్లపు ప్రదేశంలో మరికొందరు సుమేరియన్లు నగరాలు నిర్మించుకున్నారు. ఇవి సముద్రతీరపు పల్లపు భూములు కాబట్టి వీటిని *తుర్రు* భూములు అన్నారు.

3) సుమేరియన్ అస్సీరియన్ భాషలో *"కీ"* అంటే భూమి. ఈ పల్లపు *'తుర్రు'* భూమికి *'తుర్కీ'* అనే పేరు ఇలానే వచ్చింది. *'టర్కీ', 'తుర్క్మేనియా'* పేర్లకు ఇదే కారణం.

4) *కుర్రు, తుర్రు* పదాలు మన తెలుగునేల మీద కూడా చాలానే కన్పిస్తాయి. గోదావరి, కృష్ణాడెల్టా ప్రాంతాలలో పల్లపు గ్రామాలను తుర్రులని మెట్ట గ్రామాలను కుర్రులని పిలుస్తారు. ఆదుర్రు, యలకుర్రు, మొగల్తుర్రు, కేశనికుర్రు, బోడసకుర్రు, పేర్లు ఇలాంటివే.

5) *కుర్రులు కుర్తులుగానూ, తుర్రులు తుర్తులుగానూ* మారిన గ్రామాలూ ఉన్నాయి. కలువకుర్తి, తుంగతుర్తి, ఇందుకు ఉదాహరణలు.

అనవేమారెడ్డి దృజ్యవరం శాసనంలో కుర్తి దేశప్రస్తావన ఉంది. *ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం* గ్రంథంలో కుందూరి ఈశ్వరదత్తుగారు దీని ప్రస్తావన చేసారు.

*మలాప హారీతయ్యే కుర్తీ దేశే గ్రామోయ మేథతే*... "మలాపహారీ పాపనాశిని" కృష్ణానది ఒడ్డున కుర్తీదేశంలో *దృజ్యవరం* అనే గ్రామం ఉన్నట్టు ఆ శాసనంలో పేర్కొన్నారు

ఈ శాసనంలో ఇంకా పెరిశపల్లి, కాపవరం, దగ్గుమిల్లి అనే ఊళ్ళపేర్లు కన్పిస్తాయి. ఈ ఊళ్ళన్నీ కృష్ణాజిల్లా గుడివాడ పరిసరాల్లో ఉన్నాయి. దృజ్యవరం జుజ్జువరంగా విజయవాడ, మచిలీపట్నం బస్సు దారిలో కన్పిస్తుంది. బహుశా గుడివాడని *కుర్తి* దేశంగా వ్యవహరించి ఉంటారని *ఈశ్వరదత్తు* రాశారు. *కురిఅంటే*, మెట్టప్రాంతం.

## కురుగణాల విస్తరణ

ఈ విధంగా నైలునది దగ్గర కుర్రు నుంచి మెడిటరేనియన్లు లేదా ఫినీషియన్లు వ్యాపనం ప్రారంభించారనీ, వీళ్ళు కురు ఆర్యగణాలకు చెందినవారనీ చరిత్రకారులు చెప్తారు. మెసపొటేమియా నుంచి సిరియా వరకు ఉన్న హిట్టయిట్ భూభాగాల్నికురు శబ్దంతోనే వ్యవహరించారు.

*ఖట్టి* అంటే వీరుడు అది వాళ్ళకు బిరుదునామం బహుశా ఇదే క్షత్రియ పదంగా మారి మహాభారత కాలంలో ప్రాధాన్యతను సంతరించుకుని ఉండవచ్చు.వీళ్ళ స్థావరం భారతదేశంలో కురుపాంచాల భూములు. *సిరియో-ఫినికి* అంటే సిరియన్లు ఫినీషియన్లు కలిసిపోయి ఏర్పడినపదం. ఈ మిశ్రమ భాషలో కసి, కిషకుష్ పదాలు ఎక్కువగా కన్పిస్తాయి.

కాశ్మీర్, హిందుకుష్, కిష్కింధ ఇలాంటి పేర్లన్నీ వీళ్ళ వలన ఏర్పడ్డవేనంటారు. వీళ్ళు మధ్య ఆసియా అంతా విస్తరించారు. చైనాలో *K-San* అనే ప్రాచీన నగరం ఉంది. టిబెట్‌లో కు-షి నగరం కూడా ప్రాచీనమే.

సంస్కృతంలో శిఖ అంటే *Chief* (*తలవరి*) అని. కసి+శిఖ పదాలను కలిపితే, కష్శిఖఅవుతుంది. అంటే, కుషాణుల నాయకుడు అని అర్థం. కౌశిక అనేది విశ్వామిత్రుడికి మరో పేరు. అది ఈ కష్శిఖలోంచే వచ్చి ఉండవచ్చు. అతని సంతతిలో ఆంధ్రులున్న సంగతి అప్రస్తుతం కాదు.

షేక్ అనే పర్షియన్ పదం క్షత్రియ అనే సంస్కృత పదం ఈ కష్మిఖ లోంచి ఏర్పడిన పేర్లేనంటారు. షేక్‌లు, క్షత్రియులు తమతమ ప్రాంతాలలో పాలక వర్గమే (Ruling clan).

ఖ అంటే, భూమి. ఖట్టయిట్స్ (హిట్టయిట్స్) భూమికి యజమానులుగా ఏర్పడిన క్షత్రియులే *కిష్ అనే పదం ఇంకా ఇతర భాషల్లో అనేక చోట్ల కన్పిస్తుంది.*

***కుష్*** – ప్రాచీన ఈజిప్ట్ పాలకులు ఇథియోపియాలో రాజవంశ పాలకులు

***కైస్*** – ఆఫ్ఘనిస్తాన్ పాలకులు

***కిష్*** – పర్షియాలో అనువంశిక పాలకులు

***కస్త్ర*** – రోమన్ల అనువంశిక పాలకులు

***కిష్*** – కాశ్మీరీ పాలకులు

***కిష్కింధ***– దక్షిణ భారత దేశంలో విస్తారమైన డెక్కన్ భూభాగం

***క్షత్రియ*** – భారదేశంలో అనువంశిక పాలకులు

***కొస్సాయి*** – పర్షియా లేదా ఇరాన్‌లో పాలకవర్గం

***క్షాత్రప్*** – తొలి గ్రీకు పాలకులు***కాస్ట్రో*** – స్పెయిన్‌లో ఒకనాటి పాలకవర్గం. ఫిడెల్ కాస్ట్రో పేరులో ఈ పదం ఇంకా సజీవంగా ఉంది.

***కేజర్ లేదా కీజర్*** – దీన్ని Caesar సీజర్ అని భ్రష్టరూపంలో పలుకుతున్నారు. ఇది కూడా కిష్ పదంలోంచే పుట్టిందనీ, రోమన్ ప్రభువుల బిరుదునామం అనీ అంటారు.

***కైజర్*** జర్మన్ ప్రభువుల బిరుదునామం.

***జార్*** KZAR = రష్యాను సుదీర్ఘకాలం పాలించిన ఆఖరి రాజవంశం.

డి.మెట్లక్ అనే పరిశోధకుడు. అమెజాన్ వెబ్ సైట్‌లో ది ఆరిజన్ ఆఫ్ అమెరికన్ ఇండియన్స్ పేరుతో ఒక వ్యాసంలో ఈ వివరాలందించాడు. మహా కాశ్యపుడైన సూర్యుడి పేరున *కాషీ* అంటే భరతవంశీకులేననీ ఈ వ్యాసంలో ఆయన అభిప్రాయపడ్డారు.

అమెరికా ఖండంలో ***ఇంకా, మయా*** అనే రెండు ప్రధాన తెగల ప్రజలు కన్పిస్తారు. ఈ పేర్లలో ***ఇంకా*** అనే పదానికి ***యక్ష*** పదానికి సామీప్యత ఉందని భావిస్తున్నారు. భారతదేశంలోనూ, చైనాలోనూ మెసపొటేమియాలోనూ ఎక్కువగా వ్యాప్తిలో ఉన్న కిష్ పదం అమెరికాలో కూడా ఎంతో వినియోగంలో ఉంది. ఈ నిరూపణలుగమనించండి.

1)Keshua = *ఇంకా జాతీయులలో అగ్రవర్ణ ప్రజలు*

2) Kashitl = అమెరికన్ అజ్టెక్ జాతి ప్రజలు

3) Kashikel = మయా జాతీయులలో అగ్రవర్ణ ప్రజలు

4) Kashekwa = కారిబియన్, ఫ్లోరిడా ప్రాంతాలలో రెడ్ ఇండియన్లు.

5. Kumhuu= మెక్సికోలో పాలక వర్గం

6. Kashonsee= మెక్సికోలో తారస్కాన్ జాతి నాయకుడు.

7. Kuss= ఇది అరిజోనా పదం ధనవంతుడని దీని అర్థం

8. Kassina = రక్షించే దేవత

9. Koshikwe = జూణీ తెగకు చెందిన పాలకవర్గం

*ఉత్తర అమెరికా ఖండాన్ని Quivira అంటారు. ఇది కుబేర పదానికి చాలా దగ్గరగా ఉన్నది. ఖైబర్ కనుమలు కుబేరలోంచే ఏర్పడ్డాయి.*

*కుబేరుడు యక్షులరాజు యక్షులు కృష్ణాతీరంలో డెక్కన్ భూభాగంలో స్థిరనివాసాలు ఏర్పరుచుకున్నారు. వీరి మాతృభాష తెలుగు కావచ్చు.* మహేంద్రుడు అశోకుడి పక్షాన పల్లవబొగ్గం లేదా పల్నాడునుంచి(ఈనాటి గుంటూరు జిల్లా) సింహళానికి యక్షుల్ని నాగుల్ని వెంటపెట్టుకుని తీసుకు వెళ్ళినట్టు మహావంశ మొదలైన బౌద్ధగ్రంథాలలో ఉంది.

ఎం.డి రాఘవన్ Indians in Ceylonese History, Society and Culture అనే గ్రంథంలో ఈ నాటి శ్రీలంకలో తొలినాటి ప్రజలు యక్షులు, నాగులేననీ, యక్షులు **వెద్దా** తెగ పేరుతో ఇప్పటికీ అక్కడ జీవిస్తున్నారని పేర్కొన్నాడు.

కృష్ణాతీరం నుంచి బౌద్ధానికన్నా పూర్వమే అనేక మంది ప్రజలు శ్రీలంకకు **తరలి** వెళ్ళారని చెబుతూ, సాలి గోత్రీకులైన సాలంకాయన బ్రాహ్మణ కుటుంబాలుకొన్ని మహాసాలిపట్నం నుంచి శ్రీలంకకు చేరినట్లు ఆ గ్రంథంలో ఉటంకించారు.

క్రీ.శ. 50లో ***పెరిప్లస్ ఆఫ్ ద ఎరిత్రియాస్*** అనే గ్రీకు గ్రంథంలోకృష్ణా నదీ ముఖ ద్వార ప్రాంతాన్ని ***మసాలియా*** అని పేర్కొన్నారు. క్రీ.శ. 130లో టోలెమీ అనే గ్రీకు యాత్రీకుడు కృష్ణా ముఖద్వారం దగ్గర **మైసోలోస్** నగరం గురించి ప్రస్తావించాడు.

ఈ మైసోలోస్ నగరం ఏది అనే విషయమై ఇంతవరకూ ఎవరూ సంతృప్తికరమైన వివరణ ఇవ్వలేదు. కానీ, రాఘవన్ గారుIndians in Ceylonese History, Society and Culture గ్రంథంలో ప్రచురితం కాని ఒక ఊహాత్మక సిద్ధాంతంగా

అందించిన సమాచారంలో సాలి గోత్రీకులైన సాలంకాయనులు తమ పేరున కట్టుకున్న మహాసాలిపట్నం గురించి ప్రస్తావించారు. మైసోలోస్ నగరం మహాసాలిపట్నానికి గ్రీకు భ్రష్ట రూపం అయి ఉంటుందని మనం ఊహించవచ్చు. *మచిలీపట్నం అనే పేరుకు మహాసాలిపట్నం పూర్వరూపం కావచ్చని కూడా అర్థం అవుతోంది.*

తెలుగునాట కృష్ణా తీరంలో వస్త్ర పరిశ్రమకు వీళ్ళు ఆద్యులని, వీళ్ళే, వేంగి రాజధానిగా కొంతకాలం తెలుగు నేలను ఏలారనీ, నంది గుర్తు కలిగిన సాలిగ్రామ జెండా వీరిదేననీ, వీరే మహాసాలిపట్నం నుంచి నుంచి సింహళం వెళ్ళి, అక్కడకూడా వస్త్ర పరిశ్రమని వ్యవస్థాపించారని ఎం.డి రాఘవన్ వివరించారు.

ఇదే నిజమైతే, సింహళంలో తమిళులకన్నా తెలుగువారే తొలి ప్రజలు కావచ్చని రుజువవుతుంది. ఈ సాలంకాయనులు గుజరాత్ కు విస్తరించి సోలంకీలుగా స్థిర పడ్డారని కూడా కొందరు పరిశోధకుల భావన.

ఎన్.ఆర్.బెనర్జి అనే పరిశోధకుడు- the chronology of the Megaliths of South India అనే పరిశోధనా పత్రంలో -the cairn burrials of Baluchistan have been suggested to provide the necessary link as also the inspiration for the megalithic concept" అన్నాడు.

India in Ceylonies History, Society and Culture గ్రంథంలో *యం.డి.రాఘవన్* తెలుగు వారైన ఈ యక్షులు, నాగులు సింహళంలో బౌద్ధమత వ్యాప్తికి తోడ్పడినట్లు పేర్కొన్నాడు.

మౌర్య సామ్రాజ్య పతనం తరువాత కూడా బౌద్ధమతం ద్వారా సింహళంతో తెలుగు వారికి సంబంధాలు కొనసాగుతూనే ఉన్నట్టు అనేక ఆధారాలను ఈ గ్రంథంలో ఆయన ఉటంకించారు.

ఈ నిరూపణలన్నీ తెలుగునేలకు సంబంధించినంత వరకూ ఆర్యగణానికి చెందిన క్షత్రియులకు, ఆర్యేతరులైన పూర్వ ద్రావిడులకు మధ్య నడిచిన సంబంధాలను విశ్లేషిస్తున్నాయి. తెలుగు ప్రాచీనతకు ఇవి చక్కని సాక్ష్యాలు.

2007, డిసెంబర్ 10 ఈనాడు దినపత్రికలో వార్తా మకుటంగా ***తల్లివేరు కోసం పరితపిస్తున్న పిల్ల వేర్లు*** అనే వార్తా కథనం ఎం.డి. రాఘవన్ పరిశోధనలకు సాక్ష్యంగా ఉంది.

శ్రీలంకలో రోడ్లమీద కోతుల్ని, పాముల్ని ఆడిస్తూ జీవిస్తున్న ***అహుకుంటికలు*** గురించి చామర్తి మురళీధర్ అందించిన సమాచారం అది. శ్రీలంకలో అహుకుంటికలు గా పేర్కొనే వారిలో ముఖ్యంగా కురవ, వడ్డెర, ఎరుకల తెగలకు చెందిన వారున్నారని శ్రీలంకలోని సామాజిక శాస్త్రవేత్తలు భావిస్తున్నట్లు శ్రీ మురళీధర్ రాశారు.

శబ్దరత్నాకరంలో అహు శబ్దానికి " పాము" అనే అర్థం ఉంది. అహుకుంటిక అనేది అహుతుండిక అనే సంస్కృత శబ్దానికి భ్రష్ట రూపం కావచ్చు. అంటే, పాములు పట్టే వాడని అర్థం. కానీ, తెలుగు ప్రజలు పాములు పట్టేందుకు అక్కడికి వెళ్ళి ఉండరు కదా...! కుంట అనేది భూ పరిమాణానికి సంబంధించిన పదం. ***అహుకుంటికలు*** బహుశా తమది "నాగభూమి" అని, తాము తెలుగు వారిమని చెప్పుకున్నట్లు ఊహించవచ్చు.

శ్రీలంకకు బౌద్ధమత ప్రచారంకోసం వివధ వృత్తులవారిని తీసుకు వెళ్ళారు. వారిలో నిర్మాణ పనివారు, వస్త్ర పరిశ్రమకు సంబంధించిన వారు, వైద్యులు, విద్యావేత్తలు , ఇతర వృత్తుల వారు అనేకులు ఉండి ఉంటారు.వారిలో సమకాలీన సమజానికి దూరంగా ఆదివాసులుగా మిగిలిపోయిన వారు చాలామంది ఉన్నారు.

తమ మాతృభూమి ఏదో తెలియక, తమ సంస్కృతి తెలియక, అనాగరకులుగా మిగిలిపోయిన ఈ ***అహుకుంటికలు*** కూడా అలానే, అశోకుడి కాలంలోనో, ఇంకా ముందో సింహళానికి తరలించబడినవారయి ఉండాలి.

అయితే, జాతులిలా వలస వెళ్ళడం చరిత్రలో కొత్త విషయమేమీ కాదు. ఆఫ్రికన్ సహారా నాగరకత కాలానికే ఈ విస్తరణ ఉందని చరిత్రకారుల భావన. తెలుగు వారే ఇలా ప్రపంచ వ్యాప్తంగా విస్తరించి తమ భాషనీ, తమ సంస్కృతినీ అక్కడ వ్యాపింప చేసి ఉంటారని నమ్మవచ్చు.

*తెలుగు ప్రజలు ప్రాచీనం. తెలుగు భాష ప్రాచీనం. తెలుగు నాగరకత ప్రాచీనం.*

## *తెలుగు నేలమీద సుమేరియన్ సంస్కృతి*

*మెసపొటేమియాలో* తెలుగు సంస్కృతి, అలాగే తెలుగు నేలమీద సుమేరియన్ సంస్కృతులకు సంబంధించిన ఆనవాళ్ళు ఎన్నో కన్పించసాగాయి. తెలంగాణాలోనూ, రాయలసీమలోనూ కృష్ణాతీరప్రాంతంలోనూ ***రాక్షసగూళ్ళు*** అని ప్రజలు పిలుచుకున్న ప్రాచీన కాలం నాటి సమాధులు కొన్ని బయట పడ్డాయి.

వీటిని *కైరన్లు* అంటారు. పెద్ద గొయ్యి తవ్వి తలుపులు లేని ఒక రాతి గదిని కట్టి అందులో శవాన్ని ఉంచి ఆ వ్యక్తి పరలోక యాత్ర సుఖంగా జరగడానికి కొంత ధాన్యం, కొన్ని ముంతలు, నాణాలు, పనిముట్లు, ఆయుధాలు, నగలు ఇవన్నీ ఉంచి పైన ఒక గూడు ఆకారంలో నిర్మించిన సమాధులివి.

*పిరమిడ్ల* తరహాలో చేసిన నిర్మాణాలు అవి. వీటిలో బంగారం, విలువైన వస్తువులూ ఉంటాయని ఆశపడి తవ్వి, ప్రజలు వీటి ఆనవాళ్ళు లేకుండా చేసేశారు. దొరికినంతమేరకు, ఈవిధమైన సమాధులు ఇక్కడ తెలుగునేలమీద, అక్కడ బెలూచిస్తాన్‌లోనూ ఒకే రకంగా వున్నాయి. ఆఫ్ఘనిస్తాన్లో ఒకప్పుడు జీవించిన "బ్రాహుయీ" భాష మాట్లాడిన ప్రజలు సుమేరియా ఇరాన్‌లకూ, తెలుగునేలకూ మధ్య సంధాన కర్తలుగా వుండేవారని స్పష్టం అవుతోంది !

డోర్నకల్, బేగంపేట, మౌలాలి, మధిర, చింతకాని ప్రాంతాలలో ఇలాంటి రాక్షసగూళ్ళు (కైరన్ సమాధులు) చాలా దొరికాయి. వీటిలో దొరికిన కుండలు, ముద్రికలు సింధు నాగరకతలో దొరికినవాటిని పోలి ఉండటం చరిత్రకారులకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

## *తెలుగు నేలమీద ఈ ప్రజలు ఎవరు ?*

ఎవరు తమ భాష *కుఱ్ఱు* భాషగా చెప్పుకుంటున్నారో వారికి సుమేరియన్ తరహా సమాధులు నిర్మించుకునే ఆచారం ఉండివుండవచ్చు. ఎరుకలు తమ భాష *కుఱ్ఱు* భాష అని చెప్పుకుంటున్న విషయాన్ని, *కురు–కుఱ్ఱు* పదాల మధ్య సారూప్యతని మనం పట్టించుకోకుండా వదలివేసే విషయంకాదు.

చరిత్ర పూర్వ యుగంలో తెలుగు నేల మీద ఎరుకలు ఒకనాటి పాలకులుగా నిర్వహించిన పాత్రని విశేషించి పరిశీలించవలసి ఉంది. వాటికి సంబంధించిన లిఖితపూర్వక ఆధారాలు ఏమీ లేనప్పుడే పరిశోధకులకు నిజంగా చేతినిండా పని ఉండేది.

దొరికినంత మేర లిఖిత సాహిత్యాన్ని పరిశీలిస్తే, కొన్ని విశేషమైన అంశాలు పరిశోధకుల ఊహలకందుతున్నాయి. తెలుగు చోళరాజు ధనంజయుడు వేయించిన *కలమళ్ళ శాసనం* (A.E.XXVII 221–25)లో *ఎరికల్* అనే పదం ఒకటి కనిపిస్తుంది.

ఇదే పదం మరికొన్ని ఇతర శాసనాలలో *ఎరికల్ల, ఎరిగల్, ఎరిగల్లు* ఇలా కొద్ది మార్పులతో కన్పిస్తుంది. (తెలుగు మఱుగులు- శాసనములలోని వివరాలు-పేజి.9)

ఈ పదం గురించి తెలుగు గోష్ఠి సభ్యులు చర్చించి ఒక సమగ్రమైన అర్థాన్ని సాధించారు.

1) *ఎరికల్* అనే పదంలో చివరి *ఎల్* అనేది గౌరవవాచకం

2) ఎరిక అనేది *ఏలిక* (పాలకుడు) పదంలాంటిదే

3) ఎరియు అంటే, ప్రజ్వరిల్లు, మండు, శోభిల్లు, శోభస్కరమైన అనే అర్థాలున్నాయి.

4) ఎరుకలు అంటే గౌరవించదగినవారు. ఎరుకలసాని *కొరవంజికి* ప్రాచీన తెలుగు సాహిత్యంలో అంత గౌరవం అందుకే.

ఎరుకలు తమది కుర్రు భాష అని తాము కుర్రు జాతీయులమని చెప్పుకోవడం వెనక గల చారిత్రకాంశాలు పరిశీలనార్హం. కుర్రు భాష తెలుగు భాషకు దగ్గరగా ఎందుకున్నది అనేది ముఖ్యవిషయం. ఎరుకలు తమిళులు కారని తమిళ పండితులు స్పష్టంగా తేల్చి చెప్పారు.

జి. శ్రీనివాస వర్మ అనే అన్నామలై విశ్వవిద్యాలయ పరిశోధకుడు A comparitive study of Yerukala and Tamil అనే వ్యాసంలో Yerukala need not be treated as a dialect of Tamil అన్నాడు. ద్రవిడ భాషలన్నింటితో పోల్చి ఎరుకల భాషని పరిశీలిస్తేనే ఈ భాషమూలాలు తెలుస్తాయి.

*కుర్రు ఎరుకలు* తమ భాష ఇటు తెలుగు అటు తమిళం రెండూ కాదంటారు. బహుశా ఇది ***తొద భాష***కు దగ్గరగా ఉండివుండవచ్చు. అయితే ఎరుకల ప్రధాన జీవిత గమనం అంతా తెలుగు మీదే నడిచింది.

తెలుగు సంస్కృతి పైన వారి ప్రభావం గణనీయంగా ఉంది. ఇవన్నీ పరిశీలనాంశాలే.

## కుర్రు భాష రూపొందించిన తెలుగు పదాలు

డాక్టర్ సి. ఎ. వింటర్స్, డాక్టర్ వామోస్-టోత్-బేటర్ అనే పరిశోధకులు అత్యంత ప్రాచీన ఆఫ్రికన్ సహారా నాగరికత పైన విశేషమైన పరిశోధన చేశారు. క్రీ.పూ. 5,000 ఏళ్ళ క్రితం ఆఫ్రికాలో నడచిన నాగరకతకి సహారా నాగరకత అని పేరు పెట్టారు. దాన్ని పూర్వ దశని ప్రోటో సహారా నాగరకత అని పిలిచారు.

5,000 ఏళ్ళ క్రితం ఆఫ్రికన్లు, వారి తర్వాత సుమేరియన్లు, ద్రవిడియన్లు దేవుడు అనే అత్యున్నత శక్తిని గురించిన అవగాహనని ఎంతగా కలిగి ఉన్నారో వీరి నిరూపణలు సాక్ష్యం ఇస్తున్నాయి.

పల్లవరాజు సింహవర్మ వేయించిన శాసనంలో *కొట్టి, కొట్టియ* పేర్లు కన్పిస్తాయి. కోటయ్య, కోటీశ్వరుడు పదాలు ఈ కొట్టి దేవత పేరులోంచే ఏర్పడి వుండవచ్చు. వెదికితే, ఈ భాషకు మూలాలు ఆఫ్రికన్ భాషల్లో కనిపిస్తున్నాయి. సుమేరియన్ భాషల్లో కనిపిస్తున్నాయి.

దేవుడి అంశలేని వాడు రాజు కాలేడని, ఈ భూమ్మీద అత్యున్నత శక్తిమంతుడు రాజు అనీ, రాజునీ-దేవుడినీ "కో" అనే పదంతో వ్యవహరించుకొన్నారు.అత్యంత తొలి దశలో ప్రోటో సహారా ప్రజలు "కో "శబ్దాన్ని మొదట రాయికి వర్తింప చేసుకున్నారు. రాయి సుస్థిరతకు ప్రతీక అని. సహారా నాగరకత బాగా రూపు దిద్దుకున్న సమయంలో ఈ *"కో" పదం సుస్థిరతకూ, దేవుడికీ సంకేతంగా మారింది.*

*తర్వాతి కాలంలో కుషయిట్లు ఈ పదాన్ని రాజుకు వర్తింప చేశారని ఈ ఇద్దరు పరిశోధకులూ పేర్కొన్నారు.*

బెజవాడని రాజధానిగా చేసుకొని క్రీ.శ 849-892 మధ్యకాలంలో పాలించిన చాళుక్యరాజు గుణగ విజయాదిత్యుడు, అతని సేనాని, మంత్రి కూడా అయిన పండరంగడు ప్రకాశం నెల్లూరు జిల్లాలలో అనేక విజయాలు సాధించారు.

*పండరంగడు* అద్దంకిలో వేయించిన శాసనంలో 12 బోయకొట్టాల్ని జయించినట్టు పేర్కొన్నాడు. అట్టము లేక అట్ఠము అంటే, ఎత్తయిన మేడ. ఈ మేడ రాజుగారిదైనప్పుడు కుర్రు భాషలో అది కో + అట్టము = కోట్ఠము అవుతుంది. బహుశా, కొట్టము, కోట అనే తెలుగు పదాలకుఇది మాతృక కావచ్చు.

ఈ పదం 12వ శతాబ్ది దాకా వాడుకలో ఉండివుండాలి. అద్దంకి శాసనంలో పండరంగడు కొట్టింది పటిష్టమైన ఇలాంటి 12 బోయకొట్టాల్నేనని మనకు అర్థం అవుతుంది. అవి బోయలకు చెందిన కోటలు.ఈ బోయలెవరు ? ఏ కుర్రుభాష లోంచి కొట్టం అనే పదం వచ్చిందో ఆ భాష మాట్లాడిన ఎరుకలే కావచ్చు.

## బోయ కొట్టాలు

ప్రకాశం జిల్లా, నెల్లూరు జిల్లా, చిత్తూరు జిల్లాలలో ఈ బోయకొట్టాలున్నాయి. నెల్లూరు జిల్లాలో దొరికిన కొన్ని శాసనాల్లో ఆనాటి బోయకొట్టాల వివరాలు చాలా కన్పిస్తాయి. శ్రీ కుందూరు ఈశ్వర దత్తు ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం గ్రంథంలో కొన్నిటిని ఉదహరించారు.

1. ఉదయగిరి రాజ్యమండల బోయవిహార దేశంలోపలను పెన్నకటక తీరమందున అనంత సాగరానకు పడమటను గుడకట్టు అనెడి బహుదూరము-

2. బోతా నీళ్ళలో నిచ్చిన గుంమళ్ళ పాటీ పొలములోనూ...

3. ఉదయగిరి స్థళ బోయనీండ్లలో మణువుపాడు.

4. ఉదయగిరి రాజ్యమందు బోయవీడి లోపలను కుడిచలపాడు.

5. బోవిళలోని మహిమలూరు.

ఈ శాసనాధారాల్లో అనంతసాగరం మహిమలూరు గ్రామాలు ఆత్మకూరు(నెల్లూరుజిల్లా) దగ్గరవున్నాయి. గుమ్మళ్ళపాడు, మణువుపాడు (మనమడుగు) కుడిచలపాడు గ్రామాలు కనిగిరి, ఉదయగిరి పరిసరప్రాంతాల్లో వున్నాయి.

ఈ బోయ రాజ్యాలలోని బోయలుతిరుగుబాటు చేసినప్పుడు పండరంగడు ఆ తిరుగుబాటుని అణచివేసి ఈ రాజ్యాల్ని స్వాధీనం చేసుకున్నాడనేది చరిత్ర.

కంచిపల్లవులకీ, వేంగి తూర్పుచాళుక్యులకీ, ఈ నెల్లూరు జిల్లా బోయకొట్టాలే తరచూ యుద్ధాలకు కారణాలయ్యేంటాయి.

పండరంగడికి 150 ఏళ్ళ ముందు నందివర్మ పల్లవమల్ల అనే పల్లవరాజు ఒక శాసనం వేయించాడు. అందులో ఉదయుడనే శబర రాజునీ, పృథ్వీవ్యాఘ్ర అనే నిషాదరాజునీ ఓడించి ఈ బోయ రాజ్యాలన్నింటినీ స్వాధీనం చేసుకొన్నట్లు పేర్కొన్నాడు.

పల్లవులుగానీ, చాళుక్యులుగానీ తాము బోయకొట్టాలను జయించ గలగడం గొప్పవీరోచిత కార్యంగా చెప్పుకోవటమే ఆనాటి ఈ బోయల శౌర్యానికి తార్కాణం.

ఈ శాసనాలలో బోయవిషారాలు, బోవీండ్లు, బోయవిళ అనే పేర్లు కన్పిస్తాయి. బోవీండ్లలో వీండ్లు అనేది వీడు(ఊరు)కు బహు వచన రూపం. అలాగే బోయ విహార దేశంలోవిహారం అంటే, బౌద్ధధర్మాలు గట్టిగా వ్యాప్తిలో ఉన్న ప్రదేశం అని అర్థం.

దేశం అనే పదం క్రీ.శ17వ శతాబ్ది దాకా ఒక రాజ్యంలోని ప్రదేశం అనే అర్థంలోనే కన్పిస్తుంది. విహారదేశం, విహారవాడ, విహారనగరి,(సింహాచలం) అనే పదాలు బౌద్ధయుగంలో బాగా వ్యాప్తిలో ఉన్నాయి. ఈ నిరూపణల్ని బట్టి నెల్లూరు, ప్రకాశం, చిత్తూరు జిల్లాలలోని బోయ కొట్టాలు బౌద్ధయుగంలో బోయ విహార దేశాలుగా ప్రసిద్ధి పొందాయని, తరువాతి కాలంలో పల్లవులు, చాళుక్యులు, చాళుక్యచోళులు శైవాన్ని, ఇంకా ఇతరులు వైష్ణవాన్ని ఇక్కడ బాగా ప్రచారం చేసారని అర్థం అవుతోంది.

***ఇంతకీ బోయలంటే ఎవరు ?*** వేటగాడు యోధుడు, నమ్మకస్తుడు, ప్రతాపవంతుడు అనే అర్థాలలో ఆనాటి బోయలు పరిశీలకుల ఊహకి అందుతారు.

## ఉగ్రనరసింహుడు తెలుగు జనపదుల సృష్టి ?

భయంకరమైన క్రూరమృగాల మధ్య జీవించే ఈ ఆదివాసీ ప్రజలకు ఉగ్ర రూపులైన దేవతల్ని ఆరాధిస్తే సంరక్షణ వుంటుందనే నమ్మిక సహజం. ఉగ్రరూపులైన కార్తికేయుడు, వినాయకుడు, వీళ్ళంతా శివుడు రూపాలుగా పూజలందుకుంటే, వరాహ, నరసింహావతారాలు విష్ణువు ఉగ్రరూపాలుగా పూజింపబడ్డారు. సుందరమైన అమ్మతల్లి కారుణ్య స్వరూపాన్ని ఆరాధిస్తూనే, పరమభయంకరమైన కాళికా స్వరూపానికై కొలుపులు చేసుకున్నారు.

శివభక్తుడైన హిరణ్యకశ్యపుడు స్తంభాన్ని పగులగొట్టినపుడు, విష్ణువు ఆ స్తంభంలోంచి ఉగ్రనరసింహరూపంలో వచ్చి హిరణ్యకశ్యపుణ్ణి వధించిన కథ ఈ ఆదివాసీయులకు సంబంధించినదే !

తెలుగు నేలమీద బోయకొట్టాల ప్రాంతాన్ని 'హిరణ్యక రాష్ట్రం'అంటారు. హిరణ్యకుడనే శైవుడి పాలన కారణంగా ఈ పేరు వచ్చిందని అంటారు. అతను అసురుడు అవునోకాదో తెలియదు.

మొత్తం మీద నరసింహ అవతారం కథలో హిరణ్యకశ్యపుడనే అసురుడు పరమత ద్వేషంతో ఈ స్తంభాన్ని (స్తంభదేవతా విగ్రహాన్ని) కొట్టడం వలన అమ్మ శక్తిని పుచ్చుకుని ఆ స్తంభంలోంచి విష్ణువు వెలువడి హిరణ్యకశ్యపుణ్ణి ఓడించాడు. 'స్తంభ విధ్వంసం' అనేది స్తంభ దేవతపైన జరిగిన శైవుల దాడిగానే భావించాలి. అది తెలుగు నేలపైన జరిగి ఉండేందుకు అవకాశం ఉండటమే ఇక్కడ ముఖ్య విషయం.

శివుడు లింగాకృతిలో పూజలందుకుంటే, విష్ణువు స్తంభాకృతిలో పూజింపబడటం ఈ కథలో గమనించవలసిన ముఖ్య అంశం. స్తంభాన్ని దైవంగా ఆరాధించే ఆచారం ఆదివాసీయులలో ఈనాటికీ ఉంది. ఒరిస్సాలో 'కంబేశ్వరిని' పూజిస్తారు. సింహాచలంలో కప్పలా కరచుకుని స్తంభాన్ని ప్రార్థించి కోరికలు తీర్చుకుంటారు.

స్తంభపూజ నాగరకుల వైదిక క్రతువుల్లో కూడా కన్పిస్తుంది. కంబవల్లి పేరుతో ఉపనయనం చివరి రోజున స్థంభపూజ చేస్తారు. శాస్త్రోక్తంగా జరిగే పెళ్ళిళ్ళలో ఐదవరోజున కంబవల్లి కార్యక్రమం ఉంటుంది.

బౌద్ధ చైత్యారామాలలో కూడా స్తంభానికి ప్రాధాన్యత వుంది. అమరావతి స్తూపానికి నాలుగు వైపులా ఐదేసి స్తంభాలు నిలబడి కన్పిస్తాయి.

మొత్తంమీద శైవేతరులు స్తంభాన్ని దేవతా స్వరూపంగా ఆరాధించడం బౌద్ధానికన్నా ముందు నుంచే ఆదివాసీ ప్రజలకుందని అర్థం అవుతోంది. ఈ స్తంభం బోర్లించిన గరాటులాగా, ఒక పిరమిడ్ ఆకారంలో వుండేది కావచ్చు.

***శైవుడైన హిరణ్యకశ్యపుడు శైవేతరుల స్తంభాన్ని కొట్టడం, స్తంభంలోని అమ్మతల్లి ద్వారా శక్తి సముపార్జించుకొని ఉగ్రనరసింహుడు హిరణ్యకశ్యపుణ్ణి కొట్టడం ఇవన్నీ రెండు వేర్వేరు మతాల మధ్య ఘర్షణనే సూచిస్తున్న అంశాలు- వీటన్నింటికీ తెలుగునేల వేదిక కావడమే ఇక్కడ విశేషం.***

లింగాన్ని పూజించే చెంచుల మీద ఇతర ఆదివాసీలు చేసిన ఆధిపత్య పోరులో స్తంభదేవత సృష్టి జరిగివుండాలి. ఉగ్రనరసింహుడి కారణంగా స్తంభం విష్ణువు జన్మ స్థానం అయ్యింది.

కంబమయ్య, కంబరాయుడుగా తెలుగువారు విష్ణువును పిలుచుకున్నారు. కంభం లేదా కంబం అంటే స్తంభం. తెలుగు నేల మీద కంభం పేరుతో ఎన్నో గ్రామాలున్నాయి. జిల్లా ముఖ్య పట్టణంగా ఎదిగిన ఖమ్మం పేరు కూడా కంభం పదంలోంచే ఏర్పడింది.

స్తంభపూజ బ్రాహ్మణవాదుల సృష్టికాదు. ఆదివాసీలనుంచే బ్రాహ్మణులు స్వీకరించి ఉండాలి. నాగరక సమాజంతో ఎక్కువ సంబంధాలున్న ఎరుకలే దీన్ని వ్యాప్తి చేసి వుండాలి. ఏమైనా అది తెలుగునేల పైన జరిగిన సృష్టే. ఎరుకల ఆధిపత్యం నడిచిన కాలంలో వెలువడిన తెలుగు సాహిత్యంలో ఎరుకలకు సామాజిక హోదా అనేది స్పష్టంగా కన్పించడమే ఇందుకు సాక్ష్యం. తెలుగు నేల మీద కంభం పేరుతో అనేక గ్రామాలు, కంబరాయుడైన ఉగ్రనరసింహుడి దేవాలయాలు అనేకం వెలిసేందుకు బహుశా వీరే కారకులు.

తాంత్రిక పూజా విధానాలలో వారాహి, నారసింహి అని వేర్వేరు దేవతా రూపాలు కన్పిస్తాయి. ఈ వరాహ నరసింహ అవతారాలు రెండింటినీ కలిపి, వరాహనరసింహ స్వామిగా ఏకరూపంలో పూజించే పద్ధతి కూడా బహుశా వీరి కారణంగానే రూపొంది వుండాలి.

ప్రసన్న నరసింహుడి కథని సృష్టించి, అతనికో చెంచులక్ష్మిని ఏర్పరచడం, చెంచుల్ని కూడా తమతో కలుపుకుపోయే ప్రయత్నాలు తెలుగు నేల మీద బాగా జరిగి వుంటాయనడానికి చక్కని సాక్ష్యం. ఇందుకు ప్రతిగా శివుడు భైరవుడుగా ఉగ్ర రూపంతో ఇలా స్తంభంలోంచే జన్మించాడనే కథ ప్రచారంలోకి వచ్చి వుంటుంది.

ద్రాక్షారామం, అమరావతి తదితర శైవ క్షేత్రాలలో పెద్ద స్తంభం లాంటి శివలింగాకృతులు- స్తంభపూజకు పోటీగా ఏర్పడినవేనని కూడా భావించవచ్చు. ఇవన్నీ ఊహాత్మకమైన ఆలోచనలు. వీటికి శాస్త్రీయమైన నిరూపణలు దొరికేవరకూ ఇవన్నీ ఊహలే !

## *నాగులు, యక్షులు, అసురులు తెలుగే మాట్లాడారా ?*

అమరావతి పాలకుడు వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుకి ఫెర్గుసన్ సమకాలీకుడు. నాయుడుగారి కారణంగా బైటపడిన అమరావతి స్తూపంలోని ఫలకాలు దుర్వినియోగం అవుతున్నప్పుడు-బ్రిటిష్ అధికారులు వాటిలో కొన్నింటిని లండన్ మ్యూజియంకు తరలించారు. ***ఈ ఫలకాలమీద చెక్కిన శిల్పాలలో కన్పించే నాగజాతి ప్రజలు- వాళ్ళ రూపరేఖలు, వేషభూషణాలను బాగా అధ్యయనం చేసిన ఫెర్గుసన్ వీళ్ళని తురేనియన్లు అన్నాడు. ఈ తురేనియన్లు ఎవరు... ? పల్లవ భూమ్ములైన తుర్రు నుంచి వచ్చిన సుమేరియన్లే! సుమేరియన్లవు తెలుగువారిలో కలిసిపోయి తెలుగువారిలాగా మారిపోయి***

*ఉండాలి. సుమేరియన్ భాషా రూపాలు అనేకం ఈ నాటికీ తెలుగులో సజీవంగా ఉన్న వైనాన్ని ఈ గ్రంథంలో చివరి అధ్యాయంలో గమనించ వచ్చు.*

ఫెర్గుసన్ చెప్పిన దాన్ని బట్టి కృష్ణా తీరంలో సముద్ర జీవులుగా ఓడలమీద ఆ రోజుల్లో విస్తృతంగా వర్తక వాణిజ్యాలు నిర్వహించింది ఈ తురేనియన్లయిన నాగులే కావచ్చుననిపిస్తుంది. తెలుగింట నాగేశ్వరరావులో, నాగయ్యలో, నాగమ్మలో లేని ఇల్లు లేదంటే అందుకు కారణం నాగులు తెలుగు సమాజంలో అంతగా కలగలసిపోవడమే !

కృష్ణాతీరంలో నివసించిన తొలి ప్రజలలో నాగులు, యక్షులు, అసురులు ప్రధాన జాతులు. శాతవాహనుల కన్నా పూర్వకాలంనాటి మెగస్తనీసు పేర్కొన్న ఆంధ్రనగరాలు ఈ ప్రాచీన జాతులు నిర్మించినవే అయి ఉంటాయి. కాలక్రమంలో వీళ్ళంతా వివిధ స్థానిక జాతులతో కలిసిపోయారు. బైటనుంచి వచ్చిన ఈ ఇతర జాతీయులతో సంబంధాలవలన తెలుగు వారి ఆచారవ్యవహారాలలో కూడా అనేక మార్పులు చోటు చేసుకున్నాయి.

*నాగులు సర్పపూజని కొనసాగించారు. యక్షులు సింహపూజ చేశారు. ముచివింద నాగుడనే నాగరాజు, కుబ్బీరకుడనే యక్షరాజు తెలుగునాట ప్రసిద్ధులు. సమకాలికులు కావచ్చుకూడా ! అసురులు శివలింగారాధన చేశారు.*

*సుమేరియన్లు స్తంభపూజ (Pillar worship) చేసేవారు. కుద్రు సంస్కృతి ప్రకారమే తెలుగు నేలమీద కూడా స్తంభాకృతిలో అమ్మతల్లిని పూజించినట్లు మనం ఊహించవచ్చు. బహుశా ఆ ప్రాచీన సుమేరియన్లు కూడా ఇక్కడ అందరితోబాటు తెలుగే మాట్లాడి ఉండవచ్చు.*

# 9.ప్రాచీన జాతులెన్నో కలగలసిన తెలుగు జాతి

సుమేరియన్ శిథిలాలలో ఆరాధన పొందిన స్తంభాకృతులు కొన్ని కన్పించాయి. ఫినీషియన్లు సూర్యుడు బొమ్మ చెక్కిన స్తంభాన్ని ఆరాధించారు. భగవంతుడు రాతి స్తంభంలో వుంటాడని ప్రాచీన రోమన్లు కూడా నమ్మేవారు. రెండు స్థలాల మధ్య భగవంతుడి బొమ్మ చెక్కిన స్తంభాన్ని పాతి సరిహద్దుల్ని నిర్ణయించేవారు. ఐర్లాండ్‌లో నేటికీ స్తంభారాధన వుంది. ఇజ్రాయెల్, గ్రీక్, తదితర ప్రాచీన జాతులన్నింటిలోనూ స్తంభపూజ ఆచారం వుండేది.

జాతులు అనేకం కన్పిస్తున్నా వారి మూలాలు మేరు పర్వతంనుంచే మొదలయ్యాయి "మేరోః దక్షిణ దిగ్భాగే " అంటూ మన ఉనికిని అక్కడ నుంచి మొదలుపెట్టి చెప్పుకొంటాం మనం.

సుమేరు ప్రజలు నాగరకత సముపార్జించుకొనే కాలానికి సమకాలీనంగా భారతదేశంలో ఉత్తరాన సింధు నగరాలు దక్షిణాన ద్రవిడ నాగరకతలు వర్ధిల్లాయి. ఈ మూడు నాగరకతల మధ్య సంబంధ బాంధవ్యాలు కూడా నడిచాయి.

స్తంభారాధకులు ఆరాధించే స్తంభం సాధారణంగా పిరమిడ్ ఆకారంలో వుంటుంది. క్రింద అర్థచంద్రాకారంలో పెద్ద మట్టు ఉండి, పైకి పోయే కొద్దీ సన్నగా కొనదేలి వుంటుంది. వెనకవైపున వెన్ను కోలగావుండే స్తంభం కాబట్టి "కోలవెన్ను" అనే కృష్ణాజిల్లా గ్రామం పేరు ఒకనాటి ఈ పూజనీయ స్తంభారాధనకు ప్రతీక కావచ్చు. తిరుమల మెట్లదారిలో వరాహస్వామి గుడి ఒకటి కన్పిస్తుంది. ఈ గుడిలో మూడు అడుగుల ఎత్తున ఇలాంటి వెన్ను కోలగా ఉండే స్తంభమే కన్పిస్తుంది. నేల మీద ఒక అడుగు ఎత్తున స్తంభం మీద వరాహస్వామి రూపం చెక్కి వుంటుంది. తిరుమల ఎరుకల సామ్రాజ్యంలో అక్కడ సాగిన స్తంభ పూజకు సాక్షిగా ఈ గుడి ఇంకా మిగిలి వుంది. పరిశీలకులు వెళ్ళి చూడవచ్చు.

తెలుగునాట ప్రతి ఇంటా కన్పించే తులసికోట స్తంభపూజకు సంబంధించిన ఆరాధనా విశేషమే ! ప్రతీ దేవాలయం ఎదుటా కన్పించే ధ్వజస్తంభం స్తంభపూజని పొందుతూనే వుంది.ఆత్మబలిదానానికి గుర్తుగా వేదయుగంలో కూడా యూపస్తంభాన్ని పూజించారు.

ఆనాటి ప్రాచీన జాతులలో తెలుగునేల మీద వికసించిన "ఎరుకలు" నిర్మించిన సంస్కృతి, ఆచార వ్యవహారాల ప్రభావం ఈనాటికీ తెలుగు ప్రజలలో కొనసాగుతోందనేది ఇక్కడి ముఖ్య విషయం.

*తెలుగు నేలమీద ఇన్ని ప్రాచీన జాతులు కలగలసి తెలుగు భాష, తెలుగు సంస్కృతి, తెలుగు జనజీవన వ్యవస్థలు ఏర్పడినట్లు మనకు చక్కగా అర్థం అవుతోంది.ఇవి తెలుగు ప్రజల ప్రాచీనతకు నిలువుటద్దం అనదగిన సాక్ష్యాలు.*

# 1. తెలుగు అనే పేరు తెలుగు లోనే ఉంది !

*తెలుగు*' అనే పదం సంస్కృత ' *త్రిలింగ* లోంచి వచ్చిందని కొందరు..., *త్రికళింగ(త్రినాగ)* లోంచి వచ్చిందని ఇంకొందరు.... ఇలా తెలుగు భాషకి పేరుని కూడా సంస్కృతంలోనే వెదకి, అందులోంచే వ్యుత్పత్తిని తీసి చెప్పుకోవడం తెలుగు ప్రజల దురదృష్టం.

***ఆ రోజుల్లో పండితులు సంస్కృతంతో తాదాత్మ్యం చెందటాన్ని ఒక ఘనతగా భావించి ఉండవచ్చు.అది మాతృ భాషని హీనపరిచేదిగా అవుతుందని అప్పట్లో వారు ఊహించి ఉండక పోవచ్చుకూడా.***

సంస్కృత భాష ఇండో యూరోపియన్ (లేదా) ఇండోఆర్యన్ భాషాకుటుంబానికి చెందినది. కానీ, తెలుగు ద్రావిడ భాషా కుటుంబానికి చెందినది కదా... ? దీనిపేరుని ద్రావిడ భాష మూలాల్లో వెదికితే దొరుకుతుందిగానీ, సంస్కృత భాషలో వెదకటం దేనికి ?

జి. బ్రోనికోవ్ రూపొందించిన – *ద్రవిడియన్ ఎటిమాలజీ గ్రంథంలో* ***తెల్*** అనే రూపానికి స్వచ్ఛమైన, నిర్మలమైన, శుభ్రమైన అని అర్థాలు కనిపిస్తాయి. ఇంకా అనేక రూపాలున్నాయి.

## *1) ప్రోటో ద్రవిడియన్ తెల్*

| | | |
|---|---|---|
| యూరేసియాటిక్ | : | tVIV (to say, tell) |
| ఇండోయూరోపియన్ | : | Tell, talk, tale, |
| అల్టాయిక్ | : | (telunu) narrating, tale |
| కర్తివేలియన్ | : | tul-call, say, shout, |
| నాస్ట్రేటిక్ డిక్షనరీ (2353) | | TelV= shout, call |

## *2) ప్రోటో తెలుగు తెల్*

తెలుగు రూపం: తెలుచు (మొక్కు, తీర్చు, ప్రార్థించు) ఈ తెలుచు రూపానికి సంబంధించి ద్రవిడియన్ ఎటిమాలాజికల్ డిక్షనరీ(3427) లో ఇచ్చిన వివరాలు:

3427:-Te(k): telucu (page 300) - telugu;telunge;telugu man;te. telungu; tenungu,telugu language -

kol.telgi Telugu man(CF Mara Telaga) -Telugu man.adj.talagi (DED2820-(k)-telugu.
3427Te.(k)telucu: topraise, worship, request, pray. Go (Tr.) talehkana (w) talahkana: to beg, ask for anything esp. abide.

తెలుచు(ల్చు) పదానికి సూర్యరాయాంధ్ర నిఘంటువు అందించిన వివరాలు పరిశీలించండి. 1) తేర్చు - తేర్చు, తేటగా, జేయు, ప్రసన్నత నొందించు, శాంతి పరచు, సంతుష్టి పరచు 2)స్తుతించు, పొగడు 3) ప్రార్థించు, వేడు 4) భజించు, సేవించు 5) ఎఱుగు, తెలిసికొను 6) తేలుచు, వోలలాడుచు 7) మ్రొక్కు, నమస్కరించు 8) బయలుపడు, కనబడు

## 3. ప్రోటో తెలుగు: తెల్

తెలుగు: తెలుపు, స్వచ్ఛము, తెలియు To be known, understood, perceived, intelligible, clear, plain, be seen, discovered, regain consciousness, wakeup from sleep,

తెలివి: understanding, intelligence, wisdom, consciousness, liveliness, cheerfulness,

తెలివిడి understanding , information

తెలిసికొను to understand, know, learn,

తెలుపు to communicate, make known, inform,

తెలుపు white, whiteness

తెలుపుడు knowledge, information,

తెల్ల white, plain, pale, clear

## *4) ప్రోటో తెలుగు :-*

తెలుణ్ అనే రూపానికి telugu language తెలుగు- తెలుంగు అర్థాలున్నాయి. తెలుణ్ ప్రోటో తెలుగు రూపానికి సంబంధించి DEDR 3426 లో ఇచ్చిన వివరాలు:

1.3426 Ta (తమిళం) Telugu, telunku, telunkam, telinkam (page 300) treppa (trept) to cause to lie down, lay out, stretch out full length.

kUWI (Isr) trip(-h-) to lay down make one sleep

3426 Ta(తమిళం) telugu, talunku, telunkan , telinkam, telugu country, telugu language, telunkan, teluguman

Ma (మలయాళం) telunku telugu country, language and people. Ka(కన్నడ) telugu, telagu, telungu, telugu language; teluga, telaga, telunga.

ఈ నిరూపణలు ***తెలుగు*** అనే పేరు తెలుగులోంచే పుట్టింది కానీ, సంస్కృతంలోంచో, మరో భాషలోంచో పుట్టలేదని గట్టిగా నొక్కి చెప్తున్నాయి. స్వచ్ఛంగా, తేటతెల్లంగా, సుమధురంగా, నిర్మలంగా ఈ భాష ఉంటుందనీ, దీనికి వివిధ భాషలలో ఉన్న అర్థాలను బట్టి గ్రహించవచ్చు.

ఈ పదాలకు సమానమైన భావం, సమానమైన రూపం అనేక ఇతర భాషల్లో కన్పిస్తుంటే త్రిలింగం, త్రికళింగం లోంచి తెలుగు ఏర్పడిందనడం అన్యాయం.

తెలుగు అంటే చక్కగా వివరించి చెప్పడమే... బ్రాహుయి లేదా బ్రూహుయి పదానికి కూడా చెప్పడం అనే అర్థం. ఈ సామ్యాన్ని గమనించాలి. ఈ బ్రూహుయిాలు, తెలుగు వారూ ఆ రోజుల్లో చెప్పేవారి పాత్ర నిర్వహించి వుండాలి. ఇది సింధు నాగరికత కాలంలోనే జరిగి ఉండాలి. మరిన్ని వివరాల్లోకి వెడదాం !

## బ్రాహుయిాలెవరు ?

క్రీ.పూ.4,000 నాటికే బ్రాహుయిా భాష ద్రావిడభాషా మాతృక లోంచి మొదటుగా విడివడి వుండవచ్చని ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి ప్రభృతులు చెప్తున్నారు.

ఆఫ్ఘనిస్తాన్‌వైపు సింధునాగరకత రూపుదిద్దుకోడం క్రీ.పూ. 8,000 ఏళ్ళకే మొదలయ్యిందని బి.డి.కార్టి, జె.యమ్. కజాల్ పేర్కొన్నారు. క్రీ.పూ. నాలుగు వేల ఏళ్ళ నాటికి దక్షిణ భారతదేశంనుంచి సింధు నగరాల వైపు జాతులు విస్తరించి, ఆ నాగరకత రూపుదిద్దుకోవడంలో తమ వంతు పాత్ర పోషించారు. క్రీ.పూ.4,000 నాటికి బ్రాహుయిా భాషతో పాటు సమకాలీనంగా సింధు నగరాలు కూడా రూపు దిద్దుకొంటున్న సమయం అది.

సుమేరియా, ప్రాచీన ఇరాన్‌లలోని ప్రజలు ఆఫ్ఘనిస్తాన్ మీదుగా సింధునగరాలను చేరితే, దక్షిణాది నుంచి ప్రోటో ద్రావిడ ప్రజలుకూడా అక్కడకు చేరుకున్నారు. తూర్పు నుంచి ప్రోటో ముండాజాతి ప్రజలు కూడా చేరి వుండవచ్చు.

సింధునగరాలలో బయటనుంచి వచ్చినవారిని అలా ఉంచితే, స్థానికులనదగిన వారు బ్రాహుయిా భాష మాట్లాడిన ప్రజలు. కాబాట్టి బ్రాహుయిాలు ఆ రోజుల్లో

వలస వస్తున్న ప్రజలకు సంధానకర్తలుగా వ్యవహరించి వుంటారు. తమదైన స్వంత భాషతో పాటు ప్రోటోద్రవిడియన్ దేవతలైన బ్రహ్మ, మహేశ్వరుడు, కాళి (అమ్మతల్లి) వీళ్ళని ఆరాధించిన వారై వుండవచ్చు.

బ్రాహుయిాలు ఈ నాటికీ ఆఫ్ఘనిస్తాన్, బెలూచిస్తాన్, ఇరాన్, పాకిస్తాన్‌లలోనూ ఉన్నారుగానీ, ఇస్లామీకరణం చెందడం వలన అలనాటి భాషా సంస్కృతుల్ని ఎంతమేర వాళ్ళు నిలబెట్టుకో గలుగుతున్నారనేది సందేహమే. అయితే తమ మాతృభాష బ్రాహుయిా అనే చెప్పుకోవడం విశేషం.

బ్రాహుయిా భాషని *బ్రూహుయిా* అని కూడా వ్యవహరిస్తారు. ఋగ్వేదంలో బ్రూ శబ్దానికి మాట్లాడటం(to speak, say,tell) అని అర్థం. బ్రూమి, బ్రవీమి, బ్రూహి, బ్రువధ్వం, బ్రూతత్, అబ్రువం, బ్రువమాణ, బ్రువాణ, ఇలా మాటలాడటం లేదా చెప్పడం గురించి వైదికచ్ఛందంలోనే అనేక ప్రయోగాలు కన్పిస్తాయి. మొత్తం మీద బ్రాహుయిా లేదా బ్రూహియిా భాషకు *చెప్పడం* అనే అర్థం స్థిరపడినట్లు కన్పిస్తోంది.

ఈ చెప్పేవారు భౌగొళిక విషయాలు చెప్పి ఉండవచ్చు. భాషాపరమైన లేదా దేవుడికి సంబంధించిన విషయాలు కూడా చెప్పి ఉండవచ్చు. మొత్తంమీద అలా చెప్పగలిగిన వారిని బ్రామ్మణులుగా వ్యవహరించి ఉండవచ్చు. బ్రమ్మ, బ్రామ్మణ శబ్దాలకూ, బ్రాహుయిా అనే పేరుకి ఏమైనా సంబంధం ఉందేమో పరిశోధన కొనసాగవలసి ఉంది.

చెప్పేవారి పాత్ర పోషించారు కాబట్టి, ఆ మూలపురుషుడి ముఖం(నోరు)లోంచి వచ్చారని బ్రామ్మణుల గురించి చెప్పడానికి ఇక్కడ అన్వయం కుదురుతోంది. సింధునగరాలలోకి తొలిగా ప్రవేశించిన ప్రోటోఆర్యన్‌లకు అక్కడి విషయాలన్నీ చెప్పి, మార్గదర్శకులుగా వ్యవహరించి ఉంటారు కాబట్టి వీళ్ళకి చెప్పేవారు బ్రూహియిాలనే పేరు సార్థకం అయ్యింది.

తెలుగు అనే పేరు కూడా తెలుపు (to speak, say, tell) తెలియు (understanding) అనే అర్థంలోనే పూర్వద్రావిడ *తెల్* రూపంలోంచి ఏర్పడిన సంగతి గమనార్హం. సింధునగరాల కాలంలోనే ప్రోటోతెలుగు ప్రజలు కూడా ఉన్నారనడానికి ఇది ఆశావహమైన అవకాశం కల్పిస్తోంది.

# 2. తెలుగు సంస్కృత భాషల పరస్పర వినిమయం

ఆర్య ద్రావిడ సంస్కృతులు" అనేకత్వమందేకత్వమును దర్శించు మహోదాత్త గుణ భూతములు" అని తూమాటి దొణప్పగారు "వైకృత పద స్వరూప నిరూపణము" గ్రంథంలో చెప్తూ- "ఈ రెండు జాతుల వాగ్వ్యవహారములలో పరస్పర వినిమయము ప్రవర్తితమయ్యెం" దన్నారు.

ఇక్కడ *పరస్పర వినిమయం* అనేదే ముఖ్య విషయం. ఇది మూడు రకాలుగా జరిగే అవకాశం ఉంది.

1) పాలక - పాలిత సంబంధాలు
2) మత వాణిజ్యాది సాహచర్యం
3) సమీపవర్తిత్వం

సాధారణంగా ఈ మూడు కారణాలలో ఏదో ఒకటి సంసర్గాన్ని తెచ్చినప్పుడు భాషలో ఆదాన ప్రదానాలు ఆ సంసర్గ స్వభావాలకు అనుగుణమైన భావాలను బోధించే పదాలలోనే జరుగుతాయని దొణప్పగారు సూత్రీకరించారు.

పాలక పాలిత సంబంధాలవలన పాలనా వ్యవహారాల శబ్దజాలంలో పాలకుల భాష పాలితుల భాషలో ప్రవేశించే అవకాశం ఉంది. మొఘల్ చక్రవర్తులు ప్రవేశ పెట్టిన రెవిన్యూ పదాలే తెలుగునాట వాడకంలో ఉన్నాయి. బ్రిటిష్ వాళ్ళు వాటి స్థానంలో ఇంగ్లీషు పదాలను చేర్చ లేకపోయారు. ఇంగ్లీషువారికి పాలనా పదాలు అధికంగా ఫైంచి వారినించి వచ్చినవేకదా...

*మతపరమైన సంబంధాలు ఆధ్యాత్మిక పరమైన శబ్దాలలో ఆదాన ప్రదానాలకు కారణం అవుతాయి. వాణిజ్యపరమైన సంబంధాలలో కొత్త వస్తువులను, కొత్త విశేషాలను తెచ్చినవారి పదాలు వ్యాప్తిచెందుతుంటాయి. సమీప వర్తిత్వం అంటే- ఒక ప్రాంతంలో వేరు వేరు జాతులు కలిసిజీవిస్తున్నప్పుడు నిత్యవ్యవహారాలకు సంబంధించిన పదాలలోనూ, ఆచార వ్యవహారాలకు సంబంధించిన పదాలలోనూ సంస్కృతికి సంబంధించిన పదాలలోనూ ఆదాన ప్రదానాలు జరిగేందుకు ఎక్కువ అవకాశం ఉంది.*

ఆయా వస్తువిశేషాల అవసరాన్ని బట్టి, ఆయా భావాల ప్రాబల్యాన్ని బట్టి వాటికి సంబంధించిన పదాలు ఇటూ అటూ మార్పిడి చెందుతుంటాయి. అంత మాత్రాన ఈ భాషకు ఆ భాష తల్లి అని అనడానికి వీల్లేదు.

*ఆర్య ద్రావిడ భాషా వ్యవహర్తల ప్రత్యక్ష పరోక్ష సంసర్గాల కారణంగా ఆయా జాతుల వాగ్వ్యవహారాలలో పరస్పర వినిమయం జరిగిందని శాస్త్రవేత్తలు చెప్తున్నారు. ఈ సంఘర్షణలకు అత్యధికంగా లోనైన భాష తెలుగు. తెలుగూ సంస్కృత భాషల మధ్య ఆదాన ప్రదానాలు ఎక్కువగా కన్పించటమే ఇందుకు సాక్ష్యం.*

ద్రావిడభాషా స్వరూపాన్ని అధ్యయనం చేసినప్పుడు తెలుగులో సంస్కృత పదాలు ఎక్కువగా ఉన్నాయనే పేరుతో తెలుగు భాషని పరిగణనలోకి తీసుకోకుండా పరిశోధకులు పక్కన పెడుతూ వచ్చారు. కానీ, పాణినీయ సంస్కృత భాషకు సమాన కాలంలో రూపొందిన ప్రోటో తెలుగు భాష మాట్లాడిన ప్రజలు నిర్వహించిన చారిత్రక పాత్ర గణనీయమైంది.

*సంస్కృతభాష మాట్లాడిన ప్రజలతో సాహచర్యం అంతగాలేని భాషలలో సంస్కృత పదాలు ఎక్కువగా ఉండకపోవటం సహజం.*

*ప్రజలు మాటలాడుకునే తెలుగులో సంస్కృతపదాలు మితిమీరి కన్పించటమే సంస్కృత ప్రజలతో తెలుగు వారికి గల సంబంధాలకు, తెలుగు భాష ప్రాచీనతకు నిదర్శనం.*

*ప్రోటోతెలుగు ప్రజలు విజితులూ కాదు, విజేతలూకాదు. వాళ్ళు ఆర్యప్రజలకు సహజీవనులు. ఆర్యులతో దక్షిణాదికి తరుమబడినవారు అంతకన్నా కాదు. దక్షిణాదినుంచి ఆర్యావర్తం దాకా తమ సంస్కృతీ వికాసాలను నిలబెట్టుకున్నవారు, వ్యాపింప చేసినవారు, వ్యాపించినవారు కూడా.*

## లౌకిక సంస్కృతం- తెలుగు

వైదిక ఆర్యులు తాము వేదాలలో చెప్పుకున్న ఛందానికిగాని, తాము నిత్య వ్యవహారంగా ఒకరితో ఒకరు మాట్లడుకునే భాషకుగానీ ఏ పేరూ పెట్టుకున్నట్లు వేదాలలో సాక్ష్యం కన్పించదు. క్రీస్తుపూర్వం 8వ శతాబ్దికి చెందిన పాణిని చెప్పిందే ఇందుకు ప్రమాణం.

1. వైదిక(సంస్కృత) పదాలకు వేదము-ఛందస్సుఅని పేర్లు.
2. లౌకిక (సంస్కృత) పదాలకు భాష, సంజ్ఞ అని పేర్లు.

పాణిని ప్రకారం భాష అంటే లౌకిక పదాలను పలకడం అని ! "ఛందసి-వేదే, భాషాయామ్- లోకే " అని పతంజలి కూడా పేర్కొన్నాడు.

***ఛందోవేద సంజ్ఞతో పిలువ బడిన వేద శబ్దాలు- భాషాలోక సంజ్ఞతో పిలువబడిన లౌకిక శబ్దాలు తొలి దశలో ఒకటేననీ, కాలానుగుణంగా అనేక మార్పులతో లౌకిక సంస్కృత భాష రూపొందిందనీ*** మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు చెప్పారు.

లాటిన్, గ్రీక్, జర్మన్, ఇంగ్లీషు భాషలలో కన్పించే ప్రాథమిక పదాలు అనేకం ఛందో వేదంలోనూ (పిత-ఫాదర్ లాంటివి) కన్పించడానికి కారణం, ఆయా భాషల మూలపురుషులు ఒక కుదురులోని వారు కావడమో ఒక చోట సహజీవనం చేయడమో అయివుండవచ్చు. ఈ పదాలే జనసామాన్యం నోటపడి- వేరుపడుతూ- లోక శబ్దజాలం ఏర్పడి వుండవచ్చునంటారు మల్లాది వారు. ఇందుకు ఆయన కొన్ని సామ్యాలు చూపించారు.

1. దేవాసః అనే ఛందో వేద శబ్దం లోక భాషలో దేవాః అయ్యింది. ఇలానే

కర్ణేభి - కర్ణైః
అస్మే - అస్మభ్యమ్
యుష్మే - యుష్మాసు

ఇలా అనేక పదాలు ఒక నియమం లేకుండా లౌకిక భాషలో ఇష్టారాజ్యంగా ప్రయోగించబడటాన్ని గమనించి కాశ్యప, శాకల్య, శాకటాయన ఇలాంటి మునులు లౌకిక భాషను సంస్కరిస్తూ వచ్చినట్లు పాణిని స్వయంగా పేర్కొన్నాడు.

*"లౌకికి"* (ప్రజలు మాట్లాడుకునే సంస్కృతం) స్వేచ్ఛగా విజృంభించడం చూసి ఆర్యభాషను చక్కగా శాసించేందుకోసం పాణిని పూనుకున్నట్లు అర్థం అవుతోంది. అలా సంస్కారం పొందిన ఆర్యభాష సంస్కృతం.

దాని వికృతి (సరళీకరణం పొందిన ముతక రూపం) శబ్దజాలాన్ని *ప్రాకృతం* అన్నారు. అంటే, ఆనాడు సాధారణ ప్రజలు మాట్లాడిన భాష ప్రాకృతం. పాణిని కన్నా ముందే సంస్కృతం అనే పదం వుంది. దాన్ని పాణిని సార్థకం చేశాడని *మల్లాది సూర్యనారాయణ* శాస్త్రిగారు సంస్కృత వాఙ్మయ చరిత్రలో పేర్కొన్నారు.

క్రీ.పూ.500 నాటి వరరుచి రాసిన ప్రాకృత వ్యాకరణంలో సంస్కృతంలోంచి శౌరసేనభాష, ప్రాకృతంలోంచి పైశాచిభాష పుట్టినట్లు పేర్కొన్నారు.

*ఈ భాషలతో మరింత సంకరం కాకుండా సంస్కృత భాషని కట్టడిచేసిన వాడు పాణిని. అలా సంస్కృత భాషలో చేరిపోయిన ఇతర భాషాపదాలన్నీ అప్పటి నుంచీ సంస్కృత శబ్దజాలంగా మారిపోయాయి.*

ఈ నిరూపణలు కొన్ని ముఖ్యమైన అంశాల్ని గుర్తు చేస్తున్నాయి.

1) ఆర్యావర్తంలో సంచరించిన కాలంలో ఆర్యుల మాతృభాష (జనసామాన్యం మాట్లాడుకున్న భాష) ఛందోవేదమేగాని *"లౌకికి"* సంస్కృతభాష కాదు. *"ఛందోవేద"* కడపటి పరిణామం లౌకిక సంస్కృతం.

2) సంస్కృతం వివిధ ప్రాకృత రూపాలకు తల్లి అయ్యింది. అవన్నీ సంస్కృత భాషా కుటుంబానికి చెందిన భాషలే ! వాటిలో *ద్రావిడ భాషా కుటుంబా*నికి చెందిన భాషలేవీ లేవు.

3) లౌకిక భాష (సంస్కృతం) ఒక్కటే మార్పులు పొందిందనుకోనవసరం లేదు. *ఛందోవేదం* కూడా కొంచెం కొంచెంగా మారుతూనే వచ్చింది. మంత్రాలలోని ఉచ్చారణా కాఠిన్యం, శబ్దంలోని బిగువు బ్రాహ్మణాల నాటికి బాగా సరళం అయ్యాయి. వేదాంతంలోకి వచ్చేసరికి మరింత సడలాయి. లౌకిక భాషా మర్యాదలు వైదిక భాషలోకి చొచ్చుకు రావడమే ఇందుకు కారణం.

4) ఛందోవేద భాష రూపుదిద్దుకునే దశలో ఉన్నప్పుడే అంటే, ఆర్యావర్తంలోకి ఆర్యులు అడుగిడటానికన్నా ముందే, ఇండో ఆర్యన్ భాషా కుటుంబానికి చెందిన అనేక భాషా పదాలు అందులోకి చేరిపోయాయి. సప్తసింధులోకి ప్రవేశించిన తర్వాత పూర్వ ముండా భాషా పదాలు, పూర్వ ద్రావిడ పదాలు కూడా చేరి ఛందోవేదాన్ని మరింత పుష్టినందించాయి.

5) కాలక్రమంలో పూర్వద్రావిడ భాష ఉత్తర, మధ్యమ, దక్షిణ ద్రావిడ భాషలుగా విడివడిన దశలోనూ, వాటిలోంచి తెలుగు, తమిళ, కన్నడ తదితర 24 భాషలురూపొందిన దశలోకూడా లౌకికసంస్కృత భాషతో సంబంధ బాంధవ్యాలు నడవడంతో ఎన్నో శబ్దాలు పరస్పర వ్యాపనం చెందాయి. తద్వారా, అటు లౌకిక సంస్కృతమూ, ఇటు ద్రావిడభాషా రూపాలుకూడా *"పదసంపన్నం"* అయ్యాయి. ***అంటే, ప్రోటో తెలుగు, సంస్కృతమూ ఒకేకాలంలో పుట్టి స్నేహితుల్లా కలిసి మెలిసి పెరిగి వుంటాయి.***

6) క్రీ.పూ. 11వ శతాబ్దానికి చెందిన పాణిని సంస్కృత భాషకొక రూపాన్ని కల్పించిన కాలానికే ప్రోటో తెలుగు రూపొందిన వైనం గమనార్హం. *తెలుగు, సంస్కృత భాషలు ఏక కాలంలో రూప సంపన్నతనీ, పదసంపన్నతనీ పొందడానికి పరస్పరం సహకరించుకున్నాయనడానికి ఇది సాక్ష్యం.*

7) పాణిని *సలతూర్* అనే ప్రాంతానికి చెందిన వాడని చెప్తారు. *జితేంద్ర మోహన్* చటర్జి ఈ సలతూర్ ఆఫ్ఘనిస్తాన్‌లో ఉందని పేర్కొన్నారు. దీన్ని బట్టి పాణిని అటు "అవెస్తా", వైదిక సాహిత్యాలతోపాటు ఇటు బ్రాహుయీ భాషతోకూడా చక్కటి పరిచయాలు ఉన్నవాడేనని ఊహించవచ్చు ! ప్రోటోతెలుగు అప్పటికే రూపు దిద్దుకుని ఉంటే, దానితోనూ పాణినికి మంచి పరిచయమే వుండివుండాలి.

*సింధు నగరాలలో ఆర్యులు, అసురులు, బ్రాహుయీ భాష మాట్లాడిన ప్రజలతో పాటు కొత్త భాషగా రూపుదిద్దుకొంటున్న ప్రోటోతెలుగు మాట్లాడిన ప్రజలుకూడా ఉండేందుకు అవకాశాలున్నాయి.*

*అంటే, ప్రోటో తెలుగు, సంస్కృతమూ ఒకేకాలంలో పుట్టి, స్నేహితుల్లా కలిసి మెలిసి పెరిగి వుంటాయని ఊహించ వచ్చు.*

## తెలుగుపదాలా ? సంస్కృత పదాలా ?

ద్రావిడ భాషా కుటుంబంలోని భాషలన్నింటికీ మాతృక ఏ రూపంలో ఉండేదో మనకు తెలియదు. ఈ ప్రోటో ద్రవిడియన్ మాతృకని పునర్నిర్మించే ప్రయత్నాలు బాగా జరుగుతున్నాయి. ఈ భాషల్లోని శబ్దజాలాన్ని ఏ అర్థానికి ఆ అర్థంగా ఒక చోట చేర్చి భాషా శాస్త్రనియమాల ప్రకారం, వ్యాకరణ నియమాల ప్రకారం విశ్లేషించి కొన్ని మూలరూపాలను పునర్నిర్మించగలుగుతున్నారు.

పూర్వద్రావిడభాష ఎక్కడుందీ– ఎవ్వరైనా చూశారా అని వ్యంగ్యంగా ప్రశ్నించనవసరం లేదు. ఏ భాష మాతృకనైనా ఎవ్వరైనా ఇలా ఊహాత్మకంగా పునర్నిర్మించ వలసిందే. అత్యధిక పరిశోధకుల ఆమోదం ఉన్నంత వరకూ అదే సత్యంగా కొనసాగుతుంది.

ప్రోటో ద్రావిడ రూపాల ఆధారంగా చూసినపుడు తెలుగులో కన్పించే సంస్కృత పదాలు చాలా వాటికి ద్రావిడ రూపాలే మూలాలుగా తెలుస్తున్నాయి. అంటే, తెలుగులో కన్పించే చాలా సంస్కృత పదాలు తెలుగు పదాలేననీ, అవి సంస్కృతంలోకి చేరడానికి తెలుగు భాషగాని, ప్రోటో తెలుగు భాషగాని సహకరించి ఉండవచ్చని అర్థం అవుతుంది.

తెలుగులో తరువు, శంభువు లాంటి పదాలు సంస్కృత భాషలో తరుః, శంభుః అని కనిపిస్తాయి. *ద్రవిడియన్ ఎటిమలాజికల్ డిక్షనరీలో ఈ* ***తరు*** రూపానికి సంబంధించి వివిధ ద్రావిడ భాషలలో ఉన్న పదాలు, వాటి అర్థాలను పరిశీలించండి...

***తరువు – తాడి***

1. **తెలుగు** – తారు, తాడు, తాటి palmyra tree
2. **తమిళం** – తరాయ్ shoot, sprout, thrive
   తెరుకు new leaves
   తెరుక్కు bud, sprout
   తారయ్ co-conut tree
   తట్టు, తట్టాయ్, తంటు stalk, stem, stalk of grain
3. కన్నడ – తార్ palmyra or toddy palm
4. **తుళు** – తారి(తాలి) palmyra tree
5. **మలయాళం** – తరల్ (ఇ) bark, coat
6. కొండ – తారాయి co-conut tree
7. కొలామి – తారి plantain
8. కుయి – తారి plantain

ఈ పదాల పట్టికని బట్టి సంస్కృత *తరు*– ద్రావిడ భాషల్లోని *తరు, తారు, తారి, తరాయ్* ఇవన్నీ ఒకే కుదురులోంచి పుట్టి ఉంటాయని ఊహించవచ్చు. ఆ మూల రూపం ఏది ?

జి. బ్రొనికోవ్ రూపొందించిన *ద్రవిడియన్ ఎటిమాలజీ* గ్రంథంలో ఈ ***తార్*** రూపం గురించి కొన్ని ముఖ్యమైన విశేషాలు పేర్కొన్నారు.

ప్రొటోనార్త్ ద్రవిడియన్ –"తార్ "

ప్రొటో సెంట్రల్ ద్రవిడియన్ –"తార్"

ప్రొటో సదరన్ ద్రవిడియన్ –"తార్ " ఈ మూడింటికీ మూల రూపం ***తార్*** ఒక్కటే కావటం విశేషం.

*తార్* లోంచి ప్రోటో తెలుగు *తాడ్* తెలుగులో *తారి, తాడి, తాల* శబ్దాలు రూపొందాయి. తెలుగునాట *'తార్'* రూపాన్ని *తాడిచెట్టు*కూ, కేరళ– తమిళనాడులలో కొబ్బరి చెట్టుకూ, కొలామి భాషలో అరటి చెట్టుకూ అన్వయించినట్లు అర్థం అవుతుంది. తర్ + వ్ + ఉ- తరువు రూపంలోని తర్ శబ్దాన్ని చెట్టు అనే అర్థంలో సంస్కృతంలోకి స్వీకరించి

ఉంటారని ఊహించేందుకు అవకాశాలు లేకపోలేదు. ఆ మాటకొస్తే తరు శబ్దం సంస్కృతంలోకి చేరడానికి తెలుగు సహకరించి ఉండవచ్చుకూడా.

తలప్పు, తలాటి, తలాటు – ఈ పదాలకు తమిళ భాషలో పొడవైన తల కలిగిన చెట్టు అని అర్థం. అది కొబ్బరి చెట్టు కావచ్చు, తాటి చెట్టు కావచ్చు, అరటి చెట్టు కావచ్చు. వీటి తల మాత్రమే పెరిగి ఉంటుంది కాబట్టి! తాల వృక్షం అనే పదానికి అర్థం ఇదే అయితే అది నిస్సందేహంగా తెలుగులోంచి వెళ్ళిన సంస్కృత పదమే కావాలి. అయినా తెలుగువారికి తాడిచెట్టు కరువా.. తాడిచెట్టు తెలియనివారి సంస్కృత భాష నుంచి ఎరువు తెచ్చుకోవటానికి... ?

ఇక్కడి దాకా వచ్చాం కాబట్టి, మరో ముఖ్య విషయం– తాటక అనే స్త్రీ రామాయణంలో రాక్షసి. మొక్కల పేర్లు ఇళ్ళ పేర్లుగా ఉండటం, మనుషులకు పెట్టుకోవడంఅనాదిగా ఉన్న అలవాటే. టోటమిక్ సంస్కృతిలోఇది ఒక భాగం. తాటకి పేరుకూ తెలుగువారి తాటి చెట్టుకూ సంబంధం ఉండి ఉంటే, రామాయణ కాలానికి తెలుగు భాష ఉన్నట్టే అవుతుంది.

## పుత్ర–పుట్టు

తెలుగులో ఇలా సంస్కృత పదాలుగా చెలామణి అవుతున్న అనేక తెలుగు పదాలు చాలా ఉన్నాయి ***పుత్ర*** అనే పదాన్ని తీసుకోండి అతి సామాన్యుడు కూడా సంస్కృత పదమే నంటాడు. ఇది పూర్వ ద్రావిడ రూపంలోంచే ఏర్పడిన పదం. బహుశా సంస్కృత పదం కాకపోవచ్చు.

"*పున్నామ్నో నరకాత్ త్రాయతే ఇతి పుత్రః*" అని మన పెద్దలు చెప్పే వ్యుత్పత్తి సహేతుకం కాకపోవచ్చని *శ్రీ తిరుమల రామచంద్ర* కూడా రాశారు. ***ఇది పుట్టు అనే తెలుగు శబ్దానికి దగ్గరగా ఉంది.***

| | |
|---|---|
| పూర్వ ద్రావిడ – | పుట్ (to be born) |
| పూర్వ దక్షిణ ద్రావిడ – | పుట్ |
| పూర్వ తెలుగు – | పుట్ ట్ (తెలుగు పదం పుట్టు) |
| కొండ | పుట్ (to be born) |
| బడగ | పుట్ (to be born) |
| తొద | పుట్ to grow |
| కొలమి | పుట్ట్ to be born |

*తెలుగులో మరికొన్ని అదనపు రూపాలు:* DEDR4264 ప్రకారం-పుట్టించు to create, penerate, produce పుట్టుక, పుట్టుగు, పుట్టువు birth creation origin ఈ అర్థాలలో ఉన్నాయి. ద్రావిడ రూపం పుట్ - పుత్రగా మారేందుకు గల అవకాశాలను పరిశీలించ వలసి ఉంది.

## మీనం-మీను

చేపని 'మీను' అని కూడా తెలుగులో పిలుస్తాం. ఈ పదం కూడా ద్రావిడ భాషాపదమే. ద్రావిడ భాషలోంచే సంస్కృతంలోకి వెళ్ళిందని అర్థం అవుతుంది.

| | |
|---|---|
| పూర్వ ద్రావిడ రూపం | మ్- న్ (fish) |
| పూర్వ దక్షిణ ద్రావిడ | మ్- న్ |
| తెలుగు | మ్న్ |
| తెలుగు | మీను |
| *తమిళం* | మీన్ (DEDR -4885) |
| *మళయాళం* | మీన్ |
| కొండ | మీణ్ |
| తొద | మీణ్ |
| తుళు | మీ న్ |
| పాలీ | మీని |

ఇన్ని ద్రావిడ రూపాలున్న తెలుగు "మీను" శబ్దానికి మ్న్ ద్రావిడ మూలం స్పష్టంగా కనిపిస్తోంది. మీను సంస్కృత భాషలోకి వెళ్ళిన చక్కని ద్రావిడ పదం.

# 3. తెలుగు - తమిళం

ద్రావిడ భాషల వర్ణవిభాగ పద్ధతి, సంస్కృత భాషా వైయాకరణులు అనుసరించిన వర్ణవిభాగ పద్ధతి ఇంచుమించు ఒకేలా వుంటాయి. రెండు భాషలనూ వేర్వేరు భాషా కుటుంబాలలో చేర్చినప్పటికీ. సంస్కృత ద్రావిడభాషలలో వర్ణాలు రెండింటికీ ఒకే రకంగా ఉన్నాయి. వ్యాకరణ సూత్రాలని తెలుగువారైనా, తమిళులైనా మౌలికంగా సంస్కృతాన్ని అనుసరించే రూపొందించుకున్నారని *కోరాడ రామకృష్ణయ్య*గారు రాశారు (తోల్కాప్పియం 1927 భారతి)

తెలుగులో అర్ధానుస్వారం (ఖండబిందువు), పూర్ణానుస్వారం (పూర్ణ బిందువు), విసర్గ (ః)లు ఉంటే తమిళ భాషలో కార్పెళుత్తులు ఉన్నాయి. ఎళుత్తులు అంటే వర్ణాలు. కార్పెళుత్తులను తమిళులు ప్రత్యేక విభాగంగా చెప్పుకుంటే, తెలుగువారు అచ్చుల్లో కలుపుకున్నారు.

పూర్వ ద్రావిడ భాషలో 33 వర్ణాలే ఉండేవని భాషావేత్తలు చెబుతారు. తెలుగులో తత్సమం, తద్భవం, దేశ్యం ఇవన్నీ కలిపి 55 వర్ణాలేర్పడ్డాయి.

తెలుగు వైయాకరణుల దృష్టిలో వర్ణవివేచన-అనే వ్యాసంలో హైదరాబాద్ విశ్వవిద్యాలయం తెలుగు శాఖకు చెందిన డా.అద్దంకి శ్రీనివాస్ చక్కని విశ్లేషణ చేశారు (భావవీణ–నవంబర్ 2007).

*ఈ లఘువ్యాకరణాలు కేవలం తెలుగు భాషావర్ణాలను లెక్కించటం మాని , ఆంధ్రభాష, మిశ్రమభాష అనే పదాలతో వ్యవహరిస్తూ ఆ భాషకు వ్యవహారంలోనూ, లేఖనంలోనూ ఉపయోగపడే అన్ని వర్ణాలను లెక్కించటం ప్రారంభించారు. పూదూరివారు 57, రావిపాటివారు 55, కళ్ళేపల్లివారు 57... ఇలా ఒకటి రెండు ఎక్కువతక్కువలతో పరిగణనచేశారు. వీటన్నింటిలోనూ శాస్త్రీయత అంతగా గోచరించదు. ఈ పరిస్థితులలో బహుజనపల్లి సీతారామాచార్యులు (క్రీ.శ. 1885) ప్రౌఢవ్యాకరణం ఆంధ్రభాషకు 55 వర్ణాలను పేర్కొంది.*

*వీరేశలింగం 1872-75 ప్రాంతంలో రచించిన సంగ్రహ వ్యాకరణం, వావిలకొలను సుబ్బారావు (1905) సులభ వ్యాకరణం, నేలటూరి పార్థసారథి అయ్యంగార్ (1921) ఆంధ్ర వ్యాకరణ సంగ్రహం వంటి వ్యాకరణ గ్రంథాలు తెలుగు భాషకు 37వర్ణాలని తత్సమాల ద్వారా చేరేవి 19 అని మొత్తం 55 వర్ణాలను ఆంధ్రభాషకు పేర్కొన్నాయి.*

వర్ణాలు తగినన్ని ఉన్నందువలన పదాలను ఉచ్చరించినట్లు రాయడానికి వీలౌతుంది. వర్ణాలను తగ్గించి, తెలుగు భాషను సంస్కరించాలని ఇప్పుడు చాలా మంది ప్రయత్నిస్తున్నారు. తక్కువ వర్ణాలతో ఎక్కువ ఉచ్చారణా సౌలభ్యాన్ని సాధించగలిగితే మంచిదే. ఎంతటి కఠిన పదాన్నయినా దాని ఉచ్చారణకు తగినట్లు తెలుగులో రాయగలిగేలా చేసేందుకు ఈ లిపి సంస్కరణ ఉపయోగపడాలి.

ద్రావిడ భాషలోంచి విడివడిన ప్రోటో తెలుగు(అచ్చతెలుగు) భాషలోకూడా 37 వర్ణాలుండేవని అంటారు. ఈనాటి మన తెలుగు వర్ణక్రమం సంస్కృత మిశ్రమం. ఇందులో 18 అచ్చులున్నాయి. అచ్చ (పాత) తెలుగులో 14 మాత్రమే ఉండేవిట.

ఋ, ౠ ఌ ౡ-చేరిక వలన 18 అచ్చులయ్యాయి.

అచ్చు తెలుగులో 14 అచ్చుల్లోనూ పూర్ణ బిందువు (సున్న),ఖండ బిందువు (అర సున్న), విసర్గ తీసేస్తే 11 అచ్చులే వుంటాయి.

ఇంక హల్లుల విషయానికొస్తే అచ్చు తెలుగులో 23 హల్లులుంటే, తమిళంలో 18 మాత్రమే ఉన్నాయి. 5 హల్లులు వారి భాషలో తక్కువగా వుండటానికి తమిళులు గ, జ, డ, ద, బ అక్షరాల్ని వదులుకోవడం కారణం. *సంస్కృత పదాలు తమిళ ఉచ్చారణలో సరిగా వ్యక్తం కాకపోవడం ఒక ముఖ్య విషయం* అని కోరాడ రామకృష్ణయ్య గారు అన్నారు.

ఒక పదం మధ్య వచ్చే పరుషాన్ని సరళంగా పలికే అలవాటు ద్రావిడ భాషలో ముందు నుంచే వుంది. అందుకని, *క, చ ,ట, త, ప* వర్ణాల్ని పదాల మధ్యలో వచ్చినప్పుడు *గ, జ, డ, ద, బ* అని పలికే సాంప్రదాయం వుంది. ఈ కారణాల వలన దస్తం, భాగ్యం అనే సంస్కృత పదాల్ని తమిళంలో తస్దం, పొక్కియం అని పలుకుతారు.

*తొల్కాప్పియర్* కాలం నాటికి అంటే, క్రీస్తు శకారంభ కాలంలో పరుషాక్షరాలను స్థానభేదాన్ని బట్టి సరళంగా వ్యవహరించడం సాధ్యంకావడంతో తమిళభాషలో *గ, జ, డ, ద, బ* లను ప్రత్యేక అక్షరాలుగా స్వీకరించలేదని *కోరాడ రామకృష్ణయ్య*గారు పేర్కొన్నారు. తెలుగు వైయాకరణులు *గ, జ, డ, ద, బ* లను ప్రత్యేక వర్ణాలుగా తీసుకున్నారు. కాబట్టి, *క* ని *క*గానూ *గ* ని *గ*గానూ తెలుగులో పలకగలుగుతున్నాము. లేకపోతే క ని *గ* గా పలకాల్సి వచ్చేది.

పదం మధ్యలో వచ్చే ద్విత్వాన్ని తప్ప (యానై+కోడు = యానైక్కోడు) పరుషాది సంయుక్తాక్షరం ఉచ్చారణ చేయలేకపోవడం వలన సంస్కృత శబ్దాలలోని సంయుక్తాక్షరాలను విడగొట్టి, తగిన అచ్చులతో కూర్చి రెండు మూడు అక్షరాలుగా పలకడం మొదలు పెట్టారు.

శుక్లం - చుక్కిలం
బ్రాహ్మణ -పిరమణ
క్లేశ - కిలేశ ...

ఈ విధంగా చూస్తే తమిళంలో సంస్కృత పదాలు లేనట్లే కన్పిస్తుంది. కన్నడం వాళ్ళుకూడా ఈ పద్ధతిలోనే

హార్షం - హరుసం

శబ్దం - సబుదం

అగ్ని - అగ్గి

పుస్తకం - హొత్తగే

కావ్యం - కబ్బం ... అని పలకడం అలవాటు చేసుకున్నారు.

ఆ మాటకొస్తే, సంస్కృత భాషా సహకుటుంబీకులైన ఉత్తర హిందుస్తాన్ భాషల్లో కూడా ఇలా సరళీకరణ ప్రయత్నాలు చాలా వాటిల్లో జరిగాయి.

తెలుగు ప్రజలకు ఈ ఉచ్చారణ సమస్య కలగలేదు *తమిళులకు మాత్రమే ఎందుకు కల్గింది ?* సంస్కృత ప్రజలతో ప్రోటో తెలుగు ప్రజలకు అత్యంత సాహచర్యం ఉంది కాబట్టి వాళ్ళు ఈ సమస్యను అవలీలగా అధిగమించ గలిగి వుంటారు.

వేద శబ్దాన్ని ఉత్తర భారతీయుల కన్నా స్వచ్ఛంగా, స్పష్టంగా తెలుగువారు పలకగలుగుతున్నారు. ఇదెలా సాధ్యం అయ్యిందనే విషయాన్ని మనం పట్టించుకొని పరిశీలించాల్సి వుంది.

ఎరువఙ్కుటి, చెరువక్కళం, ఒడుఙ్కోడు ఇలాంటి తమిళ పదాలనే తీసుకోండి...

ఎరు + అమ్ + కుటి = ఎరువఙ్కుటి

ఇందులో 'అమ్' లోని 'మ్' (హలంతం)ని ఉకారాంతం చేసే సంప్రదాయం దక్షిణాదిలో ఉందని కోరాడ రామకృష్ణయ్యగారు రాశారు. ఈ ప్రాచీన సంప్రదాయాన్ని బట్టి అనేక సంస్కృత శబ్దాల్ని ఉకారాంతాలుగా మార్చుకోగలిగారు.

హలంత సంస్కృత శబ్దాల్ని తెలుగులో తత్సమాలుగా చేర్చినపుడు చివరలో 'ఉకారం' పలకడం కూడా దీన్నిబట్టే వచ్చి ఉంటుందని ఆయన అన్నారు.

వాక్ - వాక్కు

దిక్ - దిక్కు

లిట్ - లిట్టు

సత్ - సత్తు

మనస్ - మనస్సు

ఈ ఉకారాంత సంస్కృత శబ్దాలను సంధి చేసినప్పుడు తరువు + అది = తరువది, శంభువు + అతడు = శంభువతడు - ఇలా మారుతున్నాయి

తమిళంలో చెరు +అవ్+కలం = చెరువక్కలం
కన్నడంలో కుడు +వుదు= కుడువుదు అవుతున్నాయి.
మాతు +ఎల్లం= మాతువెల్లం= మాతెల్లం అవుతోంది. తెలుగులో అలాంటి భేదం లేదు.

*వైయాకరణులు ఆయా భాషల స్వరూప స్వభావాలకు అనుగుణంగా తత్సమ, తద్భవ దేశి శబ్దాలను భిన్నరూపం పొందింపచేశారని దీన్ని బట్టి మనం గ్రహించవచ్చు.*

# 4. అచ్చ తెలుగు భాష

మొదట్లో తెలుగు భాషలో అచ్చతెలుగుపదాలే ఉండేవిట. శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువు కాలంలో సంస్కృత పదాలు తెలుగులోకి ప్రవేశించి జనవ్యవహారంలో వర్ణ లోపాలేర్పడి తద్భవాలు పుట్టాయట. కొమర్రాజు లక్ష్మణరావుగారు ఈ విషయం చెప్పారు.

ఈ ఆంధ్రవిష్ణువు ఆంధ్రకౌముది అనే వ్యాకరణ గ్రంథాన్ని రాయించాడని ఒక ప్రతీతి. ఆంధ్రవిష్ణువు శాతవాహనులకు పూర్వీకుడు. అంటే క్రీ.పూ.3వ శతాబ్దికన్నా ముందువాడు. ఆయన భటుల ఉచ్చారణా లోపంవల్ల వర్ణసంకోచాలేర్పడి తత్సమాలన్నీ తద్భవాలుగా మారిపోయాయి. అంటే, ఒకప్పుడు అచ్చతెలుగుదే రాజ్యమని దీని భావం.

కేతన "ఆంధ్రభాషా భూషణం" అనే వ్యాకరణ గ్రంథంలో..... 1) తత్సమాలు, 2) తద్భవాలు, 3) అచ్చతెలుగుపదాలు, 4) దేశ్యం 5) గ్రామ్యం అని 5 రకాల పదాలను విశ్లేషించాడు. అంటే, అచ్చతెలుగులు, దేశ్యాలు వేరువేరుగా కేతన భావించినట్టు కన్పిస్తోంది..

తల నెల వేసవి గుడి మడి
పులి చలి మడు గూరు పెరుగు బూరుగు మగవా
డలుక యని యెల్లవారికి
దెలిసెడి యాపలుకు లచ్చ తెలుగన బరగున్... ఈ పద్యంలో తల, నెల, వేసవి,గుడి, మడి లాంటి అందరికీ తెలిసిన పదాలు అచ్చతెలుగు పదాలుగా కేతన పేర్కొన్నాడు.

తెమ్మెర లేమావి తెలిగన్ను క్రొన్నన
వలరాజు రేపే(డు వాలుగంటి
యలరులపిండు తెక్కలికా(డు క్రొమ్మించు
కెమ్మోవి కెంజాయ కమ్మతావి
కడలి తామరకంటి వెడవిల్తు డెడకాడు
నలువ కలువకంటి నాన సెగ్గ
మెలనాగ ముద్దియ చెలువ చిగురు బో(డి
తెలువ తలిరుబో(డి మెలు(గు బో(డి
వదరు విసువుట పరిగమి పసలు నసదు
పొద్దు రేయెండ తబ్బిబ్బు పోటు ముట్టు
తనివి వలవంత చెంత మంతన మనంగ
దేరనాడిన దేశ్యంపు దెనుగు లయ్యె...తెమ్మెర, లేమావి, తెలిగన్ను, క్రొన్నన, వలరాజు ఇలాంటి పదాలు కావ్యభాషకు ఉపయోగ పడేవి. వీటిని దేశ్యాలని పేర్కొన్నాడు. తత్సమాలు తప్ప తక్కిన నాలుగూ అచ్చ తెలుగుపదాలేనని కేతన అభిప్రాయం.

కొమర్రాజు లక్ష్మణరావుగారి ప్రకారం శుద్ధాంధ్రము, అచ్చతెలుగు అనే పదాలు లాక్షణిక కల్పితాలే కాని స్వభావసిద్ధాలు కావు. అప్పకవి మాటే ఎప్పటికైనా చెల్లుబాటు అవుతుంది.

సకలజనులకి తేటతెల్లంగా తెలిసిన పదమే అచ్చతెలుగు పదము. అన్యదేశ్యపదాలతో పాటు సంస్కృత పదాలు కూడా ఈ విధంగా తెలుగులో దేశ్యాలైనాయి. భాషాప్రౌఢిమ కోసం కవులు మాత్రమే ఎరువుతెచ్చుకుని వాడుతున్న సంస్కృత పదాలు తెలుగు భాషలో కన్పించే అన్యదేశ్యాలు. కానీ, జనవ్యవహారంలో ఉన్నటువంటి అన్యదేశ్యాలు అచ్చతెలుగుపదాలవుతాయి.

ఈ విధంగా పక్కి అనే పదం తెలుగుకాదు. పక్షి మాత్రమే తెలుగౌతుంది. ఇంతకీ అసలు ప్రశ్న ఒకటుంది...

*తెలుగు భాష మాట్లాడే సామాన్యప్రజల నోటి వెంబడి సంస్కృత పదాలు ఎలా రాగలిగాయి... ? సంస్కృతం మాతృభాషగా కల్గిన ప్రజలతో వీళ్ళకు సాన్నిహిత్య సాహచర్యాలు ఉన్నప్పుడే అది సాధ్యమవుతుంది.*

*సంస్కృతం మాతృభాషగా కలిగిన ప్రజలు ఏ యుగందాకా ఉన్నారో ఆ యుగానికే తెలుగు మాతృభాషగా కలిగిన ప్రజలు ఉన్నారని స్పష్టం అవుతోంది. తెలుగు భాష ప్రాచీనతకు ఇది నిలువెత్తు నిదర్శనంకాదా... ?*

తూమాటి దొణప్పగారు కూడా " ఆంధ్ర భాష- హకారాది పదములు" వ్యాసంలో (*భాషాచారిత్రక వ్యాసావళి-పే.97* ) తత్సమ, తద్భవ, దేశ్యములను విభాగ ప్రక్రియ ప్రాకృత భాషా పదతత్వ ప్రకాశకము"అని ఆయన పేర్కొన్నారు.

1) ప్రాకృత వ్యాకరణంలో తచ్ఛబ్దం సంస్కృత భాషాపరంగా వ్యవహృతం.
2) ప్రాదేశికమైన, అవిజ్ఞాత ప్రాకృతకమైన పదజాలం ప్రాకృత భాషావ్యాకర్తల దర్శనంలో దేశ్యం అనబడుతోంది. వీటిని తెలుగువ్యాకరణ కర్తలు ఉపయోగించుకున్నారు.
3) అయితే, ఆంధ్రంలోని దేశ్యానికీ, ప్రాకృతంలోని దేశ్యానికీ పేరులో ఉన్న పోలికే గాని ఏమాత్రం సంబంధంలేదు.
4) పూర్వద్రావిడ భాషలోంచి రూపొందిన ఒక తెలుగు పదం *దేశ్యం*అవుతోంది. దానికి సంబంధించిన ఇతర ద్రావిడ భాషల్లో ఉండే రూపాలు *సగోత్రికం* అవుతాయి. తమిళ 'ఉరల్' తెలుగు 'రోలు' సగోత్రికాలు. విశేషించి నిత్య వ్యవహారోపయోగాలు.
5) ***"ప్రాకృతంలో అలా కాదు- ఏ పదానికి వ్యుత్పత్తి దొరకదో దానిని దేశ్యం అన్నారు. అవిజ్ఞాత ప్రకృతికం అని భావించిన ఈ భాగంలో చాలా పాలు అనార్యభాషాపదమయమని ఆధునిక భాషా పరిశోధకుల సోపపత్తిక నిర్ణయం."***
6) ప్రాకృతంలో కన్పించే ద్రావిడ, ముండా మొదలైన అనార్యభాషా పదాలను వాళ్ళు దేశ్యంగానే గ్రహించి వాటిని ప్రాకృత, సంస్కృత శబ్దాలుగానే పండితులు పేర్కొనటం అన్యాయం ! చివరికి వాటిని ద్రావిడ, మూండా తదితర భాషలలోకి చేరిన సంస్కృత భాషా పదాలుగా పేర్కొనడం మరింత అన్యాయం ! !
7) దొణప్పగారు స్పష్టంగా చెప్పారు-" *ప్రాచీనాంధ్ర లాక్షణికుల నిర్వచన నిరూపణములలో అన్య దేశ్య స్వరూపము అస్పష్టము. దేశ్యమున అన్య దేశ్యమును అంతర్భూతము.* "

*ఈ విశ్లేషణని పరిశీలించినప్పుడు ప్రాకృత(సంస్కృత) భాషలోకి చేరిన ప్రోటో తెలుగు పదాలు సంస్కృత భాషలో దేశ్యాలుగా మారి సంస్కృత పదాలుగానే వ్యవహృతం అయ్యాయని అర్థం అవుతోంది.*

## జన వ్యవహారంలో ఉన్న పదాలన్నీ దేశ్యాలే!

"ఏ భాషలోనైనా రెండు రకాల పదాలుంటాయి.

(1) మాతృక అయిన భాషలోంచి సంక్రమించిన పదాలు. వీటిని నిసర్గ పదాలు(INDIGENOUS) అంటారు.

(2) *సజాతీయ సోదర భాష* (cognate languages) లోంచి గానీ, దగ్గరగా వాడుకలో వున్న సమీపవర్తి *విజాతీయ* భాషల్లోంచి గానీ, ఎరువు తెచ్చిన పదాలు. వీటిని *ప్రతిదేయ* (borrowed) పదాలని పిలుస్తారు.

తెలుగులో స్వంత భాషా పదాలను *నిసర్గదేశ్యాలని,* ఎరవు పదాలను *ప్రతి దేయాలు,* లేక అన్యదేశ్యాలనీ అంటారు. రైలు, రోడ్డు, బస్సులాంటి పదాలన్నీ అన్యదేశ్యాలే. అలాంటప్పుడు సంధిచేయటానికీ, సమాసం కల్పించటానికీ వీలుకుదరని సంస్కృత పదాలను కూడా తెలుగులో అన్యదేశ్యాలుగానే చెప్పాలి కదా... ?

ఆంధ్ర లాక్షణికులు తెలుగు శబ్దాల్ని ప్రాకృత సూత్రాల ననుసరించి తత్సమములు, తద్భవములు, దేశ్యములు అని మూడు రకాలుగా విభజించారు.

తత్సమాలు సంస్కృత సమములు, ప్రాకృత సమములు అని రెండు రకాలు. వీటిలో ప్రాకృత సమాలనూ, అలాగే తద్భవ దేశ్యాలనూ అచ్చ తెలుగు పదాలుగానే చెప్పారు. అంటే, శుద్ధతెలుగు పదాలన్నమాట.

ప్రాకృత సమాలు, ప్రాకృత భవాలు దేశ్యాలెలా అవుతాయి... ?

కొమర్రాజు లక్ష్మణ రావుగారు లక్ష్మణరాయ వ్యాసావళి గ్రంథంలో(రెండవ సంపుటం) అచ్చ తెలుగు అనే వ్యాసంలో అప్పకవినే ఇక్కడ ఉదహరించారు.

నెలకొను సంస్కృత తత్సమ<br>
ములు దొరలక తజ్జ దేశ్యముల మూట(ను సం<br>
ధిలి కేవలాంధ్ర పదములనలరు కృతుల<br>
నచ్చతెను(గు లంద్రు తెలు(గునన్<br>
తెలు(గు మఱుంగులు ప్రా(దెను(<br>
గులు తద్భవదేశ్యములను గూర్చి మృదుపదం<br>
బులు గా(గ నచ్చ తెను(గులు<br>
మెలకువతో జెప్ప(దగు శమీప్రాంతగృహా

లెల్లను బ్రా(దెను(గు లయ్యేవిప్పటి వారల్
చెల్లుబడి వాడునవియే
తెల్లముగా నింక బ్రా(త తెలు(గు లు నృహరీ

అయితే, కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసారసంగ్రహంలో దేశ్యపదాలనే అచ్చు తెలుగు పదాలుగా చెప్పాడు.

సూరి జనుల్ లోకవ్యవ
హారంబగు బాస దేశ్య మం ద్రదియె హితం
బార(గ నచ్చుతెనుం(గని
యారూఢిగ గొంద(ఱందు రగజాధీశా... అని అన్నాడు.

కేవలం అచ్చు తెలుగు పదాలతో ఒక్క పద్యం కూడా చెప్పడం కుదరదు కాబట్టి తద్భవ పదాలను అన్యదేశ్యపదాలను తెలుగు పదాలుగా గ్రహించవలసి వచ్చిందని దీన్ని బట్టి అర్థం అవుతోంది.

*లోక వ్యవహారంలో ఏవ పదాలను ఉపయోగిస్తున్నారో అవన్నీ అచ్చ తెలుగేనని కూచిమంచి తిమ్మకవి అభిప్రాయంగా కనిపిస్తుంది.*

దీన్నిబట్టి రోడ్డు, రైలు, బస్సులు జనవ్యవహారం కారణంగా తెలుగు దేశ్య పదాలేనని మనం అంగీకరించాలి.

వీటికి తెలుగు సమానార్థక పదాలను కష్టపడి తయారుచేసేకన్నా వీటినే తెలుగు పదాలుగా స్వీకరించటం ఒక విధంగా శ్రేయస్కరం.

# 5. సింధూలిపిలో తెలుగు పదాలకు సాక్ష్యం

*సంస్కృత భాష మాతృభాషగా కలిగిన ప్రజలతో పూర్వ తెలుగు మాతృభాషగా కలిగిన ప్రజలతో సాన్నిహిత్యం ఉన్నదనడానికి గట్టి సాక్ష్యాలే ఉన్నాయి. సింధూలిపిలో*(బాణం)గుర్తు గురించి విశ్లేషణచేసిన పరిశోధకుడు శ్రీ ఇరావతం మహదేవన్ చెప్పిన విశేషాలు ఇక్కడ ముఖ్యమైనవి.

నిజానికి సింధువులతో కలిసి నివసించిన ప్రజలలో తమిళులూ వున్నారని నిరూపించ డానికి గట్టి కృషి చేసింది ఆయనే. కానీ, బాణం ( ↑ ) గుర్తు గురించి చేసిన విశ్లేషణలో ఆయనకు తెలుగు మూలాలు ప్రత్యేకంగా కన్పించాయి



శ్రీ ఇరావతం మహాదేవన్.

వాటిని ఎలాంటి భాషా దురభిమానమూ లేకుండా ప్రకటించ గలిగారాయన. అది బాణమా లేక శూలమా అనే మీమాంస వుంది.దాన్ని ARROW SIGN గానే ఇరావతం మహదేవన్ ప్రకటించారు.

ఈ బాణం గుర్తు వంటరిగాకాక, చేప గుర్తు లేదా ఇతర గుర్తులతో కలిసి జంటగానే కన్పిస్తుంది. వంటరిగా బాణం గుర్తు వున్న ముద్రిక (లేదా ఫలకం) ఏదీ దొరకలేదట. బహుశా, లింగభేదాన్ని (*వచ్చింది, వచ్చాడు*-ఇలా స్త్రీ (లేదా) పురుషుడు)చెప్పడానికి ఈ రూపాన్ని ఉపయోగించి వుండవచ్చు, లేదా *తెచ్చాడు, తెచ్చారు*-ఇలా ఏకవచనాన్ని(లేదా) బహువచనాన్ని సూచించడానికి కూడా ఉపయోగించి వుండవచ్చునని భావించారు. ఏమైనా అది పదాంతంలోని ప్రత్యయమే నన్నారాయన.

ఇలా పరిశీలిస్తున్న దశలో కోరాడ మహదేవశాస్త్రిగారి ***హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ తెలుగు*** గ్రంథంలో ***ంబు*** పద ప్రయోగం గురించిన విశ్లేషణ చదివినప్పుడు ఆయన మనసులో ఈ బాణం గుర్తు మెదిలింది.

ద్రావిడ భాషలలో బాణాన్ని అంపు (ప్రాచీన తమిళం) అంబు (ప్రాచీన తెలుగు, కన్నడ) అని వ్యవహరిస్తారు.

పాత తెలుగు భాషలో(అ)ంబు/(అ)బు- (అ)మ్ము-(అ)ము

పాత కన్నడ భాషలో(అ)మ్-(అ)ము/- (అ)వు

పాత తమిళ భాషలో(అ)మ్-

*ప్రాణంబు*- నేత్రంబుఇలా పదాంతంలో ***ంబు*** చేర్చి పలకడం పాత తెలుగులో (Old Telugu) ఒక అలవాటు. అంటే 'ంబు' ని -డు, ము, ఉ, లు,- ప్రథమా విభక్తి ప్రత్యయంగా ఉపయోగించుకున్నారని అర్థం అవుతోంది.

*ప్రాణంబు- ప్రాణము, వస్త్రంబు- వస్త్రము ఈ విధంగా, అంబు ప్రయోగం ఒక్క తెలుగు భాషలోనే ఉంది. బహుశా సింధూనాగరకత కాలానికి ప్రోటోతెలుగు రూపుదిద్దుకుని ఉంటుందని అనడానికి ఇది తార్కాణం*-అని ఐరావతంమహాదేవన్ అభిప్రాయపడ్డారు.

ప్రాచీనతెలుగుభాషలో పుంలింగం (masculine), అపుంలింగం (పుంలింగం కానిది) (Non masculine) అని రెండు రకాల లింగ భేదాలే ఉన్నాయి, *మహత్, అమహత్* అని వీటిని వ్యవహరించేవారు. స్త్రీలింగ ఏకవచనాన్ని అమహత్ లోనూ, స్త్రీలింగ బహువచనాన్ని మహత్ లోనూ చేర్చారు.

| లింగ | ఏకవచనం | బహువచనం |
|---|---|---|
| మహత్ | పురుష | పురుషులు, స్త్రీలు |
| అమహత్ | స్త్రీ,జంతువు, | జంతువులు, ప్రాణంలేని వస్తువులు |
| | ప్రాణంలేని వస్తువు | జంతువులు కానివి |
| | జంతువు కానిది | |

ఈ పట్టిక ప్రకారం ప్రాచీన తెలుగు భాషలో పుంలింగ ఏకవచనంలో చెప్పేటప్పుడు

**(అ)న్రు - (అ)న్డు**

పుంలింగంకాని ఏకవచనంలో చెప్పేటప్పుడు

**(అ)మ్బు-(అ)ంబు-(అ)బు-(అ)మ్ము-(అ)ము-** ఇలా

పలికేవారు. సంవత్సరంబు, ప్రాణంబు, ప్రాప్తంబు ఇలా (అ)ంబుని చేర్చి పలకడం అమహత్ ఏకవచనానికి గుర్తు అన్నారాయన.

స్త్రీలింగం అనేది తెలుగు భాషలో తరువాతి కాలంలో ఎప్పుడో ఏర్పడి ఉంటుందని జ్వెలెవిల్ కూడా అభిప్రాయ పడ్డారు.

ఇరావతం మహదేవన్ గారు మరింత వివరణ ఇస్తూ అంబు ప్రయోగం తెలుగువారి సొంతం అనీ, తమిళంలో అంపు(బాణం)పదం ఉన్నప్పటికీ దాన్ని ప్రథమా విభక్తి ప్రత్యయంగా వాడే అలవాటు లేదనీ, నిస్సందేహంగా సింధునాగరకతలో ప్రోటో తెలుగు భాష ఉన్నదనీ, నొక్కి చెప్పారు.

సింధు ముద్రికలలో మిగిలిన గుర్తులను కూడా ఇలానే విశ్లేషించుకో గలిగితే, ఇంకా ఎన్నో తెలుగు పదాలు బైటపడే అవకాశం ఉంది.

## *తెలుగు లిపి - బ్రాహ్మీ లిపి*

నల్లగొండజిల్లా రాయగిరి దగ్గర బయటపడిన రాతి యుగం నాటి సమాధుల్లో కొన్ని పెద్ద కుండలు కన్పించాయి. వాటి మీద గీతల్లాంటి అక్షరాలేవో ఉన్నాయట. వాటిలో ఏడింటిని మాత్రమే బ్రాహ్మీ లిపిలో సంకేతాలుగా గుర్తించారు.

అంటే, రాతి యుగం నాటి తెలుగు భాషని కొంత వరకు బ్రాహ్మీ లిపిలో రాసి ఉంటారని తెలుస్తోంది

తిరుమల రామచంద్రగారు *మనలిపి-పుట్టుపూర్వోత్తరాలు* అనే గ్రంథంలో ఈ విషయాన్ని చెప్పారు. సింధునాగరకత అంతరించిన తరువాత లిపి విషయంలో ఏ జాతి లేదా తెగ పెద్దగా కృషిచేసినట్లు కనిపించదు. భాష విషయంలో కూడా ప్రోటో తెలుగులోంచి తెలుగు రూపుకట్టుకోవటం చాలా నిదానంగా జరిగిందని అనిపిస్తుంది.

సింధునాగరకులకు వాణిజ్యం తప్ప భాషా సాహిత్యాలు ప్రధానం కాకపోవడంతో, ఆ నగరాలు అంతరించి పోయిన తర్వాత లిపి మరియు భాషలు ప్రత్యేక అభివృద్ధిని పొందలేక పోయాయి

మళ్ళీ మౌర్యుల కాలం వరకూ గ్రామీణ ప్రజా జీవన వ్యవస్థే ప్రధానంగా కనిపిస్తుంది. ఈ కాలంలో వెలువడిన బ్రాహ్మణాలు, ఉపనిషత్తులు మౌఖిక సంప్రదాయానికే ప్రాధాన్యత నిచ్చాయి. దాచిపెట్టుకోవాల్సిన అవసరం ప్రత్యేకంగా లేకపోవడమే ఇందుకు కారణం.

రొమిల్లా థాపర్ *అశోకా అండ్ ది డిక్లయిన్ ఆఫ్ ద మౌర్యాస్* గ్రంథంలో. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, the invention of a script would only have come from the need for a written tradition and probably drew an existing scripts అంటారు.

ఇక్కడో ముఖ్య విషయం ఉంది. లిపి లేని చోట  కంఠస్థం చేసి అప్పచెప్పేందుకు వీలుపడే శబ్దాలే పదసంపదలో ఎక్కువగా ఉంటాయి. లిపి ఉన్నప్పుడు రాసుకుని చదివేందుకు ఉపయోగపడే పదాలు రూపుకట్టుకుంటాయి. అవి చాలా సరళమైన పదాలుగా ఉంటాయి.

'పాణిని' సంస్కృతాన్ని కట్టడి చేసిన కాలానికి లిపి బాగా అభివృద్ధి చెంది ఉండక పోవచ్చునంటారు రోమెల్లా థాపర్. కానీ, –'పాణిని, హిజ్ ప్లేస్ ఇన్ శాంస్క్రీట్ లిటరేచర్' –గ్రంథం పీఠికలో గోల్డ్ స్టక్కర్ పండితుడు పాణినికి లిపి పరిజ్ఞానం ఉన్నదని పేర్కొన్నాడు.

పాణినికే కాదు, ఇరాన్, గ్రీక్ తదితర ప్రాంతాలతో వాణిజ్య పరమైన సంబంధాలు కలిగిన ప్రోటో తెలుగు ప్రజలకు, ఫినీషియన్ల లిపి, ఆఫ్రికన్ మండింగ్ భాషల 'లిబికో–బెర్బర్ లిపులతో కూడా పరిచయం  ఉండే ఉంటుందని శాస్త్రవేత్తలు భావిస్తున్నారు.

మెసపొటేమియన్లు తదితర విదేశీజాతులతో తెలుగువారికిగల సంబంధాలు భాషాలిపుల విషయంలో తప్పకుండా ప్రభావాన్ని కలిగించే ఉంటాయనేది *ఇక్కడ చర్చనీయాంశం–*

సమాజం రాజకీయంగా ఎదుగుతున్నకొద్దీ, పాలనా పరమైన అంశాల కోసం, ఆదర్శాల ప్రచారం కోసం, సామాజిక నీతి కోసం, మతం కోసం, ధర్మప్రచారం కోసం 'లిపి' అవసరం క్రమేణా పెరుగుతూ వచ్చింది.

మెసపొటేమియాలో 'నిప్పూర్' దగ్గర క్రీ.పూ 2000 నాటికే భారతీయ వ్యాపారుల కాలనీ ఒకటి ఉండేదిట. 'ది కల్చర్ అండ్ సోషల్ ఇన్స్టిట్యూషన్స్ ఆఫ్ ఏనిషియంట్ ఇరాన్ అనే గ్రంథంలో ' కిష్' (మెసపొటేమియా) లో ఒక భారతీయ స్త్రీ పూటకూళ్ళ ఇంటిని (tavern) నడిపిందని తెలియచేశారు. ఆ స్త్రీ నిస్సందేహంగా తెలుగు మహిళే అయి ఉంటుంది– *పూటకూళ్ళ సాంప్రదాయం తెలుగు వారిదే కాబట్టి.*

*విశ్రాంతికోసం అద్దెకు ఇచ్చే రెస్టారెంట్లను స్థాపించినవారు కృష్ణదేవరాయలు కాలంనాటి అక్కలవాడలనో లేక పూటకూళ్ళ ఇళ్ళనో చూసి ప్రారంభించి ఉంటారని చెప్తారు.*అయితే లిపి ఎంత అందుబాటులోకి వచ్చినా దానిని వినియోగించుకున్న ప్రజల సంఖ్య ఈ నాటికీ తక్కువే. అక్షరాల అవసరం చదువుకున్న ఏ కొద్దిమందికో మాత్రమే ఉంటుంది. చదవనూ వ్రాయనూ వచ్చిన వారే కదా అక్షరాస్యులంటే... ?

| సింధు | దేవనాగరి | తెలుగు |
|---|---|---|
| | क | క |
| | ग | గ |
| | ड | డ |
| | ह | హ |
| | भ | భ |
| | स | స |

సంస్కృత భాషలో 'లిపి'అనే పదమేలేదని మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు రాశారు. రాయడం అనేది వారికి తెలియదని కాదు. అప్పటికే సింధు లిపిని వారు ఎరుగుదురు కూడా.

ప్రాచీన కాలంలో 'డేరియస్  అనే పారశీక రాజు వేయించిన 'బేహిస్తాన్ శాసనం'లో 'డిపి' అనే పదం కనిపిస్తుంది. దీనిని బట్టే వ్రాత అక్షరాలకు లిపి అనే పేరు వచ్చిదని 'బర్నెల్' పండితుడు 'సౌత్ ఇండియా పేలియోగ్రఫీ' గ్రంథంలో పేర్కొన్నాడు.

*"ఇంద్ర వరుణ భవ శర్వ రుద్ర మృడ హిమారణ్య యవన మాతులాచార్యాణా మానుక్ -"* అనేది ఒక ఋగ్వేద సూత్రం. '*యవన యవా ల్లిపిదుష్టే*-'అనే శాకటాయన

వ్యాకరణ సూత్రాన్ని చూసి పాణిని *'యవన'* పదానికి లిపి అనే అర్థాన్ని సూచించాడని చెప్తారు. *'యవనానిల్లిప్యామ్-'* అని కాత్యాయనుడు కూడా పేర్కొన్నాడు.

*ఋగ్వేదంలో చెప్పిన ఈ 'యవన లిపి'కి అర్థం గ్రీకు లిపి కాదనీ, సుమేరియన్, అక్కాడియన్ తరహా కీలలిపి ఏదైనా కావచ్చునని పండితుల అభిప్రాయం. సింధునాగరకత కాలం నాటి లిపికే యవన లిపి అనే పేరు ఉండేదేమో పరిశీలించవలసిఉంది.*

# *6. సింధులిపిలో అక్షరాలా- అంకెలా... ?*

సింధులిపిలో కన్పించేవి అక్షరాలా ?- పదాలా ?-భావార్థాలా ?-అంకెలా ?- అనే ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానాలు లేవు. అనేక ఊహాగానాలు ఆనాటి నుంచి సాగుతూనే ఉన్నాయి.

*వ్యాపారులకి అక్షరాల కన్నా అంకెలే ముఖ్యం-* అనే దృష్టితో చూసినప్పుడు, సింధులిపిలో ఉన్న గుర్తులలో కొన్ని అంకెలు కావచ్చనే ఆలోచన కొత్త కోణాలని ఆవిష్కరించింది.

ఈ ఆలోచనని రేకెత్తించింది, శ్రీ బి.వి.సుబ్బరాయప్ప అనే "*ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ వరల్డ్ కల్చర్,*" బెంగుళూరుకు చెందిన పరిశోధకుడు. మిథిక్ సొసైటీ (1987 జనవరి)సంచికలో ఆయన "*సింధులిపి గర్భంలో అంకెలు*" అనే ఆంగ్ల వ్యాసంలో కొన్ని అద్భుత విశేషాలు అందించారు.

ప్రాచీన ఈజిప్ట్ మెసపొటోమియా, చీనా, గ్రీస్ లిపులలోనూ, ఖరోష్ఠి బ్రాహ్మీ లిపులలోనూ ఉన్న అంకెల్ని పరిశీలించి సింధులిపిలో అనేక సంకేతాలను అంకెలుగా గుర్తించగలిగాడు.

ఈజిప్షియన్, సుమేరియన్ల లిపికన్నా ఆధునికమైనదిగా సింధువుల లిపిని ఆయన భావించాడు.

చేతి వేళ్ళతోనే లెక్కించడం మొదలుపెడతాం - 5, 10, 15, 20 ఇలా... అందుకని చైనా లిపిలోనూ, సింధులిపిలో కూడా U గుర్తు 10 అంకెని ∩ గుర్తు 20 అంకెని సూచిస్తుంది. మనిషి శరీరానికి 20 వేళ్ళు ఉంటాయి కాబట్టి.

నఖ అంటే గోరు అనే అర్థంతో పాటు, *ఇరువది అంకె-* అనే అర్థాన్ని కూడా సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఇచ్చారు.

నఖ = 20 అనే అర్థాన్ని ∩ ఈ గుర్తు సూచిస్తోంది. ఈ గోరుగుర్తు ఆధారంగా 9010 వరకు అంకెల్ని సింధులిపి సంకేతాలలోంచి వివరించారాయన.

వ్యాపారపరమైన వ్యవహారాలకోసం తప్పనిసరి అవసరంగా ఒక లిపిని సింధువులు సృష్టించుకోవాల్సి వచ్చింది. వ్యాపార సంస్కృతికి కొంతమేర అక్షరాలు కూడా అవసరమే. పద్దులు రాసుకుని దాచుకోవడాన్నికైనా ఒక లిపి కావాలి కదా...అంతమేరకు ఉపయోగపడే సరళలిపినే సింధువులు అభివృద్ధి చేసుకున్నారనిపిస్తుంది.

∩||| = 20+3= 23

∩U||| = 20+10+3=33

అలెగ్జాండర్ కోండ్రటోవ్ ఆర్యులకు ముందున్న నాగరకత, మతాల గురించి **వ్యాఖ్యానిస్తూ**, "*దశాంశ సంఖ్యామానాన్ని భారతీయులే కనుగొన్నారు. అయితే ఈ కనుగొన్నది ఆర్యులు కాదు, వారికన్నా ముందున్న ప్రజలు. ఆర్యుల రాకకన్నా పూర్వమే సింధునగరాలలో వ్యాపారులు, గణితశాస్త్ర అధ్యయనకారులు లెక్కలు రాసే అలవాటు కలిగినవారు*" అన్నాడు.

# *7. మూత మీద 'తెరు' అని రాసిన సింధువులు*

*ది క్వార్టర్లీ జర్నల్ ఆఫ్ ది మిథిక్ సొసైటీ* 1938 సంచికలో రెవరెండ్ హెచ్. హెరాస్ పరిశోధకుడు వల్లభిపూర్ (కథియావార్)లో దొరికిన ఒక మూకుడు మూత గురించి చిన్న పరిశోధనా వ్యాసం వ్రాశాడు.

కుండల మీద, కూజాల మీద పెట్టే మూత పైన ఒక చిన్న ముడి లాంటిది వుంటుంది. ఇప్పటికీ కూజా మూతల మీద ముడిని మనం గమనించవచ్చు. కుండల మీద ఇలాంటి ముడి వున్న మూతలు మొహెంజాదారో సంప్రదాయం అనీ, కాబట్టి కథియవార్ దాకా ఆనాటి సింధునాగరకత విస్తరించిందనీ ఆయన భావించాడు. గుజరాత్ లోపలికి చొచ్చుకొచ్చిన అరేబియా సముద్రభాగం దగ్గర ఈ కథియవార్ వుంది.

వల్లభిపూర్‌లో దొరికిన కుండమూత ముడిని ఫొటో లో చూపించిన పద్ధతిలో చూస్తే మధ్యలో కొక్కెం ఆకారంలో( ̄) )గొడుగు కర్ర వంపులాగా ఒక రూపం కన్పిస్తుంది.



**కూజా మూతమీద తెరు అని రాసిన ముడి**

ఇలాంటి గుర్తే సుమేరియన్ కుండమూత ముడిలోనూ వుంది. అది ౖ ఈ ఆకారంలో కనిపిస్తుంది. దీని అర్థం ఏమై ఉండవచ్చు... ?

ప్రొఫెసర్ లంగ్డన్ ఈ సుమేరియన్ గుర్తుని "బర్" అని చదివాడు. అంటే to open అని ! 'ఇగి-బర్' అంటే సుమేరియన్ భాషలో 'కళ్ళు తెరవటం' కళ్ళతో చూడడం- to see, to look at అని అర్థాలు.

రెవరెండ్ హెరాస్ ఈ సంకేతాన్ని సింధునాగరకతలోని కుండ మూత ముడితో పోల్చి చూశాడు. ఇది కచ్చితంగా ద్రావిడ పదమే అయి ఉంటుందని భావించాడు. ద్రావిడ భాషలలో తెర, తిర, తుర అను మూడు రూపాలు కన్పిస్తున్నాయి.

తెలుగు ః తెరగు - దారి
తెరలబారు - తొలగిపోవడం
తెరలు - బయలుదేరడం
తెర(రు)వు - మార్గము, దారి
తెరుకువ - మార్గము
తెరువరి - దారినడిచేవాడు
తెఱప - తెఱచుట( మరుగులేనిది)

తమిళ ః తిరవు ః opening, unveiling, gateway(DEDR 3259)

తిరప్పు -open, unfortified place, key, cleft

మలయాళం ః తురక్క to open

తురక్కు opening of the mouth

తురప్పు opening

తురవు opening, entrance

కొండ తెరవ్ to open ( తలుపులు తెరచుట) release ( బందెల దొడ్డి లోంచి పశువుల విడుదల)

తోద తెర్(క్) to open (container door, pen etc)

ఈ ద్రావిడ రూపాలలో ఏదో ఒకటి కుండ మూత ముడిమీద రాసి ఉన్నట్లు హెరాస్ గారు భావించాడు. హెరాస్‌గారు తక్కువ పరిశోధకుడు కాదు. ఈ ఆలోచన చేసే నాటికే ఆయన – *ది ఆరిజిన్ ఆఫ్ ద సుమేరియన్ రైటింగ్స్, సుమేరియన్ ఎపిగ్రఫీ* లాంటి అనేక రచనలు చేసివున్నారు. ఆయన పరిశీలనలో తేలిన మరో ముఖ్య అంశం ఉంది. .

కథియవార్‌లో గొడుగుకర్ర వంపు గుండ్రంగా ఫోటోలో చూపించినట్లు వుంటే, మొహెంజదారోలో అది ఏడు7 అంకెలాగా కోణాలలో వుంది.

అలా కోణాలతో వుండటమే "అర్వాచీనత" అన్నారాయన. అంటే, గుజరాత్‌లో దొరికిన వొంపు 9 సింధునాగరకతలో దొరికిన కోణాల 7 దానికన్నా తరువాతి కాలానిదని హెరాస్‌గారు భావించారు. బహుశా, సింధునగరాల కాలానికే cuneiform (కీల) లిపి ప్రారంభం అయ్యిందని భావించవచ్చునన్నాడు.

ఈ నిరూపణల్లో ముఖ్యమైన అంశం దక్షిణ భారత దేశంలో మొదట నాగరకులు బయలుదేరి ఉత్తరాదిన సింధునాగరకత వరకూ విస్తరించారనే వాదం కనిపిస్తోంది. దక్షిణాదినించే సింధు నాగరకత ప్రారంభమై ఉండవచ్చునని హెరాస్‌గారు గట్టిగా నమ్మినట్టు అర్థం అవుతోంది.దక్షిణాదిలో తొలి భూభాగం తెలుగు నేల మీద అప్పటికే విస్తరించిన నాగరకతకూ, సంస్కృతికి ప్రత్యేకమైన వివరణ అవసరంలేదు. *నాగరకత దక్షిణాన డెక్కన్ పీఠభూమి నుంచి మొదలై ఉంటుందని ఊహించటానికి ఇది తోడ్పడుతోంది.* కుండమూత ముడి మీద ప్రోటో ద్రవిడియన్ (లేదా) ప్రోటో తెలుగు 'తెరు' శబ్దం కన్పించడంలో ఆశ్చర్యం లేదు. ***మూతమీద తెరు అని రాయడం ఆనాటి తెలుగువారి ఒక చమత్కారం.***

# 8. ప్రపంచ భాషల్లో పూర్వ ద్రావిడ భాషా మూలాలు

ప్రోటో ద్రావిడియన్(మాతృక) భాషారూపాల మూలాలు ప్రాచీన నాగరకతల్లో అనేక చోట్ల బయటపడుతున్నాయి.

యూరప్, ఆసియా, ఆఫ్రికాలలోని అనేక భాషల్లో పూర్వద్రావిడ రూపాలు పరిశోధకులకు కన్పించసాగాయి. వాటిని విడివిడిగా పరిశీలించినపుడు, తెలుగు, తమిళం, కన్నడం తదితర భాషల్లో వాటికి సమీపంగానో, సన్నిహితంగానో ఎన్నో రూపాలు కన్పిస్తాయి. ఎందుకంటే, ఈ భాషలన్నీ పూర్వ ద్రావిడ మాతృకలోంచి విడివడినవే కాబట్టి.

అయితే, అలా కన్పించే అనేక రూపాలు తమిళపదాలేననీ, తమిళభాష ఆయాభాషలకు మాతృక అనీ, తమిళ రచయితలు చాలా విశేషాలు రాయడం మొదలు పెట్టారు. ఎంతో చాకచక్యంగా *ప్రోటోద్రవిడియన్* అనే పదం కన్పించిన ప్రతీ చోటా ప్రోటో తమిళ అనే పదాన్ని చేర్చి వక్రీకరించడం చాలా సందర్భాలలో జరిగింది. ముఖ్యంగా జపాన్‌భాషలో తమిళ పదాలగురించి చేసిన విశ్లేషణ ఈ వక్రీకరణకు ప్రత్యక్షసాక్ష్యం.

Susumu Ohno అనే జపాన్ భాషావేత్త ద్రావిడ భాషాపదాలు జపాన్ భాషలో అనేకం కన్పిస్తున్నాయని నిరూపిస్తూ *"ది జనియాలజీ ఆఫ్ ది జపనీస్ లాంగ్వేజ్"* అనే వ్యాసాన్ని ప్రకటించాడు. ఇందుకోసం *ద్రవిడియన్ ఎటిమొలాజికల్ డిక్షనరీని* ఆశ్రయించినట్టు చెప్పుకున్నాడు.

ఈ డిక్షనరీ మీదే నిజంగా ఆధారపడి ఉంటే ఆయనకు తమిళ రూపాలతోపాటు తెలుగు, కన్నడ, మలయాళ తదితర రూపాలుకూడా కన్పించి ఉండేవి. ఆసక్తి గల పరిశోధకుడెప్పుడూ కొత్త విషయాలను అలా వదిలేయడు.

ఆయన కావాలని తెలుగు తదితర భాషలను ఉపేక్షించి కేవలం తమిళపదాలను మాత్రమే తీసుకుని *జెనియోలాజికల్ రిలేషన్‌షిప్ బిట్వీన్ జపనీస్ అండ్ తమిళ్* అనే ఊహాత్మక పరిశోధన *(హైపొథీసీస్)*ని ప్రకటించాడు. జపాన్‌భాష తమిళభాషలు రెండూ రక్తసంబంధీకులనే అర్థం కలిగిస్తూ ఈ పరిశోధన సాగింది.

తమిళభాషను 48 మిలియన్ల మంది మాట్లాడుతున్నారు కాబట్టి, వాళ్ళకి 2000 ఏళ్ళనాటి సంగమ సాహిత్యం ఉంది కాబట్టి 'తొల్‌కాప్యమ్' అనే విశ్లేషణాత్మక వ్యాకరణం ఉంది కాబట్టి, ఏడుభాగాల తమిళ లెక్సికన్-1936 ఉంది కాబట్టి, తాను తమిళ రూపాలతో మాత్రమే జపాన్ పదాలను పోల్చి పరిశోధిస్తున్నట్టు పేర్కొన్నాడు. ఇతర ద్రావిడ భాషలైన తెలుగు12వ శతాబ్దికి, కన్నడం11వ శతాబ్దికి చెందినవేకదా... అని వాటిని పట్టించుకోనవసరం లేదని కూడా రాశాడు.18 కోట్లమంది ప్రజలు ప్రపంచంలో తెలుగుభాషను మాట్లాడుతున్న సంగతే తనకు తెలియనట్టు ఊరుకున్నాడు.

తమిళం బాగా తెలిసిన **మునివో తొకునాగ** అనే జపాన్ భాషావేత్త ఈ సుసుము ఓనో గారి ఊహాత్మక పరిశోధన మీద మండిపడుతూ, ఇది *'ద్రవిడియన్ ఎటిమలాజికల్ డిక్షనరీ దుర్వినియోగం'* misuse of DEDR—అని అభివర్ణించాడు. DEDR లో చెప్పిన అర్థాల్ని ఇందులో వక్రీకరించినట్లుగా కూడా పేర్కొన్నాడు. దాని ఇంగ్లీషు అనువాదాలకు తప్పుడు అర్థాలను లాగినట్లు ఆరోపించాడు.ఈ సిద్ధాంతంలో భాషాపరమైన పాండిత్యం ఏమీ లేదని ఘాటుగా విమర్శించాడు. "నేను చెప్తున్న ఈ విషయాలు చాలవనుకుంటే ద్రావిడభాషమీద అధికారం ఉన్న ముఖ్యులు హైదరాబాద్‌లో భద్రిరాజు కృష్ణమూర్తి, రష్యాకు చెందిన ఆంద్రనోవ్ తదితరులున్నారు వాళ్ళని అడిగితే తెలుస్తుంది అని మందలించాడు.

నిజానికి, Susumu Ohno తన పరిశోధనపైన వచ్చిన ఈ విమర్శని తానే నిజాయితీగా తన వ్యాసం చివర ప్రకటించాడు.

అయితే, "ఈ తొకునాగా ఒక్కరే నన్నిలా విమర్శించాడు. తమిళ పండితులెవ్వరూ వేలెత్తి నా సిద్ధాంతంలో ఆవగింజంత దోషం చూపించలేదు" అని నొచ్చుకొన్నాడు.

జపాన్‌తో తమిళ భాషకు సంబంధం ఎప్పటిది ? ద్రవిడ భాషతో తమిళం విడిపోయిన తరువాతే తమిళంలోంచి జపాన్ భాష పుట్టిందనేందుకు తగిన సాక్ష్యాలేవీ ఈ పరిశోధనలో కన్పించవు.

భావసారూప్యత, రూపసామీప్యతలు గల కొన్ని పదాలను జపాన్ భాషలోంచి ఏరి, రెండు భాషల మధ్య బాంధవ్యాన్ని నిరూపించేందుకు ప్రయత్నించారే గానీ, ఈ బాంధవ్యం ఏ కాలంలో ఏ పరిస్థితుల్లో ఏర్పడిందో తేల్చి చెప్పలేక పోయారు.

మైసూర్‌లోని సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ లాంగ్వేజెస్ డైరెక్టర్‌గా పనిచేసిన ప్రముఖ తమిళ పరిశోధకుడు శ్రీ ఎన్. అన్నామలై ది హిందూ (2003) దినపత్రికలో ప్రొఫెసర్ భద్రిరాజు కృష్ణమూర్తిగారి ద్రవిడియన్ లాంగ్వేజెస్ ఆంగ్ల గ్రంథాన్ని సమీక్షచేస్తూ ఇలా అన్నారు :-

"Their comparision with Tamil,not with proto Dravidian (Indicating the mistaken coalscence mentioned above in the scholarly world also) is methodologically faulty given the time scale of any positive relationship- there are typological and probabilistic similarities between Languages, which donot argue for a genetic relationship-"

అన్నామలైగారు చెప్పిన దాంట్లో కొన్ని ముఖ్యమైన అంశాలున్నాయి.వాటి సారాంశం ఇది:

1) జపాన్, ఆఫ్రికన్, సుమేరియన్ తదితర ప్రాచీన సంస్కృతులలో పూర్వద్రావిడ భాషారూపాలు (పదాలు) అనేకంఉన్నాయి. ఆ పదాలు తెలుగు తదితర ద్రావిడ భాషలన్నింటిలోనూ ఉండవచ్చు.వాటిని ***తమిళ సొంతం***గా చిత్రించే ప్రయత్నం తప్పు

2) రూపపరంగానూ, అర్థపరంగానూ, శబ్దపరంగాకూడా దగ్గర పోలికలున్న పదాలు వివిధ భాషల్లో కన్పిస్తాయి. అవి ఆ రెండు భాషలు మాట్లాడిన ప్రజల మధ్య నడిచిన సంబంధ బాంధవ్యాలకు సాక్ష్యాలేకానీ, తమిళం ఆ భాషకు తల్లి అనే అర్థం వచ్చే రాతలు చరిత్రకు అపకారం చేస్తాయి.

3) ఒక విదేశీ భాషలో ఏవైనా పూర్వద్రావిడ పదాలు కన్పించినపుడు అవి తమిళ పదాలకన్నా తెలుగు పదాలకు మరింత దగ్గరగా ఉంటే, ఈ వాదనలు చెల్లుబాటు కానివిగా అవుతాయి. అందుకే తెలుగును సాధ్యమైనంత పక్కనపెట్టే ప్రయత్నాలు ముమ్మరంగా సాగుతున్నాయి.

పూర్వద్రావిడ రూపాలకు అనేక తమిళ పదాలకన్నా తెలుగుపదాలే దగ్గరగా ఉంటాయి. జపాన్‌భాషలో తమిళపదాలకు ఎంత అవకాశం ఉందో తెలుగు పదాలకు కూడా అంతే అవకాశం సహజంగా ఉంటుంది. ఆయన తమిళపదాలతో చేసిన తులనాత్మక పరిశీలనలో తెలుగు పదాలను కూడా సరిపోల్చి చూసి ఉంటే, చాలా చోట్ల తెలుగే జపాన్ పదాలకు మరింత సన్నిహితంగా ఉన్నట్లు తెలిసేది. కానీ, అందుకు ఆయన ప్రయత్నించక పోగా, తెలుగుని చులకనగా వ్యాఖ్యానించాడు.

Susumu Ohno అందించిన జపాన్ తమిళ తులనాత్మక పరిశీలనకు తెలుగు పదాలను అదనంగా చేర్చి ఇక్కడ అందిస్తున్నాను. పరిశీలించండి.

1.జపాన్ : FAR-U (To swell, expand)

తమిళం : PAR-U (To swell-DEDR-3972)

తెలుగు : పరపు-విరివి గలది. పరగు-వ్యాపించు, పరం, పరచు(విస్తరించు),

2)జపాన్ : FAR-ARA (To be broken off)

తమిళం : FAR-I (To be sundered- DEDR-39632)

తెలుగు : పఱియు, పరియవాయు, పఱియలగు, పరియలు బారు,పగులు.

వివరణ : పారము-మల్ల బంధ విశేషము, అంతము. పహర (ప్రాకృతం), ప్రహారణం(సంస్కృతం)..ప్రయోగాలు ఇదే అర్థంలో కన్పిస్తాయి.

పగులు, చీలు అనే అర్థాలు కూడా వున్నాయి. బహుశా, ఇదికూడా సంస్కృతంలోకి చేరిన ద్రావిడ రూపం కావచ్చు.

3) జపాన్ : FAT-AKE (Field for cultivation)

తమిళం : PA-UKAR (Rice field DEDR-3856)

తెలుగు : పోడు

వివరణ : మూల ద్రావిడ పదం PATఅంటే, Field అని, Garden Bed అని అర్థాలు కన్పిస్తాయి. ఈపాట్ రూపంలోంచే, 'పాడ్,' 'పోడ్' అనే తెలుగు రూపాలు వచ్చాయి. ద్రావిడ పదం 'ప జపాను భాషలో ఫ' గానూ, 'ట'- 'డ' గానూ మారడం గమనించ వచ్చు. కచ్చితంగా తెలుగు పాడ్ రూపమే జపాన్ ఫాడ్ పదానికి దగ్గరగా వుందని చెప్పాలి.

4) జపాన్ : FAT-U (To end, Perish, Die)

తమిళం : PAT-U ( To perish, To Die DEDR-38521)

తెలుగు : పడు

వివరణ : మూల ద్రావిడ 'పండ్' అంటే అలసి పోవడం, పడటం, పడిపోవడం, మరణించడం అనే అర్థాలు. పండాడు, పండింది అనే ప్రయోగాలూ ఉన్నాయి. పతనం, చావు, పూడు,

5) జపాన్ : FIR-O (Wide-great)

తమిళం : PER_U (great, large,DEDR_4411)

తెలుగు : పేరు, పెరుగు

వివరణ : మూల ద్రావిడ 'PED'అంటే to swell great, Abundant(పెద్ద) అని...' పెర్ 'అనే రూపం కూడా ఇదే అర్థంలో కన్పిస్తుంది.

6) జపాన్ : FOK_U (To enlogize, Praise)

తమిళం : PUK_aj (enlogy DEDR_4235)

తెలుగు : పొగడు వివరణ : మూల ఉత్తర ద్రావిడ పదం POK_AR (praise, known,praise) మూల దక్షిణద్రావిడపదంPUG_AR

పూర్వ తెలుగు: పొగడ్

7) జపాన్ : FOT_O (Time)

తమిళం : POT_U (Time DEDR_4559)

తెలుగు : పూట, పొద్దు

8) జపాన్ : FAR_U (To become bulky)

తమిళం : FAR_e (to be bulky-DEDR-3972)

తెలుగు: పరి- పెద్దది, చతురంగ బలయుత సేన, నిడుపైనది, గొప్పది, భారీ, బారీ

వివరణ : మూల ద్రావిడ PAR_To grow, to swell

ప్రాకృతం- భారి'ఆ' - పెద్దది

9) జపాన్ : FAR_e (To be diffused, as cloud, gas)

తమిళం : PAR_A (to be diffused, as cloud _DEDR-3949)

తెలుగు : పయర, పైర, పయిర (దక్షిణపు గాలి)

పవనం, పవం - సంస్కృత రూపాలు.

10)జపాన్ : FAR-A (Field of sky)

తమిళం : PAR-AM (Heaven-T-L-2499) తమిళ లెక్సికాన్

తెలుగు : పరము (మీదిది)

11) జపాన్ : FAT-U (First, New of the season)

తమిళం : PAT-U (To appear for the first time DEDR 3852)

తెలుగు : పట్టు, (ప్రారంభం) పట్టించు, ప్రారంభము, నోము పట్టు-నోము ప్రారంభించు

12) జపాన్ : FAT-U ( To stay-ship)

తమిళం : PAT-U (To stay in a harbour) (తమిళ లెక్సికాన్ 244)

తెలుగు : పడవ

వివరణ : మూల దక్షిణ ద్రావిడ 'PADAV'

మూల - తెలుగు 'PAD-AV'

"పడ్" ధాతువుకు చెరువు, కోనేరు, నది అర్థాలున్నాయి, నీటిపైన నిలిచేది "పడ్-అవ్" కావచ్చు.

13) జపాన్ : FIN-A (rustic)

తమిళం : PIN {(rear place) -DEDR4205}

తెలుగు : పిన, పిన్న (తక్కువ, వెనకబడినది, హీనమైనది, చిన్నది అనే అర్థాల్లో ఈ ప్రయోగం కన్పిస్తుంది)

14) జపాన్ : FUK-ASU (To smoke-steam)

తమిళం: POK_AI (To smoke, vapor-DEDR4240)

తెలుగు : పొగ, పావ.

15) జపాన్ : FOR-O (cloth cover)

తమిళం: POR-VAI (Covering DEDR -4590)

తెలుగు : పొర

వివరణ : అరటి, ఉల్లి మొదలైన వాటిమీది పొర, కంటిపొర, పాము కుబుసము, కుచ్చితము, మడత, ప్రమాదము, అపోహ

మూల ద్రావిడ POR (To Cover)

ప్రాచీన తెలుగు పొర్

16)జపాన్ : FOR_U (to desire)

తమిళం : PUR-I (To derise-DEDR 4287)

తెలుగు :పిరము(ఇష్టము),పిరదు (ఇష్టపడు) పెరిమ(ప్రేమ), ప్రేప్స (కోరిక) ప్రియము

17) జపాన్ : FUT-A (cover, lid)

తమిళం : PUT-AI (to burry, hide, cover-DEDR 4509)

తెలుగు : పూడిక, పూడుచు, పొడుచు, పాతు, ప్రాతు,

వివరణ : మూల ద్రావిడ POT(To Burry, Cover) 2,BUSH

మూల దక్షిణ ద్రావిడ PUT-UNK

ప్రాచీన తెలుగుPOD

మూలగోండి, కూయి: PUD-1

బ్రాహుయీ: PUT-UNK

18) జపాన్ : FUT-O (to be bulky)

తమిళం: PU-AI (bulkiness, protruberance -DEDR 4253)

తెలుగు: పోతరం

మూల దక్షిణ ద్రావిడ : PON, ప్రాచీన తెలుగు: PON, వాడుక

మూల కొలామి -గడబ PON

మూల గోండి కూయి : PON

మూల ఉత్తర ద్రావిడ : PUQ

తెలుగు : పొంగు, ఉప్పొంగు, పొగవించు, పొంగారు, పొంగులెత్తు

19) జపాన్ : TUF-A (splitt– ఉమ్ము)

తమిళం : Tuppsl (saliva -DEDR 3323)

తెలుగు : తుప్పర, తుంపర, (చొల్లు, జొల్లు)

20) జపాన్ : SUF-U (To suck)

తమిళం : CU PP-U (to suck, Sip - DEDR 2621)

తెలుగు : చప్పరించు, చప్పలించు, (ధ్వన్యనుకరణ పదం కావచ్చు)

*కర* అనే తమిళ పదానికి రాయి అని అర్థం. పాత జపాన్‌భాషలో 'గర' అంటే రాయి. ఈ ఉదాహరణ ఒక్కటే జపాన్‌పదాలు తమిళపదాలు అక్క-చెల్లెళ్ళని చెప్పడానికి సరిపోతుందని ఈ పరిశోధకుడు పేర్కొన్నాడు. కానీ, *కంకర* అనే తెలుగు పదాన్ని ఇక్కడ మనం గుర్తు చేయవలసి వుంది.

ఆఫ్రికా, సుమేరియా భాషలతోపాటే, జపాన్ భాష కూడా ద్రావిడ భాష(ల)తో సన్నిహిత సాహచర్యం నడిపి వుంటుందని ఈ నిరూపణలు తెలియ చేస్తున్నాయి.

అంతేగానీ, కొన్ని పదాల సామీప్యతని ఆసరా చేసుకొని జపాన్ భాషకు తమిళంతో రక్త సంబంధం అంటగట్టడం మంచిదికాదని అన్నామలైగారితో సహా పెద్దలంతా నిరసించారు.

ఈ సామీప్యత తమిళానికి ఎంత వుంటుందో తెలుగుకూ అంతే వుంటుంది. తెలుగుని పక్కన బెట్టి జరిపే ఇలాంటి పరిశోధనల్ని మన తెలుగు భాషావేత్తలు పట్టించుకోకుండా ఉపేక్షిస్తే తెలుగు జాతికి జరగవలసిన అపకారం జరిగిపోతుంది

ప్రోటో ద్రవిడియన్ మూలాలు అనేక ప్రపంచ భాషల్లో కనిపిస్తున్నప్పుడు వాటి రూపాలు అన్ని ద్రావిడ భాషల్లోనూ వుండేందుకు సమాన అవకాశాలున్నాయి. వాటిని తమిళ భాషావేత్తలు స్వంతం చేసుకోవాలని ప్రయత్నించడమే ఇక్కడ ముఖ్యంగా మనం అభ్యంతరం చెప్పవలసిన విషయం.

# 9. సుమేరియా భాషలో తెలుగు కూర

తెలుగువారు తాము తమిళ సాంబారునే ఉపయోగిస్తున్నట్టు భావిస్తారు. తమది గోంగూర అని, అరవలది  సాంబారని మనలో బలమైన అభిప్రాయం వుంది.

క్రీ.శ.1390 లో రిచర్డ్ II ఇంగ్లీష్ కుకరీ బుక్ పేరుతో ఒక పుస్తకాన్ని రెండువందల మంది ప్రసిద్ధ వంటగాళ్ళ అనుభవాలతో రాయించాడట.

అందులో  The forme of cuire అనే అధ్యాయం ఒకటి ఉందని చెప్తారు. కాబట్టి 600 ఏళ్ళకు ముందే కర్రీని వండటం ఆంగ్లేయులకు తెలుసని మనకి అర్థం అవుతోంది.

క్విజైన్ (Cuisine)  అంటే, వంట సరంజామా, వంటచేసే విధానం. ఈ ఆంగ్ల పదం cuire  లోంచే ఏర్పడిందని అంటారు. వర్డ్స్‌వర్త్   ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీష్ డిక్షనరీ cuirry పదానికి  kury అని పలకాలని రాసింది. అయితే, ఈ పాత ఆంగ్ల పదం వంట, వంటకం అనే అర్థంలోదే కానీ,  వండిన కూర అనే అర్థంలో కన్పించడం లేదుకదా... ?  మరి కర్రీ కూర ఎలా అయింది... ?

ద్రవిడియన్ ఎటిమలాజికల్ డిక్షనరి (సంఖ్య-1911)లో ***కూర్*** అనే మూల ద్రావిడ పదానికి అరిటాకులో వడ్డించిన అన్నం అని అర్థం ఇచ్చాడు.

తుళు : కూరు, కూలు (వండిన అన్నం-Boiled rice) ఆహారం

తెలుగు : కూడు (వండిన అన్నం-Boiled rice) ఆహారం

ఇదే డిక్షనరీలో (సంఖ్య-1391) *కరి* అంటే ...*తమిళం:* కూరగాయలు, (పచ్చివి లేదా వండినవి), మాంసం (పచ్చిది లేదా వండినది), మిరియాలు, వేడి వంటకాలు. *కన్నడం :* కూరగాయలు; *తెలుగు :* కరియ్- అముడు- దేవుడికి నైవేద్యం కోసం వండిన వంటకం. (అముడు సం. అమృత), కరలువారు- దేవుడికి నైవేద్యం కోసం కూరగాయలు తెచ్చే వారు... ఈ అర్థాలు కన్పిస్తాయి.

జి.బ్రొనికోవ్ రూపొందించిన ద్రవిడియన్ ఎటిమాలజీలో పూర్వ ద్రావిడ రూపం *కర్* అనే పదానికి ఇచ్చిన వివిధ అర్థాలు ఇవి.

Kar: salty, pungent కారుప్పు,
Kar(al): to loosen, loose క్రాలు
Kar(c): to defecate, topass
Kar: stick, shaft, tooth క్ర
Kar: black నలుప
ar: vegetables కూరగాయలు
Kar-nd: cloth కండువా
Kar-v: hunger కరవు

మూల ద్రావిడ *కర్* రూపంలోంచి ఏర్పడిన ఈ పదాలలో కూరగాయలకు సంబంధించిన కర్ రూపం కూరగా తెలుగులో మారలేదనీ, వండిన ఆహారపదార్థం అనే అర్థం ఇందులో లేదనీ స్పష్టమవుతోంది. కాబట్టి కూర - కరి లోంచి గానీ, కర్ లోంచిగానీ ఏర్పడలేదని మనం గట్టిగా నమ్మవచ్చు.

క్రీ.శ. 16వ శతాబ్దికి చెందిన భావప్రకాశ అనే వైద్య గ్రంథం అన్నానికి పర్యాయ పదాలను వివరిస్తూ *భక్తమన్నం తధాంధశ్చ క్వచిత్కూరం చ కీర్తితం, ఓదనం స్త్రీ స్త్రియాం భిస్సాదీ దివిః పుంసి భాషితః* అంటుంది. భక్త అన్న, అంధ, ఓదన, భిస్సా, దీదివి ఈ పేర్లన్నీ అన్నానికి పర్యాయ పదాలట.కొన్ని ప్రాంతాలలో కూరం అని కూడా పిలుస్తారట. భావమిశ్రుడు తెలుగు ఒరియా ప్రజలతో బాగా సాన్నిహిత్యం ఉన్నవాడు. అన్నానికి కూరం అనే వ్యవహారం ఈ రెండు ప్రాంతాలలో ఒకనాడు ఉండి వుండవచ్చునని దీన్ని బట్టి మనం గ్రహించవచ్చు.

ఇలమ్రైట్, ఉరలిక్, సెమెటిక్ భాషల్లో కూర అనే పదం స్పష్టంగా కన్పిస్తోంది. ఇలం అంటే, ప్రాచీన ఇరాన్‌లో ప్రజలు మాట్లాడిన భాష. ఈ భాషలో కు రా అక్ అంటే, కాల్చు (burn) అని ! లి మాక్ కూ రా అక్ ప అట్ పు ఉప్ ర అప్ ప అక్ న అనే పెద్ద వాక్యం అక్కడ దొరికిన ఒక ఫలకంలో క్యూనిఫాం(కీల)లిపిలో కనిపించింది. ఈ వాక్యానికి The enemies should be burnt, seared at my feet behound అని అర్థం. ఈ వాక్యంలో శత్రువుని ***కూ రా అక్* - *కూరాకు చేయాలని అనడం*** కన్పిస్తుంది.

విశేషం ఏమిటంటే ఇదే పదాన్ని ఇదే అర్థంలో తెలుగులో కూడా ప్రయోగించడం ఉంది. *పులుల జట్టలు చీరి దుప్పులను వేళ్ళ నే కలమ్ముల గ్రుమ్మి కూరాకుసేసి* -అని సారంగధరలో కవి ప్రయోగం కన్పిస్తుంది.
***ఇలమ్రైట్ భాషలో*** :***కూ రా అక్*** - కాల్చటం: ***కూ రా అమ్ క్*** - పెద్ద గాడి పొయ్యి
ప్రోటోఉరలిక్ భాషల్లో Korpe (to burn)–కాల్చు
ప్రోటో సెమెటిక్ భాషల్లో Kawr అంటే పెద్ద పొయ్యి.

ఈ నిరూపణలు కూర అనే పదానికి కాల్చటం అనే అర్థాన్ని సూచిస్తున్నాయి. తొలి దశలో కూరని కాల్చుకునే తినివుంటారు. తరువాతి కాలంలో కూరని వండుకుని తిన్నారు. ఇప్పుడు కూరని నూనెలో వేసి వేపుకు తింటున్నారు.

తమిళంలో కరి ఉందికాని కూర లేదు. తెలుగు కూర పదానికి మూలాలు ఇలమ్రైట్ ఆఫ్రికన్ భాషల్లో కన్పిస్తున్నాయి. ఇది చక్కని పరిశీలనాంశం.

# 1. కృష్ణా గోదావరీ తుంగభద్ర నాగరకత

ఛార్లెస్ డార్విన్, థామస్ హక్స్‌లే కలిసి పరిణామ సిద్ధాంతం మీద పని చేసారు. థామస్‌హక్స్‌లే తొలిమానవుడి గురించి చెప్తూ *హోమో సెపియన్ మానవుడు హిందూ మహాసముద్రంలో మునిగి పోయిన లెమూరియా ఖండంలో పరిణమించాడని* చెప్పాడు.

ఆఫ్రికాఖండం దాకా విస్తరించి ఉన్న భూ ప్రాంతంలో అధిక భాగం సముద్రంలో మునిగి పోగా మిగిలిన నేల దక్కన్ పీఠభూమిగా మారింది. ఒక్క మాటలో చెప్పాలంటే, హిందూ మహాసముద్రం ఎంతమేర ఉందో అంత మేర భూమిమునిగి పోయిందన్న మాట. ఈ మునిగి పోయిన భూమిని లెమూరియా ఖండం అనీ, లెమూరియాలో మునగకుండా మిగిలిన భూమిని దక్కన్ పీఠభూమి అనీ అన్నారు. ***ఇది ఒకనాడు ప్రవహించిన అగ్నిపర్వతాల లావా. దక్కన్ పీఠభూమి భూగోళపు అతి పురాతన ప్రాంతం, ఇక్కడే జీవులు ఆవిర్భవించాయి.- అని స్పష్టంగా ప్రకటించాడు సర్ టి. డబ్ల్యు.హాల్డర్నెస్.***

నరుడి పరిణామ క్రమంలో శ్రమశక్తి (లేబర్) పాత్ర గురించి ఫ్రెడెరిక్ ఏంగిల్స్ రాసిన గ్రంథంలో అనేక వందల వేల సంవత్సరాల క్రితం బాగా అభివృద్ధి చెందిన వానరాల్లాంటి నరులు నేటి హిందూ మహాసముద్రంలో మునిగిపోయి ఉన్న ఉష్ణమండల ఖండం(లెమూరియా)పైన నివసించారని పేర్కొన్నాడు.

మానవ వికాసానికి సంబంధించిన అతి పురాతన అవశేషాలు చిత్తూర్ జిల్లా రేణిగుంట, కర్నూలు జిల్లాలోని కుప్పగల్ తదితర ప్రాంతాల్లో జరిగిన త్రవ్వకాలలో బయటపడ్డాయని శ్రీ సంకాలియా అన్నారు.

"నా దృష్టిలో అతి ముఖ్యమైన రాతియుగం నాటి ప్రాంతాలు చిత్తూరు, కర్నూలు జిల్లాలలో ఉన్నాయి. రాబర్ట్ బ్రూస్ ఫుట్ ఇక్కడ జరిపిన త్రవ్వకాలలో మెరుగైన పనిముట్లనీ, ఎముకలతో చేసిన బొమ్మల్నీ కనుగొన్నాడు. ఫ్రాన్స్ గుహల్లో కూడా ఇలాంటి బొమ్మల్నే కనుగొన్నారు. అవి అప్పర్ పాలియో లితిక్ కాలానికి సంబంధించినవని పోల్చి చెప్పారు.

దురదృష్టవశాత్తు రాబర్ట్ ఫుట్ సేకరణలు ఏవీ కనిపించడం లేదట.. నవీన విధానంలో ఇప్పుడు మరింత తవ్వకాలు జరిపితే తప్పకుండా ప్రాచీన మానవుడినైపుణ్యానికి సంబంధించిన సాక్ష్యాలు చిత్తూరు, కర్నూలు జిల్లాలలో బయట పడతాయి" అని ప్రొఫెసర్. సంకాలియా అన్నారు.

కర్నూలు జిల్లాలో దొరికిన కుడ్య చిత్రాలలో ధ్యానముద్రలో ఉన్న శైవసిద్ధుడి బొమ్మ ఉంది. ఇది సింధునగరాలలో దొరికిన ప్రోటోశివ రూపానికి చాలా దగ్గరగా ఉందని ఎస్.మలయాండి "తెలుగే ప్రాచీనం" అనే వ్యాసంలో పేర్కొన్నారు. (అనువాదం: నడుస్తున్న చరిత్ర మాస పత్రిక 2003 జూలై)

సింధునగరాలు ఉచ్ఛస్థితిలో ఉన్నదశలో సమకాలీనంగా తెలుగునాట వ్యవసాయం, పశుపోషణలతోపాటు లోహపరిశ్రమ విస్తృతంగా సాగుతోంది. వర్తక వాణిజ్యాలు కూడా విదేశీ జాతులతో కొనసాగించగలిగిన పటిష్ట స్థితిలోనే ఆనాటి తెలుగు ప్రజలు ఉన్నారని నిరూపించే అనేక సాక్ష్యాలను పరిశోధకులు వెలుగులోకి తెచ్చారు.

డెక్కన్ అంటే, ఆంధ్రప్రదేశ్-కర్నాటక ప్రాంతాలలో క్రీ.పూ.3000 నాటికే కొత్త రాతియుగం ప్రారంభం అయ్యిందని చాలామంది పరిశోధకుల నమ్మకం. మన్నేరులోయ (ప్రకాశంజిల్లా కనిగిరి)- డి.బి.మూర్తి, బి.డేవిడ్ రాజు... ఇలా ఎందరో పరిశోధకులు తెలుగునాట రాతియుగం స్థితిగతుల్ని వెలుగులోకి తెచ్చారు.

### *దక్షిణ భారతదేశంలో మొట్టమొదటి రైతులు*

(First Farmers in south India) పేరుతో రాకేష్ తివారి సంపాదకత్వంలో గుజరాత్ ప్రభుత్వ సహకారంతో నలుగురు పరిశోధకులు ఏర్చి కూర్చిన పరిశోధనా పత్రాల్ని farmers in Global perspective అనే గ్రంథ ప్రచురణ కోసం ఎన్నిక చేశారు. ఆ గ్రంథ ప్రచురణ ఇంకా పూర్తి కాలేదు. కానీ, దక్షిణ భారతదేశంలో వ్యవసాయం అనే వ్యాసాన్ని మాత్రం వెబ్ లో వుంచారు

నికోలో బోయిన్స్ (కేంబ్రిడ్జి) డొరియన్ ఫుల్లర్ (లండన్), రవి కొలిసెట్టార్ (కర్నాటక), మైకేల్ పీటర్ గ్లియా (కేంబ్రిడ్జి)... ఈ పరిశోధనలో భాగస్వాములుగా వున్నారు. వీరు పేర్కొన్న అంశాలు చాలా ముఖ్యమైనవి.

R.E.M Wheeler (1947) కర్నాటకలోని బ్రహ్మగిరి, చంద్రవల్లి ప్రాంతాలలో *రాతియుగం*- సంస్కృతి అనే అంశంపైన పరిశోధన చేశారు. 1954 లో బి.కే.థాపర్ **దక్షిణ డెక్కన్**లో రాతియుగ జీవనం మీద పరిశోధనా పత్రం సమర్పించారు.

తెలుగునేల మీద రాతియుగంనాటి జీవనస్థితిని విశ్లేషిస్తూ, అనేక పరిశోధనలు సాగాయి. వేముల గ్రామంలో ఒక రాతియుగం స్థావరం మీద ఎం.ఎల్.కె. మూర్తి. (1974).. రేణిగుంట పైన ఎం.ఎల్.కె. మూర్తి (1970), గిద్దలూరు పైన camniade LA and MC Burkitt (1934), నల్లమల-ఎర్రమల ప్రాంతాలపైన ఎస్ ఐజాక్ (1960), కడప స్థావరాలపైన కె.టి.రెడ్డి, వి.సుదర్శన్ (1978), కె శ్రీనివాసులు (1985) పాలేరులోయ పైన వి.వి.ఎం.రావు (1981) ఎర్రగొండపాలెంపైన హెచ్.డి.సంకాలియా (1974), చిలకపాడు, దిగువ

ఇప్పటివరకూ వెలుగులోకి వచ్చిన విశేషాలు డెక్కన్‌పీఠభూమిలో తెలుగువారు నిర్మించుకున్న నాగరకతావైభవానికి అద్దం పడుతున్నాయి.

సర్ జాన్ ఇవాన్స్ అనే పరిశోధకుడు "సైన్స్ ఆఫ్ మాన్ " జర్నల్‌లో (1901) మొట్టమొదటిసారిగా ఒక అద్భుత ప్రతిపాదన చేశాడు. Southern India was probably the cradle of the human race దక్షిణభారతదేశం బహుశా తొలి మానవ నాగరకతకు పుట్టినిల్లు అనేది ఆయన ప్రతిపాదన.దీనిని కృష్ణాగోదావరీ తుంగభద్ర నాగరకత అనికూడా వ్యవహరిస్తూ ఉంటారు.

వేదభూమిగా చెప్పబడిన ఆర్యావర్తాన్ని కాదని, సుమేరియన్, ఈజిప్షియన్, ఇండస్ నాగరకతలను కాదని -ఇవాన్స్‌గారు ఆ రోజుల్లో దక్షిణ భారత దేశంలో బ్రహ్మాండమైన నాగరకత ఉందనటం పరిశోధకులకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

రామాయణగాథలో దండకారణ్య వర్ణనని బట్టి దక్షిణ భారత దేశం అంతా అడవులమయం అని, అక్కడక్కడా ఆటవిక జాతుల వారు మాత్రమే ఉండేవారనీ, ఉత్తరభారతదేశం నుంచి ఆర్యులు వచ్చి ఇక్కడ వారికి నాగరకత నేర్పించారనీ మనలో బలంగా నాటుకు పోయిన అభిప్రాయాలకు ఇది పూర్తిగా భిన్నమైంది.

సర్ జాన్‌ఇవాన్స్ ఇంతటితో ఆగలేదు. మరో అద్భుత విషయాన్ని కూడా ప్రతిపాదించాడు..... Investigations in relation to race show it to be possible that, southern India was once the passageground by which the ancient progenitors of Northern and mediteranian races proceded to the parts of the globe which they now inhabit-." జాతుల పరంగా జరిగిన సంబంధించిన జాతులు, మరియు మెడిటరేనియన్ జాతుల మూల పురుషులు కలిసి

నివసించే వాళ్ళు. వీళ్ళు దక్షిణభారతదేశం నుంచి ప్రపంచం అంతా విస్తరించి ఎక్కడికక్కడ స్థిర నివాసాలు ఏర్పరుచుకున్నారు- ఇదీ ఇవాన్స్‌గారి విశ్లేషణ.

***దీన్నిబట్టి రాతియుగాల కాలంలో దక్షిణ భారతదేశంలో చెప్పుకోదగిన నాగరకత ఉందనీ, అది సింధునాగరకత కన్నా, సుమేరియన్ నాగరకతకన్నా పూర్వం నాటిదని స్పష్టంగా తేలుతోంది. దీన్ని తొలి నాగరకత లేదా దక్షిణ భారత నాగరకతగా మనం పిల్చుకున్నట్లైతే ఆ ప్రజలు ఎవరనే ప్రశ్నకు జవాబు వెదకవలసి ఉంటుంది.***

ఆంధ్రప్రదేశ్ లోని ఏలేశ్వరంలో రాతియుగపు స్థావరాలపైన పరిశోధన చేసిన పి.సి.గుప్తా. ప్రతాప్ సి.హెచ్ దత్తా పరిశోధకులు."Human remains excavated from megaliths at yelleswaram (A.P-1962)"అనే అంశంపై సమర్పించిన పరిశోధనా పత్రంలో చేసిన విశ్లేషణను పరిశీలించండి...

The megalithic builders have been recognized as the primary speakers of Dravidian Languages, and as an extra- vagent guests... the map of the Dravidian languages with their North Western outlier BRAHUI has been campared with in the distribution of megalithic cists with their little known but sufficiently definitive North Western groups - " అని !

నాగరకతను సంతరించుకున్న మానవుల సంస్కృతి-విశేషాలు ఎక్కువగా నియోలితిక్ (కొత్తరాతి) యుగంలో కన్పిస్తాయి. దాని పరిపక్వదశ మెగాలితిక్‌యుగం.



**ఆంధ్రప్రదేశ్, కర్నూలు జిల్లా కువ్‌గల్‌లో కనిపించిన రాతియుగంనాటి స్థావరం**

*ఒక్కో ప్రాంతంలో ఈ రాతి యుగ పరిపక్వదశ ఒక్కోకాలంలో ఒక్కోరకంగా ఉంది. ఆయా జాతులు ఇతర జాతులతో సంసర్గ- సంలీన-సాహచర్యాల ద్వారా సముపార్జించుకున్న ఉమ్మడి పరిజ్ఞానమే ఈ పరిపక్వతకు కారణమవుతుంది. ప్రపంచంలో ఏ జాతీ ఒంటరిగా అభివృద్ధి చెందలేదనేది ఇందుకే.*

రాతియుగ నిర్మాతలు దక్షిణభారతదేశంలో ద్రావిడ భాషాకుటుంబీకులేనని ఈ ఇద్దరు పరిశోధకులు తేల్చి చెప్పారు. మొదట తేలవలసిన అంశం ఇదే !

దక్షిణాదికి తరుమబడిన వారు ద్రావిడులయ్యారని సంస్కృత భాషా పండితులు చెప్పింది కట్టుకథేనని పూర్వద్రావిడులు దక్షిణభారతదేశంలో స్థానికులేననీ ఈ నిరూపణలు తేటతెల్లం చేస్తున్నాయి.

అలెగ్జాండర్ కొండ్రటోవ్ అనే పరిశోధకుడు *ద్రావిడభాషలు దక్షిణాది నుంచి ఉత్తరాదికి వ్యాప్తి చెందాయి. కాని, ఉత్తరాది నుంచి దక్షిణాదికి రాలేదు* – అని పేర్కొన్నాడు.

ఒక అద్భుతమైన ఊహ ఏమంటే, *ద్రావిడభాషలు ఉత్తరాదికీ, అలాగే పశ్చిమ దిశగా ఇతర ఆసియా, ఆఫ్రికాఖండాలకూ వ్యాపనం చెందిన మార్గాన్ని నిరూపిస్తూ, ఒక గీతని గీసినట్లయితే, దక్షిణ భారత దేశం నుంచి ఇరాన్ దాకా ఒకే తరహా జీవన వ్యవస్థ ఆ గీత వెంబడే కన్పిస్తుంది. దాక్షిణాత్య భాషలు-ఆఫ్ఘనిస్తాన్ ఇరాన్‌లలోని బ్రాహుయి భాషతో సహా ఈ వ్యాపనంలో మనకు ప్రముఖంగా కనిపిస్తాయని* పి.సి.గుప్తా, ప్రతాప్ దత్త పరిశోధకులు పేర్కొన్నారు.

బి.కె.థాపర్ తన "Bibliographyof IndianMegaliths" అనే వ్యాసంలో ఈ విషయాన్ని ప్రముఖం,గా పేర్కొన్నాడు. భాషా చారిత్రక పరిశోధనలకు ఈ అంశం చాలాముఖ్యమైంది.(దిక్వార్టర్లీ జర్నల్ ఆఫ్ మిథిక్ సొసైటీ ఏప్రియల్ 1970).

దక్షిణభారతీయుల జీవన వ్యవస్థ, వారి భాష, వారి సంస్కృతి, ఇరాన్ దాకా వ్యాపించాయని ఈ మహామహులు సోపపత్తికంగా నిరూపించారు. ఇందులో తెలుగు వారి పాత్రే ప్రముఖమైన అంశం.

దక్షిణాది ప్రజలు నాగరకత వ్యాపకులనే నమ్మకాన్ని తెచ్చుకున్న తర్వాత ఇప్పుడు అసలు విషయంలోకి వద్దాం.

1925లో టి.ఆర్. శేషయ్యంగార్ "*ది ద్రవిడియన్ ఇండియా*" అనే గ్రంథాన్ని రూపొందించారు. ఈ గ్రంథంలో "*ది మాన్యువల్ ఆఫ్ అడ్మినిస్ట్రేషన్ ఆఫ్ ద మద్రాస్*

ప్రెసిడెన్సీ" పుస్తకాన్ని ఉటంకిస్తూ ఒక అద్భుత విషయాన్ని వెలుగులోకి తెచ్చారు. డా.సి.మక్లెన్స్ అనే బ్రిటిష్ అధికారి చేసిన విశ్లేషణ ఇది- ***"చరిత్రకు అందని అత్యంత ప్రాచీన కాలంలో పరమ నాగరకులైన ప్రజలు బంగాళాఖాతం తీరంలో నివసించారు. వాళ్ళు సమస్త ప్రపంచాన్నీ ప్రభావితం చేయగల స్థితిలోవుండే వారు". ఆయన విశ్లేషణని బట్టి, దక్షిణాదిలో నాగరకత బంగాళాఖాతం తీరం వెంబడే విస్తరించిందని మనం అర్థం చేసుకోవచ్చు.***

మక్లెన్స్‌గారి నిరూపణల్ని ఎస్.మలయాండి కూడా ఉదహరించారు. *సింధు నాగరకతలోని లిపులలో అధిక భాగం పురాతన తెలుగు తమిళ లిపులను పోలి ఉన్నాయనేందుకు తగిన ఆధారాలున్నాయి. తెలుగు తమిళాలు సంస్కృత భాష కన్నా పురాతనమైనవే అని గట్టిగా చెప్పవచ్చు. ద్రావిడ భాషలు సంస్కృతం కన్నా ముందున్నవి, ఆ భాషలు భారత దేశం అంతా ఒకనాడు వ్యాప్తి చెందినవి అనడం అతిశయోక్తి కాదు."* అని మలయాండీ పేర్కొన్నారు.

ఈ నాగరక ప్రజలు బంగాళాఖాతంలోని ప్రముఖ రేవు పట్టణాల ద్వారా ఎగుమతులు దిగుమతులు వ్యాపార లావాదేవీలను నిర్వహించారని, వారికి భాష, సంస్కృతి, సొంత దేవతలు(మతము)వున్నారని పరిశోధకులు భావిస్తున్నారు.

బి.కె.థాపర్ గారి మాటల్లో చూడండి-"The megalithic tombs of the Indian peninsula by their lavish iron equipment appropriate to the iron age, while those of Europe are assigned to the stone age(Neolithic)"

ఈ విశ్లేషణల ప్రకారం దక్షిణ భారత నాగరకతలో లోహయుగంనడుస్తున్నప్పుడు యూరప్ తదితర ప్రాంతాలలో ఇంకా రాతియుగమే (Neolithic) నడుస్తోందని, అంటే, దక్షిణభారత నాగరకత ఒక అడుగు ముందే వుందని భావం.

ఇప్పుడు మనకు కావలసింది నాగరకత అభివృద్ధి విషయంలో తెలుగు వారి పాత్ర ఎంత వున్నదనే విషయం మీద విశ్లేషణ. ఏనాడో 1925లో శేషయ్యంగార్ లాంటి ప్రముఖ పండితులు పేర్కొన్న విషయాల్ని పరిశోధకులు భూస్థాపితం చేసి, వాటిని ఆధారాలు లేని అంశాలుగా కొట్టిపారేసినా ఆధునికంగా మళ్ళీ ఆ అలనాటి సిద్ధాంతాలు ప్రాణం పోసుకొని వెలుగులోకి వచ్చాయి. ఆనాడు వాళ్ళు చేసిన విశ్లేషణకు

కొనసాగింపుగా కొత్త కోణాలు ఆవిష్కృతం అవుతుండటంతో DISPROVED అన్నవే PROVE కావడం మొదలైనాయి.

అలాంటి ఆధునిక పరిశోధనల్లో డా.హెచ్.ఆర్ హాల్ అనే సుమేరాలజిస్ట్ రాసిన ***ది ఏన్షియంట్ హిస్టరీ ఆఫ్ ద నియర్ ఈస్ట్*** గ్రంథం చాలా విశేషాలను వెలుగులోకి తెచ్చింది. ఈ నిరూపణలు పరిశీలించండి.

1.... that (Sumerian) civilization first arose in India and was associated probably with the primitive Dravidians *ఆ (సుమేరియన్) నాగరకత మొదట భారత దేశంలోనే ప్రారంభం అయ్యింది. బహుశా అది పూర్వ ద్రావిడులకు సంబంధించినది కావచ్చు-"*

2) ... the ethnic type of the Sumerians, so strongly marked in these statues and reliefs, was as different from those of the races which surrounded them as was their language from those of the semites, Aryans, or others, they were decidedly Indian type ...అక్కడ దొరికిన విగ్రహాలు, శిలాఫలకాలు ముద్రికలపైన కన్పించిన వ్యక్తుల రూపాలను పరిశీలించినపుడు, ఆ సుమేరియన్ల రూపరేఖా విలాసాలన్నీ కచ్చితంగా ఇండియన్ టైప్ గానే ఉన్నాయి. ఆనాటి సుమేరియన్లతో కలిసి జీవించిన ఇతర జాతులు సెమైట్స్, ఆర్యన్స్ వగైరాల కన్నా వీరు భిన్నంగా కన్పిస్తారు.

3) The face type of the average Indian of today is no doubt much the same as that of his Dravidian race ancestors thousands of years ago...సగటు భారతీయుడి ముఖ కవళికలు నిస్సందేహంగా వేల సంవత్సరాల క్రితంనాటి పూర్వ ద్రావిడుల పోలికల్లోనే వుంటాయి.

4) .... and it is to this Dravidian ethnic type of India that the ancient Sumerian bears most resemblance, so far as we can Judge from his monuments. He was very like a southern Hindu of Deccan (who still speakes of Dravidian Languages) ...ఈ ద్రావిడ భాషాకుటుంబీకులైన దక్షిణ భారతీయుల పోలికలు ఆ ప్రాచీన సుమేరియన్ల పోలికలకు చాలా దగ్గరగా కన్పిస్తున్నాయి అక్కడ దొరికిన పురావస్తు సంపద ఆధారంగా పరిశీలించినప్పుడు ఆనాటి సుమేరియన్‌లు కచ్చితంగా

'ఈనాటి డెక్కన్‌లో(ఆంధ్రప్రదేశ్, కర్నాటక ప్రాంతాలు)నివసిస్తున్న హిందువు లాగానే వుంటాడు. ద్రావిడ (తెలుగు) భాష మాట్లాడుతున్న ప్రజల్లా వుండేవారు ఆనాటి సుమేరియన్లు'

డా. హాల్‌గారి మాటల్లో ఈ చివరి వాక్యం మనకు చాలా ముఖ్యమైంది. తెలివాహ నది ఒడ్డున అంధకపురంలో తొలి తెలుగు రాజధాని ఏర్పడిందని సిరివణిజ జాతక గ్రంథంలో చెప్పిన అంశానికి, కృష్ణా గోదావరి, తుంగభద్రా పరీవాహక ప్రాంతమైన డెక్కన్‌లో మొదటి నాగరక మానవుడు నివసించాడని డా.హాల్ పేర్కొన్న అంశానికీ చాలా దగ్గర సంబంధం వుంది. కృష్ణా, గోదావరి, తుంగభద్రా పరీవాహక ప్రదేశం మూల ద్రావిడుల నివాస స్థలం... ఇక్కడినించే ఇరాన్‌కు, సుమేరియాకూ సంబంధాలు నడిచాయి. ఈ పరిశీలనాంశాలకు కొసమెరపు అనదగింది డా. హాల్‌గారు తేల్చిచెప్పిన ఒకే ఒక అంశం- Sumerians might be a branch of the Indian Dravidians *సుమేరియన్లు, ఇండియన్ ద్రవిడియన్లలో ఒక శాఖకావచ్చు*నని ఆయన పేర్కొన్నారు.

బ్రాహుయీ భాష ఆఫ్ఘనిస్థాన్ దక్షిణ పాకిస్తాన్ ఇరాన్ లలో బాగా వ్యాప్తిలోఉండేది. ఇది డెక్కన్ నుంచి సుమేరియాకు వెళ్ళే దారిలో ఒక ముఖ్య కూడలిగా ఉండేదని పరిశోధకులు భావిస్తారు.

సుమేరియన్ నాగరకత తొలి నాగరకత అని చాలా మంది పండితుల విశ్వాసం. కానీ, ఆఫ్రికన్ సహారా నాగరకతని కనుగొన్న తర్వాత, అందులో ద్రావిడ భాషా రూపాలు అనేకం ఉన్నాయనే అన్వేషణ మొదలయ్యాక సుమేరియన్ నాగరకతకు ఆధారభూతాలయిన ఇతర ప్రాచీన నాగరకతల గురించిన ఆలోచన మొదలయ్యింది.

ద్రావిడ భాషా రూపాలు ఎక్కడ కనిపించినా వాటిలో ఎక్కువ పదాలు మన తెలుగు భాషా రూపాలకు దగ్గరగా ఉండటం సహజం. ఆనాటి పూర్వ ద్రావిడ భాష ఎలా ఉండేదని అడిగితే, ఇప్పుడు మనం మాట్లాడుతున్న తెలుగు భాషకు చాలా దగ్గరగా ఉంటుందని గట్టిగా చెప్పవచ్చు.

ప్రొఫెసర్ L.A.Waddell సుమేరియన్ భాషను ఆర్య భాషా కుటుంబానికి చెందినదిగా భావించాడు. The Makers of Civilization గ్రంథంలో ఈజిప్ట్, బాబిలోనియన్, సుమేరియన్ రాజవంశీకుల చరిత్రలు భారతీయుల పురాణాలలోను, ఇతిహాసాలలోనూ నిక్షిప్తమై ఉన్న వైనాన్ని వెలుగులోకి తెచ్చాడు.

"The new keys, which have unlocked for us the hitherto sealed doors of the inscriptions that enshrine this lost history of the past, are chiefly those that I found embedded in the Official king-lists and Chronicles of the early Aryans - that is the tall, fair and long headed race of Huxley, now usually called Nordic. through its purer elements now being located mostly in Northwestern Europe, including especially the British Isles and Scandivian and to which belonged the classic greeks, patrician Romans, Medo-persians, Hittites, early Phoenicians, the ancient Hindus, the Goths and Old Rhine and Danube tribes, ancient Britons, normans and Anglo Saxons".

ఇదే క్రమంలో Waddell 1927లో A Sumer-Aryan Dictionaryని రూపొందించాడు . సుమేరియన్ పదాలు ఎన్నింటినో ఒకచోట చేర్చి వాటికి ఇంగ్లీష్ అర్థాన్ని, సమానమైన సంస్కృతార్థాన్ని అందించే ప్రయత్నం చేశాడు.

నిజానికి ఇది గొప్ప ప్రయత్నం. కానీ, ప్రొఫెసర్ వాడేల్ ఈ పరిశీలనలో ద్రావిడ భాషా రూపాలను పరిగణనలోకి తీసుకోక పోవడం వలన గొప్ప పరిశోధనాంశాన్ని ఆయన కోల్పోయినట్లయ్యింది. ప్రొఫెసర్ L.A.Waddell తన డిక్షనరీలో సంస్కృతార్థాలను మాత్రమే ఇచ్చాడు. అయితే, అతికినట్లుగా అనేక ద్రావిడ భాషా పదాలు సుమేరియన్ పదాలతో సరిపోలి ఉండటాన్ని అప్పట్లోనే అనేక మంది పరిశోధకులు గుర్తించారు కూడా. కానీ, చరిత్రకారులలో కొందరిలో ఉన్న ఆర్య భాషాభిమానం ఈ పరిశోధకుల నోళ్ళు నొక్కేసిందని అనిపిస్తోంది.

1929లో "మిథిక్ సొసైటీ " జర్నల్‌లో ఆర్ యస్ వైద్యనాథ అయ్యర్ Sumero Dravidiyan and Hittite Aryan origin అనే వ్యాసంలో ద్రవిడియన్ల నుంచి సుమేరియన్లు, హిట్టయిట్లనుంచి ఆర్యన్లు రూపొందినట్లు నిరూపించే ప్రయత్నం చేశాడు.

1932"మిథిక్ సొసైటీ" జర్నల్‌లో "సుమేరియో ద్రవిడియన్ ఎఫినిటీస్" పేరుతో ఎ.ఎస్ త్యాగరాజు అనే తెలుగు పరిశోధకుడు అనేక సుమేరియా పదాలు ఇప్పటికీ తెలుగులో సజీవంగా ఉన్నాయని నిరూపిస్తూ మొదటిసారిగా ఒక వ్యాసం ప్రచురించాడు. కానీ, మన పరిశోధకులెవరూ వీటి ఊసు ఏనాడూ ఎత్తిన దాఖలాలు లేవు.

యల్ వి రామస్వామి అయ్యర్ 1929లోనే కొన్ని సుమేరియా పదాలను తెలుగు పదాలతో పునర్నిర్మించే ప్రయత్నం చేశాడు. Von A. Clemans Schoeners అనే జెర్మన్ పరిశోధకుడి విశ్లేషణలను ఇందుకు ఆధారంగా తీసుకున్నట్టు పేర్కొన్నాడు. ఈ ఉదాహరణలు గమనించండి.

1. "ar" (plough, bond uplift): "అర్" అనే ఈ సుమేరియన్ పదం వ్యవసాయానికి సంబంధించినది. నాగలి దీని అర్థం. తెలుగులో అరక (దున్నడానికి సిద్ధంగా ఉన్న నాగలి) అనే తెలుగు పదం దీనికి ఎంతో దగ్గరగా కనిపిస్తుంది. తమిళంలోను, తెలుగులో కూడా " ఏరు " అంటే ఎద్దులు కట్టిన నాగలి అనే. ఏరువాక అనే చక్కని తెలుగు పదం ఈ ఏరులోంచే ఏర్పడింది. ఇది కూడా సుమేరియన్ అర్ రూపానికి దగ్గరగా ఉన్న పదమే.

2.**సార్గన్** అనే ప్రభువు అక్కాడ్ చక్రవర్తి. క్రీ.పూ.2800నాటివాడు. సుమేరియన్ల నుంచి అక్కాడియన్లు నాగరకతని స్వీకరించారు. ఈ సార్గన్ ప్రభువు సగర చక్రవర్తి పేరుతో మన ఇతిహాసాలలో కనిపిస్తాడు. రామస్వామి అయ్యర్ ఈ సార్గన్ ప్రభువు పేరుని తెలుగు పదాలతో ఇలా విశ్లేషించాడు::

సరి - "straight" (సరి అయిన)

కొన - "highest of the high" (చక్రవర్తి)

"సరికొన"(సరిఅయిన చక్రవర్తి) అనే తెలుగు పదమే సార్గన్ అయ్యిందనేది ఆయన నిరూపణ.

3. చిన్నర్- సుమేరియాలో ఒక గ్రామం పేరు.

చిన్న+అర్-చిన్న ఏరు అని దీని అర్థం;

4. బాంబుర్-సుమేరియాలో ఇంకో గ్రామం పేరు

పాము(ంబు)+ఊరు-పామూరు, పాంబురు-నాగ పట్నం

కృష్ణా జిల్లాలో పామర్రు అనే గ్రామం ఉంది. శాసనాలలో ఇది పాంబర్రుగా కనిపిస్తుంది. ఇది సుమేరియన్ బాంబుర్ లాంటి గ్రామ నామమే.

ఇవన్నీ 70-80 ఏళ్ళనాడే పరిశోధకులు చేసిన విశ్లేషణలు. వీటిని తెలుగు పండితులు ఎలా విస్మరించగలిగారా అని ఆశ్చర్యం కలుగుతుంది. ప్రొఫెసర్ L.A.Waddell తన Sumer- Aryan Dictionaryలో ఇచ్చిన సుమేరియన్ పదాలకు బాగా దగ్గరగా ఉన్న కొన్ని తెలుగు పదాలను ఇక్కడ పొందు పరుస్తున్నాను.

| సుమేరియన్ పదాలు | ఆంగ్ల పదాలు | తెలుగు పదాలు, |
|---|---|---|
| aba | off, after, behind | ఆవల, అవతల (ఉదా- ఆవల ఎల్లుండి) |
| ad, at, adda | father, mother | అత్త |
| aka | cry, howl, pain | అకటా. అయ్యో |
| ala, alal | all, full, totality | ఎల్ల (everything) ఎల్లరు |
| ame, eme | mother, love grace | అమ్మ |
| ar, ara | plough, bond uplift | అరక |
| bad, bat | stave, wooden tool | బద్ద |
| bad, bat | strike, destroy, kill | బాదు |
| bir | break,tear, tent off | విరుచు |
| bur, bu, burn | worm, serpent, | పురుగు |
| dab, dib | dwelling, surround | దిబ్బ |
| dara, daru | fetter, vand, net | దారము |
| dim, | pillar, post, bar | దిమ్మ |
| dim | overwhelm,crush down, | దిమ్మిస- నేలచదును, దిమ్మెస- నేలచదును చేయు సాధనం |
| dim,dimma | weak in body and mind | దిమ్మరి, దిమ్మ(తెలివి, దిబ్బ, భ్రమము, వర్గము) |
| dirig | bend, bow down, | తిరుగు |
| du | go, come | దూకు |
| dur | prince, king, lofty | దురుసు, దొర |
| edit, etin | plain, field, desert | ఎడారి |
| elim, ilim | ram, leader of the herd | ఏలు, ఏలుబడి |
| er, eri, uru | fortified city | ఊరు |
| firiq, piriq | frightful, kill, grief | పిరికి |

సుమేరియన్, అక్కాడియన్, బాబిలనియన్, ఈజిప్షియన్ రాజవంశాల చరిత్రలు రకరకాల కథలుగా మన పురాణేతిహాసాలలో రికార్డయి ఉన్న మాట నిజం. కానీ, బౌద్ధ జాతక కథలలోను, ఇతర జైన సాహిత్యంలోను అనేక చారిత్రకాంశలకు మూలాలు ఉన్నాయి. పురాణేతిహాసాలను మాత్రమే భారతీయ సంస్కృతిగా భవించి, జైన బౌద్ధాలను విస్మరించడం వలన ముఖ్యంగా తెలుగు వారి చరిత్రాకు సంబంధించిన అంశాలను మనం కోల్పోవలసి వస్తోంది.

బాబిలోన్ లో zikkurat అనే ఏడంతస్థుల భవనం 300 అడుగుల ఎత్తయినది ఉంది. "సత్త భుమక పాసార " పేరుతో బౌద్ధ జాతక కథలలో దాని ప్రస్తావన కనిపిస్తుంది. అంటే, బాబిలోనియాతో భరతీయులకు గల సంబంధాలకు ఇది సాక్ష్యం.

ఇలాగే, సుప్పరక జాతక కథ (పాళీనెం. 463) లో ఆనాటి నావికుల పేర్లు కొన్ని తెలుస్తాయి. ఖరమల, అగిమల, దధిమల, కూసమల, నలమల, వలభముఖ... ఈ నావికులు ఒక బృందంగా బయల్దేరి, ఆఫ్రికా, అరేబియా, బాబిలోనియా, ప్రాంతాలను సందర్శించినట్లు ఈ జాతక కథలో ఉంది. భయంకరమైన జలప్రళయంలో వీరి నావా చిక్కుకున్నప్పుడు, సుప్పరకుడు తాను అంధుడేనప్పటికి తన అనుభవంతో నావను సురక్షితంగా భరుకుచ్చ తీరానికి చేరుస్తాడు. ఈ సుప్పరక పేరు శూర్పణఖ అనె పేరుకు దగ్గరగా ఉంది. నిస్సందేహంగా ఇది డెక్కన్ ద్రావిడ సంస్కృతికి సంబంధించిన కథే అయి ఉండాలి.

అలాగే, బావేరు జాతక కథ (పాళీ నెం. 330) బాబిలోనియా(బావేరు)లో వ్యాపార విశేషాలను తెలియ చేస్తుంది. కాకుల్ని తీసుకు వెళ్లి వాటిని నెమళ్ళుగా నమ్మించి అమ్మడం లాంటి వ్యాపార చిట్కాలు ఇందులో కనిపిస్తాయి.

ఇలా మెడిటరేనియన్ ప్రాంతంతో నడిచిన వ్యాపార సంబంధాలకు ఎన్నో సాక్ష్యాలు ఉన్నప్పటికీ, పురావస్తు పరంగా, అక్కడ మిగిలి ఉన్న బలమైన సాక్ష్యం ఒక చిన్న టేకు ముక్క మాత్రమే. ఈ టేకుముక్క మలబారు తీరానికి చేందినది కావచ్చునని పరిశోధకులు భావించారు. కానీ, ఆ ఘనతని కూడా కేరళకు దక్కనీకుండా, అప్పటి మలబారు తమిళ రాజ్యంగానే ఉందని దబాయించి, ఇది తమిళ టేకు ముక్కేనని తమిళులు రాసుకొంటున్నారు.

ఇంకో ముఖ్య విషయాం ఉంది. ఆనాటి మమ్మీ శవాలను భారత దేశం నుంచి తెప్పించిన నూలు వస్త్రంతో (muslin) చుట్టి ఉంచే వాళ్లని బాబిలోనియాలో దొరికిన ఒక రికార్డు చెప్తోంది. ఈ మజ్లిన్ నూలు బట్టని సింధ్ అని పిలిచేవాళ్ళట.సింధ్ అనగానే, సహజంగా పరిశోధకుల దృష్టి సింధు నాగరికత వైపు వెళ్ళింది. సింధు నగరాల నుంచి ఎగుమతి అయిన వస్త్రాన్ని ఇందుకు ఉపయోగించేవారని భావించారు..

జి. బ్రొన్నికోవ్ రూపొందించిన ద్రవిడియన్ ఎటిమాలజీ గ్రంథంలో central proto dravidian*(మధ్య ద్రావిడ పూర్వ రూపం)* send అంటే,వస్త్రం అని అర్థం ఉంది. ఈ మధ్య ద్రావిడ పూర్వ రూపం లోంచే తెలుగు భాష విడివడిందని భాషా పరిశోధకులు చెప్తారు.

central proto dravidian: send -cloth
central proto dravidian: send -r
central proto dravidian: send -r

ఈ సెండ్ రూపం బహుశా పూర్వ ముఃడా భాషలోంచి అరువు తెచ్చుకున్నది కావచ్చని కుడా బ్రొన్నికోవ్ పేర్కొన్నాడు.

సెండ్ రూపం తెలుగు భాషలో చఃదురు అనై పదంగా మార్పునొందింది. ఎర్రని వస్త్రం అని దీనికి అర్థం. కావి, కావిపుట్టము, తోపు, చందురు కావి, బొమ్మంచులు - ఇవన్నీ ఎర్రని వస్త్రా నికి పేర్లుగా తెలుగులో స్థిర పడ్డాయి. సంస్కృతాంధ్ర పదార్ణవంలో దిని వివరాలున్నాయి. ఈ సెండ్ అనే పూర్వ ద్రావిడ పదమే సుమేరియాలో సింద్ గా వ్యాప్తిలో ఉండి ఉంటుందని ఈ నిరూపణ తెలియ చేస్తోంది.

సుమేరియా నాగరకత, పూర్వ ద్రావిడ నాగరకతలు పరస్పర ఆశ్రయ ఆశ్రయీ భావంతో ఉండేవని కూడా అర్థం అవుతోంది. అంతేకాదు, సమీప వర్తిత్వం, లైదా సమీపత్వం ఇందుకు కారణం కావచ్చని కూడా అవగతం అవుతోంది. అ నాటి పూర్వ ద్రావిడ పదాలు సుమేరియన్ పదాలు ఈనాటికీ తెలుగులో సజీవంగా ఉన్నాయని చెప్పడమే ఈ పరిశీలన లక్ష్యం. తెలుగునేల వేదికగా సుమేరియాతో సంబంధాలు నడిచాయన్నది స్పష్టం

## *రాతి యుగంలో తెలుగువారి నైపుణ్యం*

సుమేరియాలోనూ, ఆఫ్రికాలోనూ ప్రాచీన ఇరాన్‌లోనూ అనేక ద్రావిడభాషా పదాలు కనిపిస్తోంటే పరిశోధకులలో కొత్త ఉత్సాహం మొలకలెత్తింది.

1960-70లలో ఇలాంటి విషయాలను విలువలేనిగా పరిగణించి పక్కన పెట్టినా, 2000వ సంవత్సరం తరువాత కొత్తగా అందుబాటులోకి వచ్చిన సిద్ధాంతాలు వాటికి మళ్ళీ ప్రాణంపోశాయి. ఈ కొత్త సిద్ధాంతాలలో పేర్కొనదగిన ముఖ్య అంశం రాతి యుగంలో ప్రోటో తెలుగు మాటడ్లాడిన ప్రజలు నిర్వహించిన ప్రముఖ పాత్ర.

తన ప్రతిబింబాన్ని చూసుకోగలిగినంత గొప్పగా మిర్రర్ పాలిష్ పట్టిన రాళ్ళు చెక్కలతో నిర్మించిన మయసభా మందిరంలో దుర్యోధనుడు భంగపడిన కథ మనందరికీ తెల్సినదే, అంత గొప్పగా రాళ్ళనూ, చెక్కలనూ పాలిష్ పట్టే విద్య ఆ నాటికే తెలుగు ప్రజలక్కాడా కరతలామలకమేనని తెలుస్తోంది.

అలా పాలిష్ పట్టిన వస్తువులతో పాటు, పాలిషింగ్‌కు ఉపయోగించిన పని ముట్లను కూడా కాంగ్రా జిల్లాలోని రోర్ వద్ద శ్రీ జి.సి.మహాపాత్రో కనుగొన్నారు. అవి, క్రీ.పూ.3000 నాటివి కావచ్చుని ఆయన అభిప్రాయ పడ్డాడు. సరిగ్గా అలాంటి పనిముట్లే ఖజకిస్తాన్‌లోనూ కనుగొన్నట్లు ఓక్లాదికోష్ రానోవ్ మొదలైన వారు ప్రకటించారు.

ఫెయిర్ సర్వీస్ అనే శాస్త్రవేత్తకు ఆఫ్ఘనిస్తాన్‌లో కొన్ని రాతి పనిముట్లు దొరికాయి.ఎఫ్ జారిగ్, ఆర్.హెచ్ మెడో కలిసి, బెలూచిస్తాన్‌లో బోలాన్ నది పక్కన మెహర్‌ఘర్‌లో జరిపిన తవ్వకాలలో ఇలాంటి రాతి పనిముట్లు క్రీ.పూ.5000 ఏళ్ళ నాటివి దొరికినట్లు పేర్కొన్నారు.

# 2.తెలుగునాట పండిన గోదుమలు

నిజానికి, నియోలితిక్ యుగం భారత దేశంలో 20 వేల ఏళ్ళ క్రితమే మొదలయ్యింది. దేశం వ్యాప్తంగా వున్న నదుల వెంబడి జీవరాసి విస్తరించ సాగింది. 10,000 ఏళ్ళ క్రితమే వరి, జొన్న లాంటి ధాన్యాలను వండుకుని తిన్నారు.

పూర్వద్రావిడులు దక్షిణ ఆసియాలోకి ఇరాన్ ఎగువ ప్రాంతాలలోంచి వచ్చారని వాళ్ళకు గోదుమలు తెలియవని. అందుకని వాళ్ళ భాషలో గోదుమలకు వేరే పేరు లేదని, సంస్కృత "గోధుమ" పదాన్నే వాళ్ళు వాడుకొంటున్నారని పరిశీలకులు భావిస్తూ వచ్చారు. కానీ, క్రీ.పూ.1900 నాటికే కృష్ణానది వెంబడి వున్న పంట భూముల్లో గోదుమలు యవలు, (బార్లీ) పండించారని పరిశీలకులు చెప్తున్నారు.

'గోదుమ' పదం ద్రావిడ పదమే ! ద్రావిడ భాషలో గోది అంటే లేత ఎరుపు రంగు. 'ఉమ్' అంటే ధాన్యం.'ఉమ్' చేయడంఅంటే, వడ్లుదంచి ధాన్యాన్ని వేరు చేయడం.

తెలుగులో ఉమలు అంటే ధాన్యమే ! గోద్+ఉమ -గోదుమ ఎర్రరంగు ధాన్యం అని ! ఇది చక్కని తెలుగుపదం తెలుగువారికి గోదుమలు అనాదిగా తెలుసు. సంస్కృత పండితులు ఈ 'గోదుమ' పదానికి 'వత్తు' చేర్చి వాటిని గోధుమలని పిలవడం మొదలు పెట్టారు.

మూలద్రావిడ రూపం "కోడ్" లోంచి "కుడు" (తినడం)అనే తెలుగు పదం ఏర్పడింది. 'కుడి చేయి' అంటే అన్నం తినే చెయ్యి అని ! "కుడి ముట్టు" అంటే అన్నం తినే కంచం. మనం కుడిచేది కాబట్టి కూడు అయ్యింది. తమిళభాషలో ఈ "కోడ్ " మూల ద్రావిడ రూపం కోట్, కోటి గా మారింది.

తొలి సంగమ సాహిత్యంలో కో-తుంపాయ్ అనే ప్రయోగం వుందనీ, అదే "కోటిగా" మారిందనీ మైకేల్ విజ్జెల్ అనే పరిశోధకుడు పేర్కొన్నాడు. దీనినిబట్టి చూసినా కోది (లేదా) గోది+ఉమ్- కోదుమ లేదా గోదుమ అవుతుంది. అంటే కూటిగింజలన్నమాట !

గోదుమ అనే పదం వివిధ జాతులతో ఎలా వ్యాప్తిచెందిదో మైకేల్ విజ్జెల్ చేసిన విశ్లేషణలో గమనించండి

ప్రాచీన ఈజిప్ట్ - క్రాండ్
ప్రాచీన హిట్టయిట్ - కాంట్
ప్రాచీన సెమైట్ - హ-అంట్
ప్రాచీన ఉత్తర ఇరాన్- గంట్-ఉమ్
ఉత్తర ఇరాన్ - గంట్ ఉమ్
పర్షియన్ - గండ్ ఉమ్
బెలూచిస్తాన్ - గండ్ ఉమ్
సంస్కృత భాష - గోద్ +ఉమ్ (గోదుమ)

ఈ రకమైన విశ్లేషణని పరిశీలించినప్పుడు ఆనాటి జాతుల వ్యాపనాన్ని, సంస్కృతి వ్యాపనాన్ని, భాషావ్యాపనాన్ని కొంతమేర అర్థం చేసుకోవడానికి అవకాశం కలుగుతుంది..

*ఇతర భాషల సంపర్కంతోనే ఎప్పటికప్పుడు భాషలు అభివృద్ధిని సాధిస్తూ కొత్త రూపాలను సంతరించుకొంటూ వుంటాయి.*

*అనేక యుగాలలో వివిధ దశలలో భాషలు పొందిన పరిణామాలకు వివిధ ప్రాంతాలలో కన్పించే మాండలికభేదాలే సాక్ష్యంగా కన్పిస్తాయి. మాండలికాలు కొత్త రూపాన్ని సంతరించుకున్న భాషకు నిన్నటి సజీవ రూపాలు కావచ్చుననేది అందుకే!*

అప్రతిహతంగా నాగరకతా వ్యాప్తిలో ముందుకు దూసుకుపోతున్న దక్కన్ నియోలితిక్ ప్రజలకు సింధునగరాలలో ఆర్యులతో ఏర్పడిన సంబంధాల ప్రభావం ఇక్కడ దక్కన్ మీద కూడా ప్రసరించిందనడానికి క్రీ.పూ.1900 నాటికే గోదుమలు, యవలు (బార్లి) పంటలు తెలుగునేల మీద కన్పించడం సాక్ష్యం. ఇదంతా సంస్కృతి వ్యాపించే క్రమంలో ఒక భాగం- ఉత్తర భారత దేశంలోని ఆర్యులు పశుపోషణ నుంచి వ్యవసాయంలోకి మరలుతున్న సమయం అది. డెక్కన్‌లో ప్రజలు వ్యవసాయం, పశుపాలన రెండింటినీ నిర్వహిస్తూ స్థిర నివాసాలు ఏర్పరచుకున్నారు.

పశుపాలన భారీగానే జరిగింది. పెద్దపెద్ద పశువుల మందలుండేవి. వ్యవసాయం ఫలవంతంగా వుండేది. కాబట్టి, *మిశ్రమ ఆర్థికవ్యవస్థ* నడిచింది ఆనాడు. ఎద్దులు ఎక్కువ. సింధు జాతి ఎద్దు మూపురాలతో పోల్చదగిన ఒంగోలు గిత్తలు ఈ నాటికీ మనకున్నాయి. సింధువల్లానే ఇక్కడా ఎర్ర మట్టి ఫలకాలూ ముద్రికలూ తయారు చేసుకున్న అలవాటు వుండేది. వాటి మీద రకరకాల జంతువుల్ని ముద్రించుకున్నారు.

క్రీ.పూ.2300-1900 మధ్య కాలంలో భారతదేశంలో చాలా చోట్ల ప్రకృతి వైపరీత్యాలు ఎక్కువగా సంభవించాయంటారు పరిశోధకులు.300 నుంచి 400 సంవత్సరాలపాటు కరువుకాటకాలు కరాళ నృత్యం చేశాయట.

పంటలు దెబ్బతిన్నాయి. పంటలతో పాటు వ్యాపారాలూ దెబ్బతిన్నాయి. సింధునగరాల పతనానికి ఇది ముఖ్యకారణం. కరువు వెంట కరువుతో యావద్భారతదేశం తల్లడిల్లిపోయి వుంటుంది. ఆ సమయంలో ఇక్కడి నించే బయటకు వలసలు జరిగి వుండాలి గానీ, బయట వారు చూస్తూచూస్తూ కరువు సీమలోకి రాలేరు కదా....

అంది వచ్చిన అవకాశంగా వెనువెంటనే వచ్చిన *"లోహయుగం"* మొత్తం దక్షిణ భారతదేశ స్వరూప స్వభావాన్నే మార్చి పారేసింది. తెలుగు వాళ్ళు ఈ అవకాశాన్ని అంది పుచ్చుకుని ఎంతో ముందుకు దూసుకుపోగలిగారు..

# 3. ఐరన్ యుగంలో తెలుగు వారి పాత్ర

దక్షిణ భారతదేశంలో కంచు యుగంలేదు. అడపాదడపా కంచు, రాగి వస్తు సరంజామా ఇక్కడా కన్పించినప్పటికీ కంచుపాత్రలు, కంచుబొమ్మలకు సింధునగరాలలో వున్న ప్రాధాన్యత ఇక్కడ లేదు. వైదిక క్రతువుల సమయంలో కంచు(లేదా)రాగి పాత్రల్ని ఉపయోగించడానికి కారణం ఉత్తరాదివారికి కంచు రాగి లోహాలు మాత్రమే తెలుసు కాబట్టి.

తెలుగునేల మీద ఇనుప లోహ పరిశ్రమ విస్తృతంగా సాగింది. ఉత్తరాదివారికి ఇనుము తక్కువ అందుబాటులో ఉండేది. ఆయుధాలు, వ్యవసాయ పనిముట్ల తయారీకి డెక్కన్ కేంద్ర స్థానం అయ్యింది. అది రాతియుగం చివర, ఇనుప యుగం తొలిభాగాల సంధి యుగం.

ఈ యుగానికి చెందిన సంగనకల్లు - కుప్పగల్లు (బళ్ళారి, కర్నూలు జిల్లా ప్రాంతాలలోని) రాతియుగ స్థావరాలను ఫుల్లర్ అనే పరిశోధకుడు (2003) *"ద్రావిడ భాషోత్పత్తి కొనసాగింపులు"*(Dravidian linguistic continuity) అన్నాడు.

తెలుగు నేలమీద నడిచిన లోహయుగం ఆనాటి ప్రపంచానికి ఎన్నో విలువైన పనిముట్లను సమకూర్చగలిగింది. పలుగులు, గొడ్డళ్ళు, పారలు ఇక్కడి నుంచి ఎన్నో ప్రాంతాలకు ఎగుమతులు అయినట్లు పరిశోధకులు భావిస్తున్నారు.

Intensive specialized Axe production supports the Nation that, southern Deccan Agricultural population were engaging in more intensive Trade activity at the end of deccan Neolithic period-అన్నారు- సంగనకల్లు కుప్పగల్లు స్థావరాలమీద అధ్యయనం చేసిన పరిశోధకులు.

ఒకజాతి ప్రజల్ని రూపుమాపి ఇంకో జాతి వారు వచ్చిన దాఖలాలు ఏమీ తెలుగు నేల మీద కన్పించలేదని కూడా పరిశోధకులు పేర్కొన్నారు. అంటే, దక్షిణాదికి తరుమబడినవారు ద్రావిడులు అనడం నిర్హేతుకం అన్నమాట.

## రెండు రంగుల కుండలు

ఇనుప యుగానికి మెగాలితిక్ యుగం అని కూడా పేరుంది. ఈ పెద్దరాతి యుగంలో ఇనుప పనిముట్లు మాత్రమే కాదు, కొత్త తరహా రెండు రంగుల కుండలు కూడా కన్పించాయి.

ఈ కుండలకు లోపలి వైపు నల్లగా వుండి బయటి భాగం ఎర్రగా ఉంటుంది. కుండ మూతి మాత్రం నల్లగానే వుంటుంది. ఇలాంటి కుండల్ని బ్లాక్ అండ్ రెడ్ వేర్ అంటారు. ఇది దక్షిణభారతదేశపు రాతి యుగానికి ప్రత్యేక లక్షణంగా పరిశీలకులు చెప్తారు.

ఈ నిరూపణలు ప్రాచీన కాలం నాటి దక్షిణ దేశంలో తెలుగువారి నైపుణ్యతని స్వతంత్రతని చాటి చెప్తున్నాయి.

ఒకే కుండకు లోపలివైపు నలుపు, బైటవైపు ఎరుపు వుండేలాగా కాల్చే నైపుణ్యంలోనే ఇదంతా వుంది. కుండలను తయారు చేసి తలకిందులుగా కాల్చటం వలన మంట నేరుగా కుండ లోపలికి వెళ్ళి దాన్ని కాలుస్తుంది. అందువలన మూతి దగ్గరా, లోపలి భాగానా నల్లగా వుండేవి.

అయితే, భాషాచారిత్రక కోణంలో ఒక ముఖ్య విషయాన్ని ఇక్కడ తప్పకుండా ప్రస్తావించాలి. ప్రసిద్ధ పరిశోధకుడు 'వి గోర్డాన్ ఛిల్డే' 1954 లో ***"న్యూ లైట్ ఆన్ ది మోస్ట్ ఎన్షియంట్*** ఈస్ట్" అనే గ్రంథంలో ఈ నలుపు ఎరుపు కుండల్ని కాల్చే విధానం క్రీ.పూ.4000 నాటికే ఈజిప్టులో అవలంభించారని పేర్కొన్నాడు. అంటే, ఆనాటికే పూర్వద్రావిడులకు ఈజిప్టుతో సత్సంబంధాలుండేవని అర్థం అవుతోంది.

సరిగ్గా ఇలాంటి కుండలే, సింధునాగరకత తొలిభాగం అయిన కథియవార్ (గుజరాత్)లో కూడా దొరికాయి. ఆ తర్వాతి కాలంలో పశ్చిమ భారత దేశంలోనూ, మధ్య భారత దేశంలో కూడా కన్పించాయి. అంటే, ఈజిప్ట్‌తో సహా నలుపు ఎరుపు కుండల్ని అందంగా కాల్చే విద్య డెక్కన్ తదితర ప్రాంతాలకు వ్యాపించిందని అర్థం అవుతోంది.

ఈజిప్షియన్లకు పూర్వ ద్రావిడులు నేర్పినా, పూర్వ ద్రవిడులకు ఈజిప్షియన్‌లు నేర్పినా క్రీ.పూ.4,000 నాటికే డెక్కన్‌తో ఆఫ్రికాకు సంబంధాలున్నాయనే విషయానికి ప్రాధాన్యాన్ని మనం ఇవ్వాలి. black & red ware showing maturity in technique and form suggest the intrusion of a perfect tradition-అన్నారు బి.కె థాపర్.

*డెక్కన్‌లో లోహయుగం ప్రారంభం అయ్యే నాటికే తెలుగు భాషోత్పత్తి మొదలైంది. అంటే సింధునగరాల మలిదశలో ప్రోటోతెలుగు ప్రజలు గణనీయమైన పాత్రని నిర్వహించినట్లు అర్థం చేసుకోవాలి.*

# 4. విబూది కుప్పలు

తెలుగునాట కన్పించిన రాతి యుగాల నాటి స్థావరాలలో ఇంకో ప్రత్యేకమైన అంశం వుంది. ఇక్కడ జరిపిన త్రవ్వకాలలో ఎక్కడ చూసినా పెద్దపెద్ద బూడిద కుప్పలు కన్పించాయిట. ఈ బూడిద చాలా ఎక్కువ ఉష్ణోగ్రతని ఉపయోగించి కాల్చిందిగా కన్పిస్తోందని చెప్తున్నారు.

మామూలుగా పిడకల్ని కాలిస్తే 700 డిగ్రి సెం.గ్రే. వరకు ఉష్ణోగ్రత వస్తుంది. అంత కన్నా ఎక్కువ ఉష్ణోగ్రత దగ్గర కాల్చినట్లు ఈ బూడిద సాక్ష్యం ఇస్తోంది. దీన్ని బట్టి ఇది కావాలని తయారు చేసిందేగాని ప్రమాదవశాత్తూ తగలబడింది కాదని తేలింది. బహుశా శివారాధన కోసం విబూది స్తూపాలు కూడా ఈ బూడిద కుప్పల్లో వుండి వుండవచ్చు.

తెలుగు నేల మీద జీవించిన చాల్కోలితిక్ రాగి యుగం ప్రజలు 1200 డిగ్రి సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రతని ఇచ్చి ముడి రాగిలోహాన్ని కరిగించి అందులోంచి స్వచ్ఛమైన రాగిని వేరు చేయగలిగారట. తెలుగునాట దొరికిన రాగి కన్నా సింధునాగరకతలో దొరికిన రాగి కొద్దిగా పచ్చగా వుంది. అంటే, అత్యధికంగా ఉష్ణోగ్రతను ఇవ్వగలిగే

నేర్పు సింధువులకన్నా తెలుగు వారి దగ్గర ఎక్కువగా ఉండేదన్నమాట. దీనికి కారణం తెలుగు నాట ఇనుము వాడకం ఎక్కువగా ఉండడమే.-

ఆర్కియోలాజికల్ డేటా ఆన్ మెటల్స్ ఇన్ సౌత్ ఇండియా- అనే వ్యాసంలో డా.ఎ.వి.యన్.మూర్తి (మైసూరు యూనివర్శిటి ఏన్షియంట్ హిస్టరీ ఆర్కియాలజీ ప్రొఫెసర్) ఈ విషయాన్ని రాశారు.

నిజానికి రాగి కన్నా ఎక్కువ ఉష్ణోగ్రత ఇనుమును కరిగించడానికి కావాలి. 1534 డిగ్రి సెం. వరకూ కావాల్సి ఉంటుంది. రాగి ముడి లోహంలో కన్నా ఇనుములో మలినాలు ఎక్కువ. పైగా ఇనుమును కరిగించే విషయంలో మరింత జాగ్రత్త కూడా అవసరం అవుతుంది. ఉష్ణోగ్రత ఎక్కువైతే ఇనుము బూడిదై పోతుందిట.

తొలి దశలో మామూలు ఇనుముని మాత్రమే ఉత్పత్తి చేసినా క్రీ.పూ.1000 నాటికి అత్యధిక ఉష్ణోగ్రతని అందించే ఉపాయాలు కనిపెట్టి నిర్మలమైన ఇనుముని ఉత్పత్తి



**కుప్‌గల్‌లో దొరికిన రాతియుగంనాటి బూడిద కుప్ప**

చేయగలిగారు. క్రీ.పూ1000నించి గ్రీకులు, రోమన్లతో సంబంధాలు పెరగడానికి ఈ ఉత్తమ ఇనుము ఎంతగానో తోడ్పడింది.

ఇరాన్, బెలూచిస్తాన్ నుంచి డెక్కన్ లోహయుగ ప్రజలు ఇనుమును కరిగించే టెక్నిక్స్ తెలుసుకున్నారని అల్లచిక్, బెనర్జీలు రాసిన దాన్ని ఖండిస్తూ ప్రొఫెసర్ మూర్తిగారు

రాగిని, బంగారాన్ని క్రీ.పూ 2000 నాటికే కరిగించడం నేర్చిన ప్రజలకు క్రీ.పూ1000 నాటికి ఇనుముని కరిగించడం పెద్ద విశేషంకాదని పేర్కొన్నాడు. ఈ పరిజ్ఞానం ఎవరికివారికి సొంతం. తండ్రి నుంచి బిడ్డకు, బిడ్డ నుంచి బిడ్డకు సంక్రమించేదే.

డి.బి.మూర్తి డేవిడ్‌రాజు అనే తెలుగు పరిశోధకులు ప్రకాశంజిల్లాలో చిలకపాడు, తదితర ప్రాంతాలలో ఆనాడు విలసిల్లిన కత్తుల పరిశ్రమ గురించి విశేషమైన విశ్లేషణని చేశారు. జర్నల్ మిథిక్ సొసైటి 1956 అక్టోబర్ సంచికలోఈ విశ్లేషణ వుంది.

డెక్కన్ నియోలితిక్ యుగం, డెక్కన్ ఐరన్ యుగాలు చరిత్ర గమనంలో ముఖ్యమైన అంశాలని ఈ నిరూపణలు చెప్తున్నాయి. ప్రపంచజాతులతో ముఖ్యంగా సింధువులతోనూ, ప్రోటోఆర్యులతోనూ, ప్రోటోతెలుగు ప్రజలకుగల సాన్నిహిత్యానికి ఇవి సాక్ష్యంగా నిలుస్తున్నాయి. రాతి యుగాల కాలంలో తెలుగు నేలమీద నాగరకత ఉంది. సంస్కృతి ఉంది. భాష ఉంది.

ఉత్తరాది ప్రజలకు, దక్షిణాది ప్రజలకు ఈ తెలుగునాగరకత ఒక వంతెనగా నిలిచింది.

తెలుగు ప్రజలు భారతీయ ఏకాత్మతని నెలకొల్పి హిందూ సంస్కృతికి రూపురేఖలు దిద్దిన వారిగా భావించాలి.

సంస్కృతం (లేదా) దేవభాష ఈ దేశంలో ఎంత ప్రాచీనమైనదో తెలుగు భాష కూడా అంతే ప్రాచీనమైనదని మనం సగర్వంగా చాటగలగాలి.

తెలుగువారిగా పుట్టినందుకు మనం గర్వించగలగాలి.

**TELUGE PRAACHEENAM**

**Dr. G.V. Purnachand**

ప్రసిద్ధ వైద్యులు, భాషా పరిశోధనలో తనదైన శైలిలో అకుంఠిత మైన దీక్షతో ముందుకు దూసుకు వచ్చిన డాక్టర్ జి.వి. పూర్ణచంద్ "తెలుగే ప్రాచీనం" అని నిరూపించడానికి తనకు అందుబాటులో ఉన్న శోధన సామాగ్రి ఆధారంగా చేసిన ప్రయత్నంలో నెరసులు వెతికే వారు ఉంటే ఉండవచ్చును. కాని, తెలుగు ప్రాచీనతను పొరుగు వాడు ప్రశ్నార్ధకం చేసినపుడు తగినన్ని ఆకరాలతో కొమ్ములు తిరిగిన పండితులు ముందుకు వచ్చి జాతి, లిపి, భాష, నాణేల, శాసనాల పరంగా చరిత్రను తవ్విముక్కుమీద గుద్దినట్టు విరుచుకుపడకుండా అచేతనావస్థలోకి జారుకున్నప్పుడు పూర్ణచంద్ సాహసంతో ఈ ప్రయత్నం చేశాడు. ఆయన తెలుగు ప్రాచీనత గురించి సీమాంత రాలు దాటి మెడలు చాచి మరీ చేసిన నిరూపణలతో, చూపించిన ఉపపత్తులతో విభేదించేవారుంటే ఉండవచ్చు. కాని ఆయన ఈ విషయాలపై "నడుస్తున్న చరిత్ర" లో ధారావాహికంగా రాస్తున్నప్పుడు సంతోషించిన వేలాదిమంది పాఠకులలో నేనూ ఒకడ్ని. ఈ ప్రయ త్నాన్ని గ్రంథకర్త మరింతగా కొనసాగించి పరిశోధనా ఫలితాల్ని చీకటి కోణాలపై సరికొత్త వెలుగులు ప్రసరింపజేసి తెలుగువారికి అందించగలరని ఆశిస్తున్నాను. ఆయనకు అండగా నిలవడం మన కనీస ధర్మం.

*– డాక్టర్ ఎ.బి.కె. ప్రసాద్*

